# నా మాట

స్త్రీ జనాళి ముందుకు రావాలనీ సమాన హక్కులు అనుభవించాలనీ సంఘం గొంతు వాచేట్లు అరవడం ఈనాడు కొత్త కాదు 'ఇందుకు మేం నడుము కట్టాం' అంటూ రచయితలూ కళాకారులూ ముందుకు రావడానికీ, సాంఘిక హక్కులు, ఆర్థిక సమానత్వం కావాలని వక్తలందరూ ఉపన్యాసాలూ ఇవ్వడానికీ కూడా ఇది కొత్త కాదు.

అయినా స్త్రీ అలంకార వస్తువుగానే చెల్లుబడి అవుతున్నది. ఆదర్శ వ్యక్తిత్వం పేరున అచేతన వస్తువుగానే మిగిలి పోతున్నది. ఇందుకు కారణాలు ఒక్కటి కాదు.

తన పరువు ప్రతిష్ఠ సంఘంలో నిలిచి వుండడానికి పురుషుడు స్త్రీ వ్యక్తిత్వాన్ని వంచినంతగా తన వ్యక్తిత్వాన్ని వంపు చేయడంలేదు.

ఆదర్శ పాత్రల రూపంలో రచయితలు సోదరి రచయిత్రులు స్త్రీ పాత్రలలో సహనం పేరున మందకొడితనాన్ని, పిరికితత్వాన్ని, భీరుత్వాన్ని తవ్వి పోస్తున్నారు. అందుకనే జీవితమంతా ద్రోహిగా బ్రదికిన భర్త కూడా ఆఖరి క్షణంలో "నే తప్పు చేసేను క్షమించు" అనగానే స్త్రీ లొంగిపోతుంది.

పాదాక్రాంత మవుతుంది. కన్నీరు కార్చుతుంది. అల్ప సంతృప్తి పొందుతుంది.

ఈ పిరికితనాన్ని చైతన్యరహితత్వాన్ని విశాలత్వంగాపొగిడి వంచన చేస్తున్నారు.వ్యక్తిత్వాలను తప్పుదారి పట్టిస్తున్నారు. మిథ్యా గౌరవాలను ఆపాదించి శూన్య నినాదాలను ప్రచారం చేస్తున్నారు.

సంఘము, తోటి మానవాళి ఆమెలోని ప్రతీకార భావాన్ని, చిత్త స్థైర్యాన్ని, కృతదీక్షను తొక్కిపడుతున్నాయి.

ఇన్ని ప్రతిబంధకాలను చీల్చుకుని స్త్రీ ఎప్పటికో ఒకప్పటికి మౌనంగానే అయినా శిరస్సు విదిల్చి కళ్ళలో నిప్పులు కురిపించి క్రోధపూరితయై కార్యగామి కాక తప్పదు. అలాంటి ఆశాకిరణమే ఈ నవలకు మూలం.

రచనకు జీవిత వాస్తవాలే ఆధార భూతాలయినా ఈ రచన ఏ ఒక్కరినీ ఉద్దేశించింది కాదు. సంఘంలో ప్రతిఫలించిన వివిధ వంకరగీతలే ఈ రచనకు ఉద్దీపకాలు.

గీతలు వంకరగీతలు గనక ఇందులో కొన్ని ఎదగడానికి, నిడుపుగా సాగడానికి అవకాశం లేదు.

హైదరాబాద్
15/4/64

మాధురీ లక్ష్మణ్

# 1

ఆరిస్టోక్రసీ మజాగా వుంటూందంటే వుంటుంది. జీవితాన్ని మసాళాగా మార్చి శారీరక శక్తులన్నింటికీ మత్తె క్కించగల హంగులన్నీ దానికి వున్నాయి. సంఘాన్ని ఉద్ధరించాలనీ, సమాజాన్ని సంస్కరించాలనీ వెర్రి వెంగళాయిలు ఎవరయినా అనుకుంటే అనుకోనవచ్చును గాక. అలాంటి వారినందరినీ నిర్లక్ష్యంగా పరిహాసం చేయగల ప్రయోజక శిఖామణులు ఎందరో అందులో వున్నారు.

జీవితాన్ని ముక్కలూ చెక్కలూ చేసి దానికి మిరియాలకారం, టేబుల్ సాల్టు దట్టంగా పట్టించడం వారికి చేత వచ్చు. అలా చేయడాన్ని ఎవ్వరయినా అసహ్యించుకుంటే వారిని పిచ్చి పుల్లాయిల క్రింద జమకట్టడంకూడా వారు నిశ్చయంగా చేయగలరు.

సంస్కార చిహ్నంగా రోజూ కాసేపు ఉపన్యాసం ఇవ్వడం, మర్యాద చిహ్నంగా అవినీతిని ఉపేక్షించడం, ఆరోగ్యం కోసరం రోజూ కాస్త మందు తాగి త్రేన్పడం వారి అలవాట్లు. గుర్రపు పందేలు వేయడంలోనూ, కుక్కపిల్లల్ని పెంచడంలోనూ వారి నాగరికత జీవకారుణ్యం పరాకాష్ఠ నందుకుంటుంది. పేకముక్కలు పరపరా కత్తెర్లు వేసి ఆటలు

కలిపి పచ్చచెక్కులు, చెత్త కాగితాల్లా విరిచి అవతల పార వేయడం వారి ఉదారతకు ప్రశ్నించరాని నిదర్శన.

అయితే విశ్వనాథంగారిలో ఈ పై లక్షణాలలో ఏ ఒక్కటైనా ఉన్నదా అంటే ఒక్కటి కూడా లేదు. ఒక్కటికూడా లేకపోవడం మాత్రమే కాదు ; అవంటే ఆయనగారి కొక రకమైన అసహ్యామూ, ఏహ్యామునూ.

విశ్వనాథంగారా పట్టణంలో పేరెన్నిక గన్న వ్యాపారి. ఎంత ఢక్కా ముక్కీలు తినిపించే వ్యాపారమయినా ఆయనగారు స్వయంగా చేపడితే పటకా పెట్టిన కుక్కలా వెంటపడి రావలసిందే. అలా అనుకుని ఆయనగార్ని అనుకరించబోయి బొక్కబోర్లా పడి దివాళాతీసినవారు అనేకమంది లేక పోలేదు. అందువల్లనే ఆయనతత్వం అత్యంత విస్మయ కారణమైందని నిస్సంకోచంగా చెప్పవచ్చు.

విజయభారతి ఆయనగారి ఏకైక పుత్రిక. రామలక్ష్మమ్మగారు ఆయనగారి ధర్మపత్ని. నాలుగంతస్తుల భవనం వారి నివాసం.

ఆ ధర్మపత్నే పెండ్లీడు కొచ్చిన పిల్ల విజయభారతి చెడిపోతున్నదని అదేపనిగా గునుసుకుంటున్నది.

"మదిరా! ఎప్పుడూ బజార్లుపట్టుకు తిరిగే ఆడదాని గౌరవం ఎంతకాలం నిలుస్తుందంటావ్ ? మన మనసు మంచిదయితేసరా జనం నోరు మంచిది కావద్దూ" అని రామలక్ష్మమ్మగారు నొచ్చుకుంటున్నది.

3

మదిర నవ్వు ఆపుకుంది. "అవును మామ్మా ! స్త్రీ అన్న తరువాత ఎంత అణకువ కావాలి ?" అని శ్రుతి కలిపింది.

ఆ ఇంట్లోనివారికి, ఇంటికి వచ్చేవారికి కూడా రామ లక్ష్మమ్మగారి అమాయకత నవ్వు తెప్పించుతుంది. కొన్ని దశాబ్దాలుగా ఎదగడం మానివేసిన ఆమె మానసిక వికాసపు మంచి తనం అంత హద్దులు మీరినటువంటిది.

"ఏమిచదువులో ! అయితే ముద్దూముచ్చటా లేకుండా నీవు ఇలా చదువుతూనే వుంటావన్న మాట ?"

"నాకేమి వచ్చెగాని మామ్మా ! ఈ సంవత్సరం విజయకు పెండ్లిచేయాలన్నారు గదా..."

మదిర తన మాట పూర్తి చేయకుండానే వీపుమీద రెండు వీశెల గుద్దుపడింది. మదిర గావుకేక పెట్టింది.

మదిర వీపుమీద అంతదెబ్బ వేసినందుకు రామలక్ష్మమ్మ లబ లబ లాడింది.

"లేకపోతే ఎవరెవరి పెళ్ళిళ్ళ గొడవో దీనికెందుకే. అంత మనసుపడితే తానే ఆ మూడుముళ్ళు గట్టిగా వేసుకో గూడదూ ?" అంది విజయ మందహాసం చేస్తూ.

మదిర ఉడికిపోయింది. "వేసుకుంటాను. వేసుకుంటాను. వేసుకుంటానో ! వేయించుకోకుండానే ఆ మూడు ముళ్ళూ వేయించుకున్నంత పనిచేస్తానో !" అంది అక్కసుగా.

"కోపం వచ్చినట్లుందేమే మదిరా ! ఎంతో కాలం తరువాత వచ్చేవుగదా ? ఈ కబుర్లేమిటి చెప్పు ? నీ కోసం

ఎన్ని బహుమానాలను దాచివుంచేను? కళ్ళుకాయలు కాచేట్లు ఎంతగా నిరీక్షించేను. రా! రా!" భారతి మదిరను బరబరా ఇంటిలోనికి ఈడ్చుకొని వెళ్ళింది.

విజయ ఉత్సాహంగా చెప్పసాగింది. "మదిరా! సంక్రాంతిపండుగకు రావలసిందని నీ కెన్నో ఉత్తరాలు వ్రాసేను. నీవు వచ్చేవే కావు. నాన్నగారు నా కెన్నో బహుమతులు తెచ్చేరు. అందులో ఎప్పటిలానే నీకూ సగభాగం. ఇవిగో! రెండు చక్కని షిఫాను చీరలు, ఒక రఫ్ కాటన్ శారీ, వాటికి మ్యాచ్ కాగల బ్లౌస్‌పీసెస్. ఇందులో నీకు మనసుకింపుగా వున్న వాటిని ఎన్నుకో. ఇకపోతే నాన్నగారు ఒక గోల్డ్ క్యాప్ పెన్, పెన్సిలు తెచ్చేరు. నాకు పెద్దగా వ్రాయవలసిన పని ఎలాగూ వుండదు కనుక పెన్సిలు చాలు. పెన్ నీవు తీసికోవచ్చు. ఇవన్నీ నచ్చేయా మదిరా!?" విజయ కండ్లు విప్పార్చి చూడసాగింది.

మదిర మౌనంగా తలఊపింది. సంతృప్తిని ప్రకటించింది. విజయ పొంగిపోయింది. మదిరను ఆలింగనంచేసుకుంది. కొంటెగా ముద్దాడింది.

"ఇవన్నీ నీకు నచ్చుతాయో లేవో అని ఎంతగా భయపడ్డానో!" అంది విజయ.

"అద్భుతం విజయా నీవెంత మంచిదానవో"

"నిజంగా? నీ కివన్నీ అంత బాగా నచ్చేయా? సరే ఇక చెప్పు నీ చదు వెంతవరకూ వచ్చింది?"

మదిర కనుక్కున నవ్వింది. "చదువుమీద ఇంత ఆసక్తి కలదానివి నీ వెందుకు చదువుకోవు విజీ!" అంది కుతూహలంగా.

విజయ మందహాసం చేసింది. "నీకు తెలియనిదేముంది మదిరా! విద్య కొందరికి అవాంఛితంగానే అలవడుతుంది. కొందరికి ప్రయత్నపూర్వకంగా కూడా పట్టుబడదు" అంది నిట్టూర్చినట్లుగా.

"కానీ మదిరా! నీవు చదువుకుంటున్నావుగా? చాలదూ! నీవు సాధించిన చదువూ సంస్కారం నాకు కొంత దానం చెయ్యలేవా?"

మదిర చిత్రంగా పాలరాతితో నిర్మితమైన ఆ శ్రవంతి నలుదిక్కులా కలయజూచింది.

"ఏం మదిరా? మాట్లాడవేం?"

"విజయా! అలాగే ఇస్తాను కానీ చదువు సంస్కారం ఇచ్చిపుచ్చుకునేవా?"

విజయ నవ్వింది. "అదేంసందేహమక్కా! సోదరి సంస్కారం కలది అయితే ఆమె ప్రభావం నామీద కించిత్తు అయినా లేకుండా పోతుందా? నాకదే చాలు."

మదిర ఉదారంగా చిఱునవ్వు నవ్వింది.

విజయ భారతి విశ్వనాథంగారి ఏకైక పుత్రిక. మదిర విజయభారతికి అత్యంత స్నేహిత హితైషి!! విజయ భారతి ఆమెను ఎంతో ఆప్యాయంగా 'అక్కా' అంటుంది.

అప్పుడప్పుడూ ఆ సంబోధన విని విశ్వనాథంగారు గుప్త

భావ వీధిలో సంతృప్తిగా మందహాసం చేస్తారు. అది విజయకు మరింత గర్వకారణ మవుతుంది.

"విజయా! ఒక వారం లోపల నేను యూనివర్శిటీలో సీటు వెదుక్కోవాలి.

విజయ ఎగిరి గంతు వేసింది. "ఏమిటీ? నీవు విశ్వవిద్యాలయంలో ప్రవేశించుతావా? ఇంతవరకు చెప్పేవే కావేం?"

"చేరాలి విజీ! కానీ ఇంకా సీటు దొరకాలిగదా?" ఆమె ముఖంలో సందేహం వ్యక్తమవుతుంది.

"సందేహించుతావేం మదిరా! నాన్నగారి శిఫారసేగా నీకు కావలసింది. ఆయన తప్పకుండా శిఫారసు చేస్తారు. నీవు ఎన్నో పెద్ద పెద్ద పుస్తకాలు చదువుకోవాలక్కా. నీవు సంపాదించిన విజ్ఞానాన్ని పదిమందికి పంచిపెట్టాలి, చూశావా అక్కా నేను నీకు కలం బహుమానం చేసేను. నీవు వెంటనే విశ్వవిద్యాలయంలో అడుగు పెడుతున్నావు!"

"అందుకు అసూయ పడుతున్నావా?" అంది మదిర.

"అదేం మాట అక్కా? నా అక్క అదృష్టానికి నా కసూయా?" అంది ఎంతగానో నొచ్చుకొని పెద్దగా బాధ పడిపోయి.

"వట్టినే అన్నానులే విజయా! బాధపడకు" అంది మదిర.

మదిరకు ఆనర్సులో సీటు దొరికింది.

"అక్కా! జ్ఞప్తిలో ఉంచుకో మనిద్దరి విద్యార్జనా నీవే చేయాలి. రెట్టింపు విజ్ఞానాన్ని ఆకళింపు చేసుకుని రావాలి" అంది విజయ భారతి మదిరను సాగనంపుతూ.

విశ్వనాథంగారు మదిరను చూసి సగర్వంగా నవ్వుకుని మీసాలు దువ్వుకున్నారు.

మదిరను చదువు కోసరమని దూరంగా పంపవలసి వచ్చినందుకు, సాగనంపడానికి వచ్చిన తల్లి మధురమ్మ కండ్లు నీటికొలను లయ్యాయి.

ఆ దృశ్యం చూసి విశ్వనాథంగారి నేత్రాలలో లీలా మాత్రంగా కన్నీటి పొర ఆవరించింది.

వారం రోజుల తరువాత మదిర వ్రాసిన లేఖ చూసి విజయ చకితురాలయింది. బిగ్గరగా నవ్వుకుంది. మదిర మీద జాలిపడింది. సానుభూతి వ్యక్తపరచింది.

"విజీ!. యూనివర్శిటీ నిజంగా ఎంత అద్భుతంగా వుంటుందో! ఇదొక విరబూసిన రంగు రంగుల పూలగుత్తి. ఇదొక అద్భుత ప్రపంచం. ఆనందం, సంతోషం వెల్లివిరిసే ఇలాంటి చోట విద్యార్జన చేయకుండా ఇంతవరకు జీవితాన్ని వ్యర్థపరచుకున్నానేమో! జీవితం అనిర్వచనీయమైనదని నీవు అప్పుడప్పుడూ అంటావే! ఇక్కడికి వస్తే అది ఎంత స్పష్టమైందో ఆనందదాయకమైందో, తప్పని సరిగా బోధ పడుతుం దనుకుంటాను.

ఇక వుండనా!

మదిర

ఉత్తరం చదువుకుని తన అక్క హృదయం ఎంత నిష్కపట మైందో అనుకుంది ! విజయ.

## 2

ఆ సాయంకాలం విజయభారతి గెంతుతూ, కేరుతూ ఇంటిలో అడుగు పెట్టింది. హాల్లో ఎవరో ఒక యువకుడు సోఫాలో కూర్చుని పుస్తక పఠనంలో లీనమయి వున్నాడు. ఆ నూతన వ్యక్తిని చూసి విజయ భారతి విస్మితురాలై ఠక్కున ఆగిపోయింది. అపరిచిత వ్యక్తి ఎవ్వరా అని సూక్ష్మంగా పరిశీలన చేయసాగింది.

విజయభారతి పాదాల సవ్వడి వినిపించి ఆవ్యక్తి కంగారుగా లేచి నిల్చున్నాడు.

"మీరు" అన్నాడు విచలితుడై. ఆమె ఎవ్వరో ఎందుకు వచ్చిందో అతనికి స్ఫురించలేదు.

విజయభారతి ఫక్కున నవ్వింది. తన ఇంట్లో తననే ఎవరు మీరని ప్రశ్నించుతున్న వ్యక్తి ఎవ్వరో ఆమెకు బోధపడ లేదు.

"ఏమిటే భారతీ ? అలా చూస్తావేం ? మన మావం గారబ్బాయి ఉపేంద్ర కాదులే" అంది రామలక్ష్మమ్మ.

"నమస్తే" అన్నాడు ఉపేశ ఒడ్డున పడి తేరుకున్నట్లుగా.

"ఛా! ఛా! నమస్కారం ఏమిట్రా! మేనగోడలిని చెవులు పుచ్చుకుని సాగదీసేందుకు బదులు నమస్కారం పెడతావట్రా" అంది రామలక్ష్మమ్మ మందలింపుగా.

"ఓహో! బావగారా!! నమస్కారం" అంది విజయ మాట విరిచి పలికి ఒయ్యారాన్ని ఒలకబోసి లోనికి నడుస్తూ.

ఉపేశ అప్పటికింకా తన కండ్లతో విజయను వెన్నాడుతూ స్థాణువై నిలిచిపోయే ఉన్నాడు.

"కూర్చోవయ్యా మగరాయుడా! ఇంకెందుకు నిల్చుంటావు? ఇలా అయితే నీ పరువు గట్టెక్కినట్లే" అన్నది రామలక్ష్మమ్మ లోనికి దారి తీస్తూ.

ఉపేశ అలాగే కూలబడి పోయాడు. అతని కండ్లలో విజయ స్వరూపం ఇంకా నిలిచే వుంది. నల్లని నీడలు దేరుతున్న ఛాయ. అందాలు వంపులు తిరిగిన శరీరపు హొయలు ఆకర్ణాంత నయనాలు చిరు అలలు తేరుతున్న ప్రవాహపు జాలులా నల్లని చిక్కని జుత్తు. నీలం రంగు ఒఫ్ కాటన్ శారీ.

"అమ్మా ఇలాంటి బావ వున్నాడని నాతో ఒక్కసారి కూడా చెప్పలేదేం" అంది విజయ భారతి కండ్లు తిప్పుతూ.

"ఎలాంటిబావే?! వాడెలాంటివా డనుకుంటున్నావ్? ఎంత బుద్ధిమంతుడో నీకేం తెలుసు. నాకు సయానా తమ్ముడి కొడుకు"

విజయ కిచ కిచా నవ్వింది. "అలాగా మమ్మీ? మరి ఒక్కసారీ మనింటికి రాలేదేం?" అంది విజయ.

"అదిగో! అదిగో! అదేనే విజయా ఆ మమ్మీ అనీ తిమ్మీ అని పిలవవద్దని లక్షసార్లు చెప్పేను. నోటి నిండుగా పిలవడానికి 'అమ్మా' అన్న పదం వుండగా ఈ దొరలతనం ఎందుకు? అంది రుంజుకుంటూ.

"అలాగేలే అమ్మా! అయితే బావ ఇక్కడే వుండి, చదువుకుంటాడంటావ్?

"ఏం అయితే? నీకేం బరువా? మీ నాన్నగారికి బరువా? వండి వార్చే వాడు వంటవాడు. అందరితోపాటు కాస్త తిని చదువుకుంటాడు."

విజయ మందహాసం చేస్తూ బాత్ రూమ్ వైపు నడచింది.

సాన్నిహిత్యానికి, అనుబంధానికి, అనురాగానికి, పరిచయానికి కాలమే కొలమానమైతే దానికి అర్థమూ నిర్వచనమూ కూడా వుండవు. ఉండటానికి వీల్లేదు. కొందరు వ్యక్తులు అత్యంత సాన్నిహిత్యం తరువాత కూడా పరిచయస్థులుగానే మిగిలి పోతారు. మరికొందరు అల్ప పరిచయం చేతనే సాన్నిహిత్యం ఏర్పరుచు కుంటారు. అది వారి జీవనౌన్నత్యాన్ని బట్టి ఆంతర్యపు రాగస్పందనను బట్టి వుంటుంది.

ఆ తరువాత రెండు రోజులకు విజయ, ఉపేక్ష షికారు

వెళ్ళివస్తూ ఇంటిలో అడుగుపెడుతూ పొట్టచెక్కలయ్యేట్లు నవ్వుకుంటున్నారు. ఉపేంద్ర అమాయకంగా విజయ కండ్లలోనికి చూస్తున్నాడు. విజయ నవ్వుతున్న దల్లా రామలక్ష్మమ్మను చూచి తమాయించుకున్నది.

"నిన్ను బజారుకు వెళ్ళవద్దని ఎన్నిసార్లు చెప్పానే విజయా! మన ఉపేంద్ర కాబట్టి సరిపోయింది. మరే మగవాడి ముందరయినా అలాగే నవ్వుతావా?"

"సరి సరి నేటికైనా ఒక రక్షక భటుడు దొరికాడు నీ పుణ్యమాని" అంది విజయ ఓరగా ఉపేంద్ర వంక చూస్తూ.

"ఇంకేం వాడ్నిప్పుడే బుట్టలో పెట్టాలన్న మాట!"

"నేనేమిటే అమ్మా! ఈ మహాత్ముడ్ని కావాలను కుంటే ఎవ్వరైనా బుట్టలో పెట్టగలరేమో" అంది విజయ.

ఉపేంద్ర లజ్జాభావాన్ని ప్రదర్శించి మౌనంగా వూరు కున్నాడు. "నువ్వయినా కాస్త జాగ్రత్తగా వుండు బాబూ. దానికి మరీ మంచీ చెడూ తెలియదు" అంది రామలక్ష్మమ్మ.

"అలాగే, అలాగే" అన్నాడు ఉపేంద్ర నవ్వుతూ.

"అంటే ఏం చేస్తావు బావా?" అంది విజయ వెక్కి రింపుగా.

"విజయా!" ఒకనాడు విశ్వనాథంగారే పిలిచారు. ఆయన కంఠస్వరంలోని కరుకుదనం గమనించి విజయ ఆశ్చర్య చకితురాలయింది. కుర్చీలో ఒక ప్రక్కగా ఒదిగి కూర్చుంది.

"నీవు అప్పుడప్పుడూ బయటికి వెడుతున్నావామ్మా?"

విజయ బెదరిపోయింది. భయంగా రామలక్ష్మమ్మ వంక చూసింది.

అవును నాన్నా ఎప్పుడయినా ఉబుసుపోకకు వెడుతున్నాను. ఒకగా హేమకుంతల కూడా వస్తున్నది. విజయ వగర్చుతూ చెప్పింది.

"వెళ్ళు విజయా! కానీ నీ వెక్కడికి వెళ్ళినా మన అంతస్తును నిర్లక్ష్యం చేయకూడదు. రిక్షాఎక్కి వెళ్ళవలసినంత అవసరం మనకేమిటి? ఒక కారు నీకోసం ప్రత్యేకించుతాను."

విజయ తలవంచుకుని కూర్చుంది. ఏ విషయాన్ని ద్దేశించి తండ్రి తన నీవిధంగా హెచ్చరించుతున్నాడో అవగతం కాలేదు.

"నాన్నా......" అంది పెదవులు వణకుతూనే.

"అవునమ్మా! ఆ కారుకు ఎలాగో డ్రైవరు అవసరం గనుక ఇంటిపనికి, అందుకుకూడ. పనికి వచ్చేందుకుగాను విలును పెట్టాను. విశ్వనాథంగారు మందస్మితం చేశారు.

విజయ ప్రయత్న పూర్వకంగా కృతక మందహాసం చేసింది. విశ్వనాథంగారు భోజనం ముగించుకొని వెళ్ళిపోయారు.

విజయ అర్థరహితంగా వెళ్ళిపోతున్న విశ్వనాథంగారి వంక, అక్కడే కూర్చునివున్న రామలక్ష్మమ్మగారి వంక శూన్యంగా చూసింది. "ఏమే విజయా? నీ సంగీతం సంగతి నాన్నగారితో చెప్పమంటే చెప్పలేదేం?" అంది అమాయకంగా.

విజయ అంత మనఃక్లేశంలో కూడా ఫక్కున నవ్వింది.

"ఏం ?" అంది రామలక్ష్మమ్మ.

"హార్మనీ వాయించడం వచ్చినంత మాత్రానే పెండ్లి అయిపోదు మామ్మా. ప్రస్తుతం కావలసింది కట్నం. ఆ తరు వాత అందం. అందుకు విజయకేం కొదువ లేదుగా ?" అంటూ ప్రవేశించింది మదిర.

విజయ, రామలక్ష్మమ్మ లిరువురూ ఆశ్చర్యంగా వెను దిరిగి చూచేరు. మదిర మందస్మితం చేస్తూ వారిని సమీ పించింది.

# 3

బ్రాహ్మణ్యం కరుడు గట్టిన ఇంటిలో హేమకుంతల తప్ప పుట్టింది. ఆమె స్నేహభావమూ, హృదయ విశాలతా వర్ణమతాలను అతిక్రమించినవి. ఆమె సాహసమూ సౌశీల్యతా ఎనలేనివి. వీటన్నింటికీ తోడు ఆమె సౌందర్యం మాంత్రిక శక్తి కలిగినటువంటిది. సౌందర్యమూ, సౌశీల్యమూ కూడిన స్త్రీ జాతకమే కాదు అదృష్టమే అదృష్టమైంది.

కానీ ఆమె అంటే విశాలాక్షమ్మగారికి చెడ్డ చిరాకు. తగనికోపం. తరతరాలుగా వస్తున్న ఆచారనియమాలను ఒక్క త్రుటిలో పుటుక్కున త్రెంచి వేయాలనే అభిప్రాయాలను వెలు

వరించే హేమకుంతల నాగరికభావం ఏమిటో ఆమెకు అర్థం కాదు.

"నీవు లక్ష ఆచార నియమాలు పాటించు. కానీ నా స్నేహితురాండ్రు వస్తే వారి చేతుల్లో పండుఫలాలు అంత ఎత్తునుండి పడవేసి వారిని చిన్నబుచ్చకు. అది నీ పవిత్రతకు సదాచారానికి నిదర్శనం కావచ్చుగాని వారి మనఃక్లేశానికి ఎంతగా కారణమవుతుందో గ్రహించేవా? నీ ఆచారనియమాలు తూచా తప్పకుండ పాటించదలచుకుంటే వారి నిక్కడికి పిలువకు" అంటుంది హేమకుంతల.

"ఊ నా ఆచార నియమాలను పాటించకనూ తప్పదు-నీవు స్నేహితురాండ్రను తీసుకొని రాకనూమానవు..." అని త్రుంచివేస్తుంది విశాలాక్షమ్మ.

అందువల్లనే ఆ ఇంటిలో ఎప్పుడూ రెండు పరస్పర విరుద్ధమైన సాంఘిక శక్తులు పని చేస్తున్నట్లు ఘర్షణ పడుతు తున్నట్లు వుంటుంది.

హేమకుంతల కాఫీ పుచ్చుకోందే ఏపనీ చెయ్యదు. విశాలాక్షమ్మ దేవతా పూజ కాందే పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టదు.

విజయలాంటి వ్యక్తి ఆ ఇంటికి వస్తే ఇద్దరికి మధ్య చక్కగా అతికిపోతుంది.

"ఈ దురాచారం నేను భరించలేనమ్మా విజయా!" అంటుంది విశాలాక్షమ్మ.

"మనిషి కొక మత ముంది. ఆ మతంలో కొన్ని కులాలని ఏర్పడ్డాయి. వాటిని గర్హించితే పోతాయా ? నిరసించితే నాగరకచిహ్నమా" అంటుంది ఆమె.

"ఇవి పచ్చి దురాచారాలు. మానవతను భ్రష్ఠాపితం చేస్తున్నాయి" అంటుంది హేమకుంతల. విజయ వారిద్దరికీ చిఱునవ్వుతో సమాధానం చెబుతుంది.

విశాలాక్షమ్మగారికి విజయ అంటే ఎంతో ఆప్యాయత, అనురాగం, అభిమానం అయినా విజయ కూర్చోవడానికి వరండాకు ఒకప్రక్కగా పాత చిరిచాపే వేస్తుంది. ఆమెకు ఏ ఫలహారం అందించవలసి వచ్చినా చేతితో అంత ఎత్తునుంచి పడవేస్తుంది.

అందుకే హేమకుంతల అవమాన పడుతుంది. గునుస్తుంది.

"నాకు లేని · అవమానం నీకెందుకు ? మామ్మగారి అభిమానం నాకు తెలియదా హేమా ?" అంటుంది విజయ.

విశాలాక్షమ్మగారు ముహం ఇంత చేసుకుని "అలాచెప్పు తల్లి అలా చెప్పు" అంటుంది.

ఉపేక్ష అలాంటివారి ఇంటిలో ఉంటున్నాడంటే విజయ ఆశ్చర్యపడింది. ముక్కు ముఖం తెలియని వ్యక్తి తమ ఇంటిలో వుండటానికి విశాలాక్షమ్మగారు ఒప్పుకుందంటే విజయ చకితురాలయింది. అంతలోనే బాధపడింది; ఉపేక్ష తనను ఉపేక్షించి మకాం మార్చినందుకు.

విజయ భారతి, మదిర ఉపేక్షను పరామర్శించటానికి కని హేమకుంతల గారింటికి వెళ్ళేరు. హేమకుంతల వారిని దూరంలో ఉండగానే పోల్చుకుని సాదరంగానే ఆహ్వానించింది.

"మీరిద్దరూ నాకెంతో సన్నిహిత వ్యక్తులే! అయినా మీరిద్దరూ కలుసుకోవడం ఇంతవరకు తటస్థపడనేలేదు." అని విజయ హేమను. మదిరను పరస్పరం పరిచయం చేసింది.

వారందరూ అలా నిల్చుని మాట్లాడుకుంటూ వుండగానే విశాలాక్షమ్మగారు నాత చిరిచాప పుచ్చుకుని నవ్వుతూ తయారయింది.

"హేమా! మీ ఇంటిలో ఉపేక్ష అన్న పేరుగలవ్యక్తి ఎవరయినా అద్దెకుంటున్నారా?" అని మాట మార్చివేసింది విజయ.

"ఉపేక్షా విజయా! ఆయన నెవరో మీ మేనబావగారట. మీ అమ్మ చెప్పింది. ఎంత బుద్ధిమంతుడనుకున్నావు?" అంది విశాలాక్షమ్మగారు చిరిచాప పరచడం మరచిపోయి.

"ఉపేక్షగారు మీ బావగారా?" అని ఆశ్చర్యపోయింది హేమకుంతల.

విజయ తలవంచుకుంది. "అవును హేమా! వారున్నారా?" అంది బాధగా.

"ఇప్పుడు కాలేజీ టైమ్ గదా" అంది హేమ.

విజయ నిట్టూర్చింది.

మదిర విసుగుదలగా నిల్చుంది. అదో అర్థంలేని బాధా పూరితమయిన క్షణం.

"సరే వెడతాం! వస్తాను మామ్మా!" అంది విజయ పొడిగా.

విశాలాక్షమ్మ చింకి చాప చేతితో పుచ్చుకునే విస్తు పోయింది.

# 4

ఉపేక్ష దీక్షగా చదువు కొనసాగించుతున్నాడు. విజయ నిశ్శబ్దంగా, నెమ్మదిగా వచ్చి అతనిముందు నిలచింది. ఆకస్మికంగా ప్రత్యక్షమయిన విజయను చూచి ఉపేక్ష కలవర పడ్డాడు.

విజయ భారంగా నిశ్వసించింది. ఉపేక్ష కలవరపడినం దుకు ఆమె వీపున ఛెళ్ళున చరచినట్లయింది. పెదవి కొరుక్కుంది.

"క్షమించు బావా! నారాక నీ కిష్టం లేదను కుంటాను."

"లేదు. లేదు. నే నలా ఎన్నడూ అనలేదు." అన్నాడు ఉపేక్ష.

"అయితే నేనిక్కడికి వస్తానని భావించలేదు కాబోలు!"

ఉపేతు కొంచెంసేపు మౌనం వహించాడు. "ఇందులో నేను భావించడానికి భావించకపోవడానికి ఏముంది నీవు...—"

"నేను.... ?"

"... ఎప్పుడయినా ఇక్కడికి రావచ్చు."

"నిజంగా నేను రావాలని ఉందా బావా నీకు ?"

ఉపేతు తెల్లబోయాడు. "అదేమిటి విజయా ! అలా ప్రశ్నించేవు? నాకు నీమీద అభిమానం లేకుండా వుంటుందా?"

"ఉంది. అలా అభిమానమే ఉంటే, నీవు ఇల్లు విడచి ఇలా అద్దెకుండవలసిన అవసరం ఏమిటి బావా ?"

ఉపేతు నిర్వాక్కుడయ్యేడు. విజయ చాపమీద పరచి ఉన్న దురుపుమీద కూర్చుంది.

"నీ ఏకాగ్రతకు భంగం కలిగించే ననుకుంటాను."

"ఇందులో ఏకాగ్రతేముంది. పదిమంది వున్నచోట చదవడం, నామనసుకు పట్టదు. ఇక్కడ ఎంతో నిశ్శబ్దంగా వుంటుందని అత్తయ్య చెప్పింది. విశ్వనాథంగారు కూడా సరేనన్నారు."

ఈసారి విజయ త్రుళ్ళిపడింది. "అలాగా!" అంది. "అలాగయితే సరేలే బావా! ఎక్కడయినా నీ చదువు సాగడం కదా ప్రధానం."

"ఈయన మీ బావగారా అక్కా! నాకు తెలియనే తెలియదే ?!". అంటూ ఎదురుగా వచ్చింది హేమకుంతల ఉపేతుకు నమస్కరిస్తూ. "బావా లేదు గీవా లేదు ఉపేతు !"

అన్నాడు ఉపేత రెండో వైపుకు తలత్రిప్పుకుని.

విజయ ముఖం ఎర్రగా కందిపోయింది. ప్రయత్న పూర్వకంగా నవ్వు తెచ్చుకొనబోయింది.

"కాదంటే కాకుండా పోతారు కాబోలు!" అని ఫక్కున నవ్వింది హేమ.

"విశాలాక్షి బామ్మ లేదా హేమా?" అని సంభాషణ మరల్చ బోయింది విజయ.

"లేదు. మీ ఇంటికే వెళ్ళింది. నాకు కాస్త తీరిక దొరికింది." "ఉపేతగారూ ఇంతకూ మీరు చదువుతున్న దేమిటి?" మళ్ళి మామూలు ధోరణిలో పడింది హేమకుంతల.

"బి. ఏ;"

"అయితే రేపటినుండి నాకు ట్యూషను చెప్పాలి?"

"నేనా?"

"ఆఁ. అందుకేగా అమ్మ మీరిక్కడ వుండేందుకు అనుమతించింది. లేకుంటే...." హేమ నాలుక కరచుకుని ఆగిపోయింది.

విజయ నిట్టూర్చింది "అదృష్టవంతురాలివే హేమా" అంటూ.

"హేమా!" విశాలాక్షమ్మ గారు మెట్లమీదనుండే బిగ్గరగా పిలిచింది.

"అబ్బ. మళ్ళీ ఇంతలోనే వచ్చింది విజయా!" అంటూ

హేమకుంతల తుర్రుమంది.

ఉపేశు విజయలమధ్య నిశ్శబ్దం తాండవించింది.

"....బావా!"

"ఏం విజయా!"

"నీ విక్కడికి వచ్చింది వాస్తవంగా ఏకాగ్రత కోస మేనా?"

"అవును" అన్నాడు ఉపేశు తొట్రుబాటుగా.

"అందుకే ట్యూషను బాధ్యతకూడా స్వీకరించేవు కాబోలు!"

"విజయా! నీవు నమ్ము నమ్మకపో. ఈ విషయం నా కిప్పుడే తెలిసింది. ఆత్మవంచన చేసికొనేంత బలహీనుడ్ని కాదు నేను".

విజయ వివర్ణం పొందింది.

"క్షమించు బావా. నీ చిత్తశుద్ధి మీద, హేమకుంతల స్నేహభావం మీద నమ్మకం లేనంత నీచమైన దాన్ని కాదు. కానీ నావల్లనే నీకు మనస్తాపం కలిగి వుంటే...."

"విజయా! నీవీ విషయాన్ని ఇంతగా తరచి అనవస రంగా వ్యధ చెందుతున్నావు."

విజయ విషాదంగా నవ్వింది. "కావచ్చు బావా! కొందరు అత్యంత స్వల్పవిషయాలకుకూడా నొచ్చుకుంటారు. బాధపడతారు. దయాపూరితులు ఎవరైనా వుంటే వారిని దయతలచి వారి భయసందేహాలను నివృత్తి చేస్తారు. వస్తాను." విజయ చీర చెంగును భుజాలమీదికి లాగుకుని నేలవంక చూస్తూ

చరచరా నడచి వెళ్ళింది.

ఉపేక్ష స్తంభించి పోయాడు.

విజయ ఇంటికి చేరుకొనేప్పటికి రామలక్ష్మమ్మగారు భగవద్గీత చదువుకుంటున్నది.

"అమ్మా! ఉపేక్షబావకు అద్దెగది ఏర్పాటు చేసింది నీవేనా?" అని ప్రశ్నించింది తీక్ష్ణంగా.

"నేనా? ఆఁ మేడమీది గదిలోకి నాన్నగారి స్నేహితుడి కొడుకు ఎవరో విరంజనరావని వస్తాడని చెప్పేరు. ఆపైన, వాడుకూడా మనుషుల రద్దీ లేని చోటు బాగుంటుందని అనుకున్నాడు" అంది రామలక్ష్మమ్మగారు. విజయ నిర్ఘాంతపోయింది. సమస్య స్పష్టంగా విడిపోయింది. ఒకప్రక్క ఆగ్రహం మరొక ప్రక్క నిస్పృహ కూడా పొంగివచ్చేయి.

"అయితే ఉపేక్ష తనంతట తనే వెళ్ళిపోయే డంటావు?" రామలక్ష్మమ్మగారు తడబడింది. "అలాగే చెప్పేడుగా? ఏమయిందే విజయా? ఏమయింది?" అని ప్రశ్నించింది.

"ఏమీ లేదు వట్టినే అడిగాను"

"ఏమే విజయా! ఉపేక్ష అక్కడుంటే ఏమయింది. కావలిస్తే మరలా రావచ్చుగా?" అంది రామలక్ష్మమ్మగాగు. అంతలోనే విజయ దగ్గరకువచ్చి.

విజయ విషాదంగా నవ్వింది. మనుషులు "మనం రమ్మన్నపుడూ వచ్చి పొమ్మన్నప్పుడల్లా పోరమ్మా" అంది విజయ సోఫాలో నీరసంగా పడుకుని.

"అంటే !!"

"నీ కర్థంకాదు కాని ఊరుకో అమ్మా !" అంది విజయ ముఖం త్రిప్పుకుంటూ. ఇంటిముందర కారు వచ్చి ఆగిన చప్పుడు వినిపించింది.

పచ్చని న్యూ మోడలు అంబాసెడరు కారులోనుంచి విశ్వనాధంగారు విరంజన్ దిగేరు. విజయ అంతర్యం చలించింది. ముఖం పీక్కుపోయింది. తలనొప్పి వచ్చినట్లయింది.

విరంజన్ కారు దిగడంతోనే విశ్వనాధంగారు ఎంతో ఆప్యాయత ప్రదర్శించేరు. మేడవైపు చేయిచూపి ఏదో తెలియ జెప్పేరు. విశ్వనాధంగారి ఆల్సేషియన్ కుక్క తోకాడించు కుంటూ వచ్చింది. విరంజన్ రావును చూచి భౌ, భౌ మని మొరి గింది. విశ్వనాధంగారూ, విరంజనరావూ ఇంటిలో అడుగు పెట్టేరు.

విజయ నిట్టూర్పు విడిచి కాళ్ళీడ్చుకుంటూ వచ్చి బెడ్ మీద పడుకుని నిండుగా ముసుగు పెట్టింది.

తరువాత రెండు గంటలకు వంటమనిషి నాయరు వచ్చి "నాన్నగారు భోజనానికి రమ్మంటున్నారమ్మా !" అంటూ పిలిచాడు.

విజయ ఉలిక్కి పడింది, "ఇంకా ఎవరున్నారక్కడ?"

"ఎవరూ లేరు. ముగ్గురికి భోజనం వడ్డించమన్నారు. మిమ్మల్ని రమ్మన్నారు." నాయరు వెళ్ళిపోయాడు.

విజయ లేచి చల్లని నీటితో ముఖం కడుక్కుంటి.

మామూలుగా వుండటానికి ప్రయత్నించింది. అయినా ఆమె ముఖం బురదనీటిలో మునిగి తేలిన పద్మాన్నే పోలివుంది.

విశ్వనాథంగారు విజయను చూస్తూనే ఆశ్చర్య పోయారు. "ఏమిటమ్మా అలా వున్నావు? ఒంట్లో బావు లేదా?" అన్నారు.

ఆయన ముఖంలో ఆశాభంగం ప్రస్ఫుటమయింది.

విరంజన్ ఆయనకు వెనకనే నెమ్మదిగా నడచివచ్చేడు.

"ఈయ నెవరో నీకు తెలుసా? విశ్వాసరావుగారని నా బాల్యస్నేహితుడు అప్పుడు. ఆయనకొడుకు. పేరు విరంజన్" అని పరిచయం చేసేరు.

విరంజన్ ఎంతో ఆనందాన్నీ విజయోత్సాహాన్నీ ప్రక టించుతూ విజయకు నమస్కరించ బోయేడు ఆమెను అప్పుడే చూస్తున్నట్లుగా.

"ఈయన నాకు ఇదివరలోనే తెలుసు నాన్నా" అంది విజయ విరంజన్‌ను ఓరకంట చూస్తూ.

విరంజన్ అదిరిపడ్డాడు. అతని ముఖం జేవురించింది.

విశ్వనాథంగారు ముఖం చిట్లించుకున్నారు "ఇదివరకే తెలుసా?" అంటూ.

"మన థియేటరు ప్రారంభం చేసిన రోజున మీరే విరంజన్ గారిని పరిచయం చేసేరు."

"అదేం విరంజన్? విజయ నీకు పరిచయం లేదని చెప్పేవు?"

విరంజన్ తట్టుకున్నాడు "అవును ఇప్పుడే స్ఫురణకు వస్తున్నది. ఆనాడు మీరు పరిచయం చేసేరు. కానీ మీ డాటర్ అన్న విషయం చెప్పడం మరిచేరనుకుంటాను" విరంజన్ తడబడుతూ మాట సర్దుకున్నాడు. అవమానంతో ప్రజ్వరిల్లిన క్రోధం వ్యక్తమయింది.

విజయ తలవంచుకుంది.

"విజయా! విరంజన్ మన కత్యంత ఆప్తుడు. వాళ్ళ నాన్నగారికి నాకు చిరకాలం నుండి సన్నిహిత సంబంధాలున్నాయి. విరంజన్ కేదో పదిరోజులు పనులున్నాయన్నాడు. సరే ఎలాగూ అయినవాడు గదా అని ఇక్కడే వుండమన్నాను ...."

విజయ తల ఎత్తి పరిశీలనగా తండ్రి ముఖంలోనికి చూసింది. విశ్వనాథంగారు తన ధోరణిలో తాను చెప్పుకొని పోతూనే వున్నారు.

"వాళ్ళ నాన్నను పిలువనంపినా ఎక్కడా అజాపజా వుండడు. సరే విరంజనన్నా పదిరోజులుంటాడు గదా అని మన యింటిలోనే వుండమన్నాను.....విరంజన్ నీవిక్కడ క్రొత్త వ్యక్తిగా, భావించుకోనవసరం లేదు....విజయ నీకెలాగూ పరిచయమేగా......"

విశ్వనాథంగారు విజయవైపు పరికించ బోయారు. విజయ తలతీసినట్లయి చటుక్కున తలవంచుకుంది. భోజనం ముగించి "క్షమించండి" అంటూ సింక్‌లో చేతులు

కడుక్కుంది.

"నాన్నా ! నుదురు పోటుగా వుంది. కాస్త త్వరగా నిద్రపోతాను." విజయ గబగబ అక్కడనుండి వెళ్ళిపోయింది విరంజన్ వైపు చూపయినా ప్రసరించకుండా. విరంజన్ ముఖం చిన్నబోయింది. విశ్వనాథంగారు "అలాగే ! అలాగే !" అంటూ ఊ కొట్టి "ఆ విరంజన్ మీ నాన్నగారు ఇన్సూరెన్సు ఎంత కట్టారన్నావు ?" అని మామూలు ధోరణిలో పడ్డారు.

విజయ విడచిపోయిన గరళాన్ని వెగటుగా మ్రింగు కుంటున్న విరంజన్ విశ్వనాథంగారి ప్రశ్నకు వెంటనే జవాబు చెప్పలేక పోయాడు. "నాకు పూర్తిగా తెలియదండీ నాలుగు లక్షలుంటుంది అనుకుంటాను."

విశ్వనాథంగారు కప్పు ఎగిరిపోయేంత బిగ్గరగా నవ్వేరు.

"ఇలా డబ్బు వృధా ఎందుకు చేస్తావు విశ్వాస్" అని ఎన్నోమార్లు చెప్పేను. ఎందుకూ ఉపకరించని ఇన్సూరెన్సు ఎందుకు చెప్పు ? ఎప్పుడో ఎవ్వరో అనుభవించగలరని ఇప్పుడు డబ్బు తగలెయ్యడం తప్ప. ఇంతటి వయస్సులో ఆ పాతసైకిలు తొక్కుతూ తిరగవలసిన గతి ఏమిటి ? లాభం లేదు విరంజన్ లాభం లేదు. డబ్బు విలువ అందరికీ తెలియదు. ఉపయోగించ డం అంతకన్న తెలియదు.

కారు కొనడానికి ఆయనకు ప్రాణం ఒప్పదనుకో ! ఇక్కడ మనకు రెండు కార్లున్నాయి గదా ఒకటి తీసుకొని

పోయి ఉపయోగ పర్చుకోగూడదూ ?"

విరంజన్ ముఖం ఇంతయింది. విశ్వనాథంగారికి డబ్బు వెనకాముందూ ఎటునుంచో వచ్చి ఎటునుంచో ధారాపాతంగా ఖర్చయిపోతుందని తెలుసుగాని డబ్బును గురించి ఆయన మరీ ఇంత నిర్లక్ష్యంగా మాట్లాడతారని తెలియదు.

"నాన్నగారికి డబ్బు వృధాగా ఖర్చుపెట్టడం అంటే నచ్చదు" అన్నాడు సిగ్గుపడుతూ.

విశ్వనాథంగారు ఇంకొకసారి బిగ్గరగా నవ్వేరు. "ఇది డబ్బు విరంజన్ ! డబ్బు!! ఖర్చు పెట్టడమే దానికి సరైన విలువ. ఈ చేతితో సంపాదించి ఆ చేతితో ఖర్చు పెడతాం. దానిని ఐరన్ సేఫ్‌లో దాయడం దేశానికి ద్రోహం"

విరంజన్ నిశ్చేష్టితుడై చూస్తున్నాడు.

విశ్వనాథంగారు గొంతు పొరబోయి మంచినీళ్ళు త్రాగుతుంటే విరంజన్ అచేతనంగా అలాగే చూస్తుండి పోయాడు.

# 5

"హేమా! ఉపేటుగారున్నారా?" అంటూ విజయ విశాలాక్షమ్మగారి ఇంటిలో అడుగు పెట్టింది.

హేమకుంతలకు విచిత్రమనిపించింది. చేతి వ్రేళ్ళు మడిచి లెక్కించింది. కిలకిలా నవ్వింది. బుగ్గలు సొట్టలు పడేట్లు చేసింది. చెక్కిలి మీద వ్రేలు నొక్కుకుంది. ఓరగా కండ్లు త్రిప్పింది. పైట చెరగు క్రిందికి జార్చింది.

"ఉపేక్ష గారున్నారా? అంటే అలా మోనో యాక్షన్ ప్రారంభించేవ్? ఏమైనా కలలు కంటున్నావా ఏం?"

"ఏం లేదు విజీ! ఈ వారంలో నీవు మా గృహం ఎన్ని పర్యాయాలు పావనం చేసేవా అని ఎంచుతున్నాను. ఇంతకూ ఈ శ్రద్ధ ఎవరి మీద?" హేమ గూఢభావంగా నవ్వింది మళ్ళీ.

విజయ గతుక్కుమంది ఆమెలో చలనం నిలిచిపోయి శిలావిగ్రహ మయింది. నేత్రాలలో గిరున కన్నీరు తిరిగింది. ముఖం చిన్నబోయింది. కంది పోయిన ముఖంతో వెనుకంజ వేసింది.

హేమ తెల్లబోయింది. విజయ అంతగా ఎందుకు బాధ పడిందో ఆమెకు అర్థంకాలేదు. మెరుపులా వెళ్ళి విజయ దారికి అడ్డం నిలిచింది. క్షమించు విజీ! ఇంత స్వల్ప విషయానికే నీకు మనస్తాపం కలగవలసిన అగత్యం వుందని నేను ఎన్నడూ భావించలేదు. నేను కేవలం హాస్యం కోసరమని అన్నాను గాని నీ మనసు కించపరచడానికి మాత్రం కాదు. ఈ చిన్న విషయానికే బాధపడతావా? నన్ను క్షమించ

లేవా ?

విజయ కండ్లవెంట బొటబొట కన్నీటి బిందువులు పడ్డాయి. అధరాలు వణికాయి.

"నిన్ను అనవలసిన పనేమ్యుంది హేమా ! ఇదే ప్రశ్న ఎవరయినా వేయవచ్చు" అని కన్నీరు తుడుచుకుంది నిర్గమించడానికి కుద్యమించుతూ.

''విజీ నీవిలా మనసు కష్టపెట్టుకొని వెళ్లిపోతే నామీద ఒట్టే. నీ చెల్లికి అంత శిక్ష విధించకు" అంది హేమకుంతల బాధగా.

ఇంతలో ఎవ్వరో మేడమెట్లు దిగుతున్న సవ్వడి వినిపించింది. విజయ, హేమ ఇద్దరూ పైకి చూచేరు. ఉపేక్ష నెమ్మదిగా క్రిందికి దిగివస్తున్నాడు. విజయను చూడగానే అతని అధరాలమీద చిఱునవ్వు మొలకెత్తింది.

"ఉపేక్ష బావా ! విజీ నీ కోసరం వచ్చింది. నిన్ను కలుసుకోనకుండానే తిరిగి వెడుతున్నది".

"స్పీవో" నేనో తన మనసుకు కష్టం కలిగించేము కాబోలు!" "మనసుకు కష్టం కలిగినా యథావిధిగా చిఱునవ్వులు ఒలకపోయడం నాకు రాదు మరి" విజయ తల వంచుకునే అంది.

"ఏమిటది విజయా ? నీవు చెప్పదలచుకుంది స్పష్టంగా చెప్పవచ్చు"

"స్పష్టంగా చెప్పవలసింది నేను కాదు"

"మరి ?"

విజయ కండ్లెత్తి ఉపేక్షవంక తీక్ష్ణంగా చూచింది హేమవైపు చూచి సందేహించింది.

హేమ తెల్లబోయింది. తన ఎదుట కూడా విజయ కింకా రహస్యాలున్నాయని ఆమె ఎన్నడూ భావించలేదు. వెంటనే అక్కడనుండి వెళ్ళబోయింది.

"ఆగు హేమా! నీ దగ్గర కూడా నాకింకా రహస్యాలు ఏర్పడలేదు. ఇందులో దాపరికం ఏముంది?" విజయ హేమకుంతల చేయి పట్టుకొని నిలిపింది.

"బావా నీకు మనస్తాపం కలిగించిన విషయం ఏమిటో చెప్పవా?

అనుకోనని ఈ ప్రశ్న విని ఉపేక్ష నిర్విణ్ణుడయాడు. ఒక్క క్షణం గొంతుకు ఏదో అడ్డుపడినట్లయింది.

"నీ వంటున్న దేమిటో నాకు బోధపడటం లేదు"

"అబద్ధం. అర్థమయే జవాబు ఇవ్వడం తప్పించుకొన జూస్తున్నావు. పదిరోజులనుండి నీవు ఎప్పుడు భోజనానికి వస్తున్నావో ఎప్పుడు వెడుతున్నావో అమ్మకు కూడ తెలియదు. ఇలా మమ్మల్నందరినీ నిరసించి వెలివేయవలసిన అపరాధం మేమేం చేసేము"

"పొరబడుతున్నావు విజయా! యధాలాపంగా అలా జరిగినంత మాత్రాన నీవు అపార్థం చేసుకుని ఇన్ని అర్థాలు తీసుకొన నవసరంలేదు."

"అంతేనా?"

"అంతే"

"సరే అయితే" విజయ కన్నీరాపుకుంటూ చగచరా నడచి

ఉపేక్ష మౌనంగా నిలిచిపోయాడు.

"బావా గాయపడిన హృదయాన్ని ఓదార్చడానికి బదులుగా మరింత విచారాన్ని కలిగించుతున్నావు" అంది హేమ.

ఉపేక్ష విషణ్ణంగా నవ్వేడు. "కాదు హేమా, మనః క్లేశాన్ని మొక్కలోనే త్రుంచి వేస్తున్నాను. అది ఎదిగి కొనలు సాగితే వ్యక్తిత్వాన్నే హరిస్తుంది" అన్నాడు ఉపేక్ష అక్కడనుండి కదలిపోతూ.

విజయ ఇంటికి చేరుకొనేప్పటికి విరంజన్ ప్రయాణ మవుతున్నాడు. విశ్వనాథంగారు అతన్ని దగ్గరుండి సాగ నంపుతున్నారు.

"విజయా! విజయా! మన విరంజన్ వెడుతున్నాడు" అంటూ పిలిచేరు విశ్వనాథంగారు. విజయ అప్పటికే వారిద్ద రికీ దూరంగా వెళ్ళిపోయింది. విరంజన్ ముఖం కందగడ్డ అయింది.

# 6

మానవుడిలో ఒక్కొక్కప్పుడు విచిత్రమైన మార్పులు సంభవించుతాయి. ఎందుకూ పనికిరాని చవట పాత వెండి రూపాయలా చలామణి అవుతాడు. ఎంతో వివేకంతో ప్రవర్తించే వ్యక్తి అర్థక్షణంలో పప్పులో కాలువేయడం కద్దు. అలాగే ఒకోసారి ఒకో మనిషిలో అర్థాంతరంగా అవ్యాజాను రాగం ధారాపాతంగా ప్రవహించుతుంది. మనం భూత అద్దం వేసుకుని వెదికినా అందుకు సరయిన కారణం కనిపించదు.

"ఏదైనా వ్యాపారం పెట్టు విశ్వాస్" అని విశ్వనాథంగారు అంటే "ఎందుకు లెస్తూ వడ్డీ దండగ?" అన్నారు విరంజన్ తండ్రి విశ్వాసరావుగారు.

"ఏవ్యాపారం నిర్వహించాలన్నా లక్షల రూపాయలు పెట్టుబడి వుండాలి. పదిమంది పనివాళ్ళు లేకుండ వ్యాపారం నిర్వహించడం అసాధ్యం. ఎవరి తత్వం ఎలాంటిదో! గుడిలోని లింగాన్ని గుడిని కూడా మింగగల ప్రబుద్ధు లుండడం కద్దు. ఆపైన ఒకటికి రెండింతలు సాగదీసి హెచ్చవేసి లెక్కించి అమ్మకం పన్నులు, ఆదాయపు పన్నులు వసూలు చేయ గానికి ప్రభుత్వం కండ్లలో వేయి వత్తులు వేసుకుని

గమనిస్తున్నది.

ఈ బాదరీ బందీ అంతా ఎందుకు? కాగితం మీద సంతకం గీకించుకుని డబ్బు పారవేస్తున్నాం. అవతలి వాడు ఎప్పుడయినా మొరాయించుతాడే అనుకో. వాడి మెడలు విరచి అసలు ఫాయిదాలతో డబ్బు వసూలుచేసి మన పాదాలదగ్గర పోయడానికి కోర్టులు నిక్షేపంలా వుండనే వున్నాయి.

నీవు ఎన్ని వ్యాపారాలు చేస్తే మాత్రం అంతకన్న ఎక్కువ ఆదాయం తీయగలవా? అంటారు విశ్వాసరావుగారు అనర్గళంగా ఉపన్యసించినట్లుగా.

"సరి. సరి. నీ థీసిస్ అనుసరించితే ప్రపంచంలో అందరూ వడ్డీ వ్యాపారులు కావలసిందేనే? సాఫీగా నవ్వుతారు విశ్వనాథంగారు.

"వ్యాపారం అని పెట్టి ఎంత డబ్బు తగలబెడుతున్నావు సుమా" అని విస్తుపోతారు విశ్వాసరావుగారు.

"నువ్వు ఎంతగా వద్దనుకున్నా నిన్ను వ్యాపారంలోనికి దించక తప్పదనిపించుతున్నది. అందకని మొన్న కొన్న సినిమా థియేటరు నీ పేర పెట్టాను" అన్నారు విశ్వనాథం ఒకనాడు.

"నా పేరనా?" విశ్వాసరావుగారు విస్మయం చెందేరు

"అవును బిజినెస్ యక్స్పాండ్ అయిన కొద్దీ పన్నులు కూడా తలకు మించిన భారమవుతాయి. కనుక ఓనర్ షిప్

నలుగురి పేర పెట్టక తప్పదు. మొన్న సమయానికి రెండు మూడు లక్షలున్నాయి. థియేటర్ బేరాని కొచ్చింది. 'సరే' అనుకొని నీ పేర పెట్టేను. పోనీ నీ కవసరం లేకపోతే నా క్రిందనే వుంటుంది. అవసరం అయినప్పుడు సంతకాలూ గట్రా చేస్తూవుండు" అన్నారు విశ్వనాథంగారు.

విశ్వాసరావుగారు తబ్బిబ్బులయ్యారు. విశ్వనాథంగారి మీద ఆయన కెక్కడలేని ఆప్యాయతా పుట్టుకొచ్చింది.

"నాతో మాటమాత్ర మయినా చెప్పకుండా ఇంతపని చేసేవా విశ్వం" అన్నారు.

"ఇదే మయినా కొంపమునిగే వ్యవహారం అయితే కదా చెప్పవలసింది? ఇందులో నయాపైసా నష్టం లేకపోగా కావలసినంత లాభం వస్తుంది. దివాళా తీస్తూ తప్పనిసరి పరిస్థితులలో సినిమా థియేటరు అమ్ముకున్నాడు గాని ఈ రోజునే మరలా దాన్ని అమ్మితే లక్షన్నర లాభం వస్తుంది. పోనీ లాభనష్టాల గురించి నీవు బాధపడ లేదుగా" అన్నారు విశ్వనాథంగారు.

విశ్వాసరావుగారు మౌనంగా వూరుకున్నారు. ఆయన జాగ్రత్త అంత ముందుచూపు కలది.

"జరిగిన సంవత్సరంలో లక్ష లాభం వచ్చింది విశ్వాస్" అన్నారు విశ్వనాథంగారు ఒకసారి లాభనష్టాలు తేల్చుతూ.

విశ్వాసరావుగారు తన చెవులను తాను నమ్మలేక పోయాడు.

"లక్ష లాభమా? మూడు లక్షల పెట్టుబడికి?"

"అన్నను థియేటర్ కు ఇంకో పాతిక వేలు రిపేర్ కూడా చేయించాము."

విశ్వాసరావుగారి తల గిర్రున తిరిగింది. తాను నిత్యమూ శ్రమపడి వసూలు చేస్తున్న నెలసరి వడ్డీ లక్షా యాభయి వేల రూపాయల ముందర దిగదుడుపుగా కనిపించింది.

"ప్రస్తుతం ఈ మొత్తం నీ పేరనే బ్యాంకులో డిపాజిట్ చేయించుతాను. ఏమంటావు?" అన్నారు విశ్వనాథంగారు.

విశ్వాసరావుగారు తన ప్రపంచంలో మూడులక్షల రూపాయలకు ఎన్నాళ్ళకయితే లక్షన్నర రూపాయల వడ్డీ పెరుగుతుందో అంచనా వేసుకుంటున్నారు.

"నా పేరనున్న క్యాషంతా నీపేర మార్చుతాను విశ్వం. నీవే వ్యాపారం నడుపు. ఈ వడ్డీల బెడద నాకెందుకు?" అన్న మాటలు పెదవిదాకా వచ్చేయి. కానీ తమాయించు కున్నారు. "నీకు ఎప్పుడయినా డబ్బు అవసరం అయితే వాడుకోవచ్చు. అలాగే బిజినెస్ కు కూడా డబ్బు అవసరం అవుతూ వుంటుంది" అన్నారు విశ్వనాథంగారు.

విశ్వాసరావుగారి మనస్సు వికలమయిపోయింది. కుప్ప తెప్పలుగా వచ్చిపడుతున్న వ్యాపార లాభాల ముందర కాల హరణంతో కూడుకొన్న వడ్డీ వ్యాపారం వట్టి అవివేకమని అనిపించింది.

విశ్వాసరావుగారొకనాడు హటాత్తుగా "నేనుకూడా

వ్యాపారంలో దిగదలుచుకున్నాను" అన్నారు.

విశ్వనాధంగారు హుందాగా మందహాసం చేసేరు "సరే నీ యిష్టం" అంటూ.

విశ్వనాధంగారు ఎంతో శ్రద్ధగా మరో సినిమాథియేటరు విశ్వాసరావుగారి కిప్పించారు. ఎలా అయినా వ్రాతకోతలు వ్రాతకోతలే గనుక విశ్వాసరావుగారు అంతా పకడ్బందీగా తన పేర పెట్టించుకున్నారు.

"ఈ వ్యవహారం అంతా నీ చేతి మీదుగా నడపవలసిందే సుమా. నీవు లేకుంటే నేను ఈ సినిమా థియేటరు కొనకనే వుందును" అన్నారు విశ్వాసరావుగారు తాను కొన్న థియే టరు వంక కన్నెత్తిచూస్తూ. అందుకు అనువుగా విశ్వాసరావు గారి పేరనున్న రెండు సినిమా థియేటర్లలోనూ ఒక అణా వాటా విశ్వనాధంగారి కిచ్చి ఆయనకు మేనేజింగ్ పార్టనర్ షిప్ ఇచ్చేరు. అప్పటికి కాని ఆయనకు సంతృప్తి కలగలేదు.

# 7

వందిర యూనివర్శిటీలో చేరిన తరువాత వారం రోజు లకు ఒకసారివచ్చింది. అంతే!ఆతరువాత విజయకు మొక్కుచెల్లించి నట్లుగా రెండు వుత్తరాలు వ్రాసింది. ఆ తరువాత ఆరు

మాసాల వరకు మదిర అజాపజా లేదు. ఎప్పటి కప్పుడు "నాకు డబ్బుకావాలి" అన్న రెండుముక్కల ఉత్తరం తప్ప మరో కబురు మధురమ్మ అందుకోలేదు.

"పై చదువులని ప్రారంభించింది. మళ్ళీ దానికి ఇంటి మీద దృష్టేలేదు" అని దుఃఖపడింది మధురమ్మ.

"ఉత్తరాలు కూడా వ్రాయకూడనంతగా చదవాలా నాన్నా !" అంది విజయ.

"యూనివర్శిటీ చదువు కాదమ్మా! ఎంత గట్టిగా చదివితే ఫస్టుక్లాసొస్తుంది!" అన్నారు విశ్వనాధంగారు.

ఉన్నట్లుండి మధురమ్మకు పెద్దగా జబ్బుచేసింది. డాక్టరు హార్టు యన్‌లార్జ్ అయిందని తేల్చిచెప్పాడు. ఆయాసం, నీరసం అధికంగా వస్తున్నాయి.

మదిరకు కబురు పెట్టారు. యూనివర్సిటీ హాస్టల్లో లేదని విహార యాత్రకు వెళ్ళిందని తెలియ వచ్చింది. మధురమ్మ క్రుంగిపోయింది.

"వస్తుంది. ఫరవాలేదు. యస్కర్షన్ నుండి తిరిగిరాగానే అదే వస్తుంది.'' అని ధైర్యం చెప్పారు విశ్వనాధంగారు.

రెండవసారి మరలా కబురు పంపేరు. కానీ మదిర ఢిల్లీనుండి తిరిగివచ్చి మధురమ్మగారి అస్వస్థత వార్త విన్న తరువాత కూడా కలకత్తా వెళ్ళిందని తెలిసింది.

విశ్వనాధం గారది విని గతుక్కుమన్నారు. మదిర అంత సాహసం చేయగలదని అంత నిర్లక్ష్యంగా వుండగలదని ఆయన

ఎన్నడూ భావించలేదు.

మదిరలో వస్తున్న మార్పేమిటో విజయకు అవగాహన కాలేదు.

"ఏం చదువో! చివరికి నన్ను చూడటం కూడా దానికి బాధ అయిపోతున్నది" అని కుళ్ళిపోయింది మధురమ్మ.

"ఇప్పుడది చదివితే వచ్చిన నష్టం ఏమిటి మధురా?" అని విసుక్కున్నారు విశ్వనాధంగారు పరధ్యాన్నంగా.

విజయ అదిరిపడి చూచింది విశ్వనాధంగారు మధురమ్మను "మధురా!" అని సంబోధించడం విని.

"అది ఏం వల్లకాని పనివల్ల వెళ్ళిందో తప్పనిసరిగా వచ్చేస్తుంది" అని ఓదార్చేరు విశ్వనాధంగారు.

"అది పెద్ద చదువులు ప్రారంభించింది. ఎవరి మాటనూ చెవిని వెయ్యడంలేదు." మధురమ్మ క్రుంగిపోయింది.

"అదేమిటి పిన్నీ చదువుకున్న అక్కలోని సంస్కారాన్ని సందేహించుతావా ?" అంది విజయ.

"ఆందోళన పడదు. పాపం చదువుకున్న అమ్మాయిగదా అని పెళ్ళీడు కొచ్చిన పిల్లను అలా వదిలేస్తారా?" అని సాగదీస్తూ వెళ్ళింది రామలక్ష్మమ్మగారు.

"విజయా ! నీవయినా ఇప్పుడే ఒక ఉత్తరం వ్రాసి పడేయమ్మా అంది దీనంగా మధురమ్మ.

"అలాగే పిన్నీ" అంటూ కదలి వెళ్ళింది విజయ. మధురమ్మ నీరసంగా మంచంమీద పండుకొనివుంది. ప్రక్కనే విశ్వ

నాథంగారు తల ఒంచుకుని కూర్చున్నారు.

"ఏమండీ!" మధురమ్మ ఎంతో జాలిగా పిలిచింది.

"దానిమనసు నాకు తెలుసు. నాకన్న ఎంతో బల హీనమైెం దది. దాన్ని ఒక యింటిదాన్ని చేయరూ?" మధు రమ్మ గావురుమంది.

"అలాగే. అలాగే దాన్ని నా స్వంతకూతురులా చూసు కుంటాను" అప్పుడే అక్కడికి వస్తున్న విజయవైపు తిరుగు తూనే అన్నారు విశ్వనాథంగారు.

"మదిరకు వచ్చినభయం ఏమీ లేదు. ముందు నీ ఆరోగ్యం సంగతి చూసుకోవమ్మా" అన్నారు విశ్వనాథంగారు పట్టిపట్టి.

"విజయా!"

"ఏం పిన్నీ?"

"మదిర నీకు స్నేహితురాలు. ఎవ్వరూ చెప్పకున్నా దాన్ని ఇంతవరకూ నీ స్వంత అక్కలాగానే చూసుకుంటు న్నావు...."

విశ్వనాథంగారు తలవంచుకుని విసవిసా అక్కడినుండి నడిచి వెళ్ళిపోయారు.

విజయ తెల్లబోయింది. విశ్వనాథంగారలా విసవిసా ఎందుకు నడచి వెళ్ళారో ఆమెకు అర్థం కాలేదు.

మధుర రెండుక్షణాలు మౌనం వహించింది. విశ్వనాథం గారు వెళ్ళినవైపు అలానే చూచింది. సన్నని కన్నీటిధార క్రమ్మింది.

"అలా బాధపడతారెందుకు పిన్నీ ?"

"మదిరను మర్చిపోవుగా విజయా ?" మధుర కన్నీరు పెట్టుకుంది.

విజయ చలించింది. "ఆందోళన చెందకండి పిన్నీ ఆ విషయం నాకు చెప్పాలా ?" అంది ఓదార్పుగా.

మధురమ్మ నెమ్మదిగా కోలుకుంది.

ఆ తరువాత మదిర తీరికగా విశాఖపట్నంనుంచి దిగింది.

"విజయా కులాసాగా వున్నావా ?" అంది.

"పిన్నీ ఎలా వున్నావు ?" అంది.

"నీకు జబ్బు తగ్గిపోయిందా అమ్మా" అంది. అంతే ! మధురమ్మ గురించి ఆందోళన పడలేదు. తను త్వరగా రాలేనందుకు పశ్చాత్తాప పడలేదు. విచారపడలేదు. ఒకటికి రెండు సార్లు మధురమ్మ ఆరోగ్యం సంగతి తెలుసుకోనూలేదు.

ఇదివరలో ఎప్పుడు వచ్చినా మదిర విజయను, విజయ జీవితాన్ని ఆశ్చర్యంగానూ, కుతూహలంగానూ గమనించేది. ఇప్పు డది లేదు.

విశ్వనాథంగారంటే ఎంతగానో భయం వుండేది. అది ఒక్కసారిగా దులిపి వేసుకున్నట్లుగా మాట్లాడింది.

"మదిరా, ఉత్తరానికి సమాధానం వ్రాయకపోగా అమ్మకు జబ్బుగా వున్నదని తెలిసికూడా మళ్ళా కలకత్తా వెడతావా ?" అని మందలించేరు విశ్వనాథంగారు.

''ఫ్రెండ్స్ అంతా కలకత్తా వెళ్ళేరు బాబాయి. మళ్ళీ అలాంటి అవకాశం దొరకదుగదా అని నేను కూడా వెళ్ళేను'' అని సాఫీగా సమాధానం ఇచ్చింది.

అంతేకాదు క్రొత్తగా ఎంతో స్వతంత్రంగానూ, స్వేచ్ఛగానూ మాట్లాడటం నేర్చుకుంది.

''ఈ కారు మార్చేసి క్రొత్త కారు కొంటే బావుం టుంది బాబాయి'' అంది ఒకనాడు.

విశ్వనాథంగారు దిగ్భ్రాంతి చెందేరు.

"విజయ భారతీ! నీవుమళ్ళీ చదువు ప్రారంభించు" అని సలహా ఇచ్చింది.

"అమ్మా! ముందరి సంవత్సరానికి నాచదువుకు మూడువేల రూపాయలు కావాలి. ఇప్పుడే ఇంకో రెండె కరాలు బేరం పెట్టు" అంది.

మధురమ్మ భయపడింది.

ఈ ఏడు మాసాలలోనూ మదిర డజను చీరలు కొంది. రెండు డజన్లు బ్లేస్ పీసెస్ తీసింది. ఇంకెన్నో వస్తువులు ఢిల్లీ నుండి కలకత్తా నుండి తెచ్చింది. వాటిని బయటికితీసి విజయ భారతికి చూపెట్టటానికి కూడా మదిరకు తీరలేదు.

మదిరలో ఇలా అజ్ఞాతంగా పెరిగివస్తున్న అనర్ధకశక్తి ఏమిటో మధురమ్మకు అర్ధం కాలేదు.

''నీవు అనవసరంగా ఆందోళన పడుతున్నావు పిన్నీ. అక్క చదువుకున్నది. నీ గౌరవానికి ఎప్పుడూ భంగంరాదు.

నీ ఆశలు ఎప్పుడూ నిరాశలు కావు. అవును కదక్కా" అంది విజయ భారతి మదిరవైపుకు తిరిగి.

"ఆ ఎంతచదివినా ఆడది ఆడది కాకుండా పోతుందా?" అనేసింది రామలక్ష్మమ్మగారు వస్తూనే.

విజయకు అక్కసు వచ్చిపడింది. "అదేవిటే అమ్మా అది చదువుకుంటే నీకెందుకు కోపం" అంది ఉక్రోషంగా.

"అది చదువుతున్నందు కేమిటే విజీ! ఆడది చదువు తున్నందుకు కోపం. అస లిందులో కోపం ఏవిటి. అమ్మాయికి త్వరగా సంబంధం చూడన్నయ్యాఅని మధురమ్మ అంటున్నది."

మదిరకు ఆగ్రహం ముంచుకొచ్చింది.

"నాకు తెలియకుండా ఈ పెండ్లి ప్రయత్నా లేవిటమ్మా నే నిప్పుడు పెండ్లిచేసుకోనే చేసుకోను" అంది మదిర కోపంగా వెళ్ళిపోతూ.

అంతా విని "పోనీలే దాని యిష్టానుసారమే కానీ రాదు" అన్నారు విశ్వనాధంగారు.

"దాని వివాహం వెంటనే జరిగితే సర్వవిధాలా మంచి దని నా ఉద్దేశ్యం. ఆ ప్రసక్తి మీకే వదిలేస్తున్నాను. ఆపైన మీ యిష్టం" అంది మధురమ్మ.

"అలాగే అలాగే" అన్నారు విశ్వనాధంగారు తన అకౌంటు పుస్తకాలు చూసుకుంటూ. జమాఖర్చులు వంక ఆయనకండ్లు గిర్రున తిరిగాయి.

# 8

విశ్వనాథంగారు కొత్త థియేటరు కొన్నారు.

"ఇంతలోనే మళ్ళీ ఇంకొక థియేటరా ?" విశ్వాసరావు గారు ఆశ్చర్యపోయారు.

"ఇందులో ఆశ్చర్యం ఏముంది విశ్వాస్. వ్యాపారం ఎదుగుతునప్పుడు ఎదగనీయడం, స్తంభించిపోయినప్పుడు తెగ గొట్టి డబ్బు చేసుకోవడం తప్పదు. ఎదుగుతున్నప్పుడు లాభం వస్తుంది. కుప్పతెప్పలుగా వస్తుంది. అలాగే స్తంభించి పోవడం ఆరంభమయితే, వ్యాపారపు పెట్టుబడి కాస్తా ఖర్చుల క్రింద హరించిపోతుంది. ఇదికూడా కావాలంటే నీవేవుంచుకోవచ్చు. నీపేర వ్రాయించమంటావా విశ్వాస్ ?" అన్నారు విశ్వ నాథంగారు.

విశ్వాసరావుగారు హడలిపోయారు. సినిమా వ్యాపారంలో ఓనమాలు తెలియని తను మరింత రొంపిలో దిగబడి పోవడం ఆయనకు మనస్కరించలేదు.

"ఇప్పటికే కొంతభారం ఎలాగూ పడిందిగా విశ్వం. ఈ బెడద మరింత ఎందుకు. నీకు డబ్బు అవసరం అయితే ఆరెండు లక్షలు వేసుకుని ఆ థియేటరు నీవే వుంచుకుందూ ?" అన్నారు.

"నాకు డబ్బు తక్కువయ్యా విశ్వాస్ నిన్నడిగింది

అని విశ్వనాథంగారు నవ్వేశారు.

"కాదనుకో. ఎక్కడో ఒకచోట నీవు డబ్బు పుట్టించ వలసిందేగా. నీ కా శ్రమ ఎందుకు? నీ దగ్గర డబ్బు వచ్చిన నాడు అలాగే తిప్పి ఇచ్చేద్దువుగాని" అని తడబడుతూ సర్దు కున్నారు విశ్వాసరావుగారు.

"సరే అయితే! నీమాట ఎందుకు కాదనాలి? మార్వాడీ వ్యాపారంలాగా పెట్టుబడి మీద వడ్డీముందుగానే బయటికి తీయటం నా కలవాటు. కనుక ఆ మూడు లక్షలకూ ముందుగానే మూడు సంవత్సరాలకూ పదణాల వంతున వడ్డీ మినహాయించుకుని ఇవ్వ మేనేజరు రసీదిస్తాడు" అని చెప్పేరు. తను ఇస్తానన్నది మూడు లక్షలు కాదు. రెండు లక్షలేనని గాని, లేక వడ్డీ పదణాలు గాదు ఒక రూపాయి అనిగాని చెప్పగలంత సాహసం విశ్వాసరావుగారికి లేకపోయింది.

పైగా తల గిర్రున తిరిగింది. ఇదెక్కడి వ్యాపారపు సరళో అతనికి అర్థం కాలేదు. మూడు లక్షల రూపాయలు అప్పుగా తీసుకొని దానికి ముందుగానే వడ్డీ చెల్లింపా?

విశ్వాసరావుగారికి వ్యాపారంమీద ఇంకా పూర్తిగా ధీమా కుదరకపోయినా మిత్రుడికి తన మీద ఉన్న సదభి ప్రాయానికి ఔదార్యానికి హర్షించేరు.

సరిగా మాసం రోజులకు రిపేరింగులు పూర్తయి థియే టరు ఓపెనింగు ఏర్పాటు పూర్తయింది. ప్లిమత్ కారులు థియేటర్ చుట్టూరా గిర్రు గిర్రున తిరిగాయి. సినిమా నటులు

దర్శకులు విశ్వనాథంగారి అనుగ్రహం కోసరం పడరాని పాట్లు పడ్డారు. ఆయనపేరు సినిమావ్యాపారంలో అంత ధగద్ధాయ మానంగా వెలిగింది. బ్రహ్మాండమయిన డిన్నరు ఏర్పా టయింది.

"ఈ థియేటరు కొనేందుకు మూడులక్షలు. రీమోడ లింగుకు డెబ్భయివేలు. ప్రారంభోత్సవానికి ముప్ఫయి వేలు......" అంటూ చెప్పుకు పోసాగారు విశ్వనాథంగారు.

విశ్వాసరావుగారి గుండె గుభిల్లుమంది. ఇలా ముందు గానే వడ్డీలు చెల్లువేసి ప్రారంభోత్సవాల కింతింత ఖర్చు పరచి విశ్వనాథంగారు వ్యాపారంమీద తీయగల లాభాలేమిటో ఆయనకు అర్థం కాలేదు. ఈ వరసను పెట్టుబడి హరించి పోవ డానికి ఎంతకాలం పడుతుందో అని మనసులోనే గుణించు కున్నారు.

ఆయన అంతర్యం దుడుకు పడింది. కానీ ఆయన అను కున్న ప్రమాదం ఎన్నడూ సంభవించలేదు. విశ్వనాథంగారి చేతిమీదుగా లక్షలు ఖర్చు అయిపోతూనే వున్నాయి. ఆయన ముఖంమ్మీద చెక్కు చెదరని చిఱునవ్వు వెలుగుతూనే వుంది. లక్ష్మీదేవి పటంమీది జీరోపాయింట్ బల్బులాగా ఆయన పరువు ప్రతిష్ఠలు నిశ్చలంగా వెలుగుతూనే వున్నాయి.

రాజకీయ నాయకులు, వ్యాపారస్థులు, బ్యాంక్ ఏజెంట్లు, సినిమానటులు, దర్శక నిర్మాతలు ఆయనఅడుగులకు మడుగు లొత్తుతూనే వున్నారు.

మాసానికొక విందు, సంవత్సరానికొక న్యూమోడలు కారు జరిగిపోతూనే వున్నాయి.

విశ్వనాథంగారికి డబ్బంటే అంత నిర్లక్ష్యం!

విశ్వాసరావుగారికి డబ్బంటే అంత జాగ్రత్త.

"విశ్వం అర్జంటుగా ఓ యాభయివేల రూపాయలు కావలసి వచ్చేయి; అర్జంటుగా పంపగలవా సమయానికి నా దగ్గర లేకపోయాయి" అని ఫోను చేసేరు విశ్వాసరావుగారొకనాడు.

విశ్వనాథంగారు నిర్లక్ష్యంగా నవ్వి "అలాగే బ్యాంక్ చెక్ పంపుతున్నాను. యాభయి వేలు చాలా?" అన్నారు కంగుమని.

విశ్వాసరావుగారికా డబ్బుతో అవసరమే రాలేదో, అనవసరమే అనిపించిందో మనకు తెలియదుగాని వారం తిరక్కుండానే ఆ చెక్కు యథాతథంగా తిప్పి విశ్వనాథంగారికే పంపించేరు.

విశ్వనాథంగారదిచూచి సంతృప్తిగా నవ్వుతున్నారు.

ఈ ఎనిమిది, తొమ్మిది మాసాలలోనూ విరంజన్ అప్పుడప్పుడూ వచ్చిపోతూనే వున్నాడు. అతని సరదాలకు, కాలక్షేపాలకూ విశ్వనాథంగారే లోటూ రానీయనూ లేదు. విజయభారతి అతన్ని తప్పించి తిరగడం మాననూ లేదు.

"ఇవ్వాళ సినిమాకు వెడదాం" అనేవాడు విరంజన్.

"నాకు తల నొప్పుతోంది" అనేది విజయ.

''ఇవ్వాళ షికారుకు వెడదాం'' అనేవాడు విరంజన్.

"నాకు ఒంట్లో బాగులేదు'' అనేది విజయ.

''ఎవ్వరితను ?'' అన్నాడు ఒకనాడు భోజనాల సమయంలో ఉపేక్షను చూస్తూ విరంజన్.

''మా బావ'' అని నొక్కి చెప్పింది విజయ.

విరంజన్ చూపుల్లో ఉక్రోషం, అసూయ స్పష్టంగా గ్రహించింది విజయ.

''ఇతను ఎక్కడ వుంటున్నాడు ?'' అన్నాడు విరంజన్ వెళ్ళిపోతున్న ఉపేక్షవంక అలాగే చూస్తూ.

'''ఇతను' కాదు మా బావ హేమకుంతలగారింట్లో వుంటున్నాడు'' తల వొంచుకునే చెప్పింది విజయ భారతి.

విరంజన్ సందేహంగా చూశాడు. విజయ తరచుగా హేమకుంతల గారింటికి ఎందుకు వెడుతుందో అర్థమయిందన్నట్లుగా చూచేడు విరంజన్.

విజయ తిరస్కారంగా అక్కడినుండి వెళ్ళిపోయింది. విరంజన్ ముఖం ఇంత చేసుకున్నాడు అవమానంగా.

''ఇవ్వాళ మన థియేటరులో నడుస్తున్న సినిమా శతదినోత్సవం జరుగుతుంది. ఇద్దరూ తప్పకుండా రండి. నటీనటుల్ని రిసీవ్ చేసుకోవాలి'' అన్నారు విశ్వనాథంగారా మధ్యాహ్నం కాఫీ తీసుకుంటూ.

''అలాగే నండీ ! విజయా నేనూ అలా పబ్లిక్ పార్కుకు షికారు వెళ్ళి ఆరుగంటలకల్లా థియేటరుకు చేరుకుంటాం''

అన్నాడు విరంజన్ కుత్సితంగా.

"ఓ! అలాగే. అలాగే. విజయా! నీవూ విరంజన్ అలా పార్కుకు షికారు వెళ్ళిన తరువాత ఆరుగంటలకల్లా థియేటరుకు రండి" అన్నారు విశ్వనాథంగారు తేలికగా.

విరంజన్ దిగ్విజయంగా నవ్వేడు. విజయ అవమానంతో తల ఒంచుకుంది. తను ఎంతగా నిరసిస్తున్నా ఈ అజ్ఞాత వ్యక్తి ఇంత దుస్సాహసంతో తన్నెందుకు వెంటాడుతున్నాడో ఆమెకు అర్థం కాలేదు. పరిపూర్ణ క్రోధంతో సెగలు కక్కింది.

ఆమె ఆగ్రహాన్ని గమనిస్తూనే "రా విజయా! కారు రెడీగావుంది." అని త్వరపెట్టేడు విరంజన్.

"వెళ్ళిరండమ్మా! నేనలా థియేటరుకు వెడతాను" అన్నాడు విశ్వనాథంగారు కోటు తగిలించుకుంటూ విజయ వైపు చూడనైనా చూడకుండా.

విజయ కాళ్ళీడ్చుకుంటూ కదిలింది.

# 9

ఒకనాడు విజయ - మదిర హేమకుంతల గారింటికి ఉబుసుపోకకు వెళ్ళేరు. హేమకుంతల వారిద్దరినీ ఎంతో ఆనందంగా ఆహ్వానించింది.

అప్పటికి ఉపేత అక్కడ వుండడం ప్రారంభించి ఎనిమిది మాసాలు. ఈ ఎనిమిది మాసాలలోనూ విజయకు కాస్త దూరంగా వుండాలని ఉపేత ప్రయత్నిస్తూనే ఉన్నాడు. విజయ కంటివెంట వలవలా జాలువారుతున్న కన్నీటికి లొంగి పోతూనే వున్నాడు. ఉపేత తనకు దూరం చేస్తున్న అజ్ఞాత శక్తి ఏమిటో గ్రహించాలని విజయ ఎంతగానో ప్రయత్ని స్తూనే వున్నది. అలాంటి ప్రయత్నాన్ని ఉపేత తప్పించు తూనే వున్నాడు.

హేమ బావను మురిపించి ఆ కారణం ఏమిటో బయ టికి లాగాలని శతథా ప్రయత్నించి విఫలురాలయింది.

"అయితే విజయక్కను గురించి మీ రిప్పటికీ గ్రహించ లేదు" అనేది.

ఉపేత నవ్వుకునేవాడు. "విజయను గురించి పూర్తిగా తెలుసు. నన్నుగురించే నా కింకా తెలియదు" అనేవాడు.

"విజయా ఇదివరలో ఒకసారి ఇక్కడ మీ బావ వుండా లని చెప్పేవే వున్నారా ?" అని ప్రశ్నించింది మదిర ఆనాటి మాటల సందర్భంలో.

"బావ కాదు మదిరా.........ప్రాణ.........చెప్పనా విజయా" అని ప్రశ్నించింది హేమ.

విజయ సిగ్గుగా, నిస్సహాయంగా చూచింది.

"చాలు చాలు హేమా ఇక నీవు చెప్పనవసరం లేదు" అంది మదిర నవ్వి.

"అంత వేగం అభిప్రాయాలు ఏర్పరచుకుంటావేం మదిరా? స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అందరి సొత్తూ కాదు"

"అయితే అవి కేవలం కొందరి సొత్తు కూడా కాదు." అన్నది మదిర. "ఎవరి సొత్తు కానిదాన్ని కూడా తమ సొత్తుగానే భావించుతారు కొందరు" అన్నది హేమకుంతల.

మదిర మందహాసం చేసింది. "హృదయస్ఫూర్తిగా తమ సొత్తని విశ్వసించిన వస్తువులను ఎవ్వరూ ఎప్పుడూ వదులుకోరు. ఎదుటివారు దాన్ని అపహరించనూ లేరు."

హేమ అడ్డుపడింది. "పొరపాటు మదిరా! తమ హక్కు కాని వస్తువులను అపహరించగలవారూ వున్నారు. తమ స్వంతమయిన సొత్తును అనుభవించలేక ఔదార్యంతో పరులకు దానం చేయగల వారూ వున్నారు. అది వ్యక్తిగత ఔన్నత్యం మీదా మానసిక పరిపక్వత మీదా ఆధారపడి వుంటుంది."

"ఇంతకూ విజయభారతి సొత్తుకు వచ్చిన ఆపద ఏమీ లేదు గదా?" అన్నది మదిర. విజయ మౌనం వహించింది.

సరిగ అదే సమయానికి ఉపేక్ష ప్రవేశించేడు. అతనితో వెంట సన్నని పొడగాటి చామనచాయ వ్యక్తి మరొకతను వున్నాడు.

"ఈ వచ్చినవారిలో మీ బావ ఎవ్వరు? అన్నట్లు చూపులతోనే ప్రశ్నించింది మదిర.

"నే చెప్తా నాగు. ఈయన మా బావగారు ఉపేక్ష. ఈయనెవరు బావా?"

"విమలానంద్. నా స్నేహితుడు" అన్నాడు ఉపేక్ష నవ్వుతూ. విమలానంద్ విజయ వంక రెండు క్షణాలు అలాగే చూశాడు. నల్లగా మూసపోసిన ఆ సౌందర్యరాశి ద్రౌపదీ స్వరూప మనిపించింది.

నీడలు దేరుతూ మెరుగులు చెక్కుకున్న శరీరం. బారెడు పొడవున్న నల్లని త్రాచువంటి జడ. విశాలమయిన తెల్లని కండ్లు సన్నని పెదవులు.

మదిర ఇంతసేపూ విమలానంద్ దృష్టి నాకర్షించాలని అతని శిలారూపానికి విసిగి సకిలించింది.

విమలానంద్ దృష్టి పక్కకు మళ్ళింది.

ఊర్వశీ రూపాన్ని పరిహసిస్తూ మదిర సాక్షాత్కరించింది. ఆమె కండ్లలోంచి నిశితంగా ప్రసరిస్తున్న రాగరేఖలు చూచి విమలానంద్ జంకేడు. దృష్టి ప్రక్కకు మరల్చుకున్నాడు.

"ఈమె విజయభారతి" అన్నాడు ఉపేక్ష.

"ఈమె నా సోదరి, స్నేహితురాలు మదిర" విజయ నమస్కరించుతూ ముందుకు వచ్చి మదిరను కూడా విమలానంద్‌కు పరిచయం చేసింది.

మదిర కనులు సోగదేల్చి వింతగా నవ్వింది. అందులో వెయ్యి సునిశిత బాణాలు. "మీరు?" విమలానంద్ వైపు వింతగా చూసింది.

"ప్రస్తుతం నిరుద్యోగిని" విమలానంద్ చిరునవ్వు

నవ్వేడు. "అయితే మీరు ఉద్యోగాన్వేషణ చేస్తున్నట్లు లేదే ఎక్కడా ?" "ఎవరయినా అంగీకరించితే చేయవలసి వస్తుందని భయం." సమాధానం చెబుతూనే పైకి కదిలాడు ఉపేక్ష వెంటే.

హేమకుంతల ఇంతసేపూ మౌనంగా వూరుకుంది. విజయభారతి నిమలానంద్ వైపు నిర్లిప్తంగా చూచింది. అతనిలో ఏదో నిస్సంకోచం ప్రదర్శితమైంది. ఏదో హుందాతనం, సువిశాలత, నిశ్చలత ప్రకాశిస్తున్నాయి.

"విజయా ! ఈయన సంగతేదో పూర్తిగా తేల్చుకోవాలి" అంది మదిర ఆ తరువాత విజయతో.

"అంటే ! ?"

"ఆయనెవరో ఏం చేస్తారో ?"

"ఆ సంగతి చెప్పనే చెప్పారుగా"

"కానీ తన్నుగురించి తాను నిజం చెప్పలేదు."

"అంటే ఆయన చెప్పినది అబద్ధమా! ?"

"నిజం మాత్రం కాదు. కాని గమనించేవో లేదో ఆయన మాట్లాడుతున్నాడే కానీ దృష్టి అంతా నీమీదనే వుంది."

"మదిరా ? !"

"ఆగ్రహపడతావేం విజీ ! స్త్రీ వీణాతంత్రిలాంటిది. ఆ తంత్రులకు శృతి చేయగల వ్యక్తి కదిరాగాలాపన చేయక తప్పదు. కంటికింపు......"

"కానీ కంటికింపుగా వున్న యావన్మందినీ ప్రేమించం గదా" హేమకుంతల అడ్డుపడింది.

"అంటే నియమిత సంఖ్యలో కొందర్ని ప్రేమించ వచ్చు కాబోలు!"

"ప్రేమానురాగాలు మనోగతమైనవి మదిరా! ఎందర్ని ప్రేమించుతుందో వ్యక్తి మీద ఆధారపడుతుంది."

విజయ సంభ్రమాశ్చర్యంతో కండ్లు విప్పుకుని చూసింది.

"ఏం విజీ తప్పా? రాగబంధం అంటే జీవనబంధం మాత్రమే కాదు."

"అయితే ఇరువుర్ని ప్రేమించినట్లు ఎక్కడయింది?" మదిర ప్రతివాదన చేసింది.

ఏం మదిరా? ప్రేమంటే పురుషుడితో చెట్టాపట్టా లేసుకు తిరగడమే కాదుగా" హేమ క్రోధపరవశురా లయింది.

"అసలు ఒకేసారిగా ఇద్దర్ని ప్రేమించగలగడం సాధ్యమా?"

"ఇద్దర్ని కాదు మదిరా? కొందరికి ఒక్కర్ని కూడా నిష్కపటంగా ప్రేమించడం సాధ్యం కాదు."

హేమకుంతల వంక ఉలిక్కిపడి చూసింది మదిర.

"ఈ వాగ్వాదం ఎందుకు హేమా! ఏదో ఒక వ్యక్తి మనశ్చాంచల్యాన్ని ఒక జాతికే అంటగట్టాలని ప్రయత్నం చేస్తారేం? ఇంక వెడదామా!" విజయ బయలుదేరింది.

పై నుంచి విమలానంద్ నవ్వుతూ మెట్లు దిగివచ్చాడు. అతని చేతిలో ఏవో పుస్తకాలున్నాయి.

"ఏదో చర్చించుకుంటున్నట్లున్నారే?" అన్నాడు నవ్వుతూ.

"ఒకే వ్యక్తి ఏకకాలంలో ఇద్దర్ని ప్రేమించగలగడం సాధ్యమా?" అని మదిర ప్రశ్నించుతున్నది." అంది హేమకుంతల ముందుకు వచ్చి.

"ప్రేమ ఒకసారి అనుభూతికి రావాలిగా ముందు" విమలానంద్ సమాధానం చెబుతూనే వెళ్ళబోయాడు.

"బావగారూ సమాధానం పూర్తిగా చెప్పకుండానే వెడుతున్నారు.'' హేమకుంతల మాటలతోనే అడ్డుపడింది.

"చెప్పానుగా హేమా! ఒకసారి ప్రేమ అనుభూతికి రాగానే సమాధానం తెలుస్తుంది."

"అసలు ఒక పర్యాయం కూడా అనుభూతిలోనికి రాకుంటే?" మదిర చివాలున ముందుకు వచ్చింది.

"రాకుంటే ఇంక పేచీ ఏముంది?"

విమలానంద్ సమాధానం విని మదిర తలదిమ్ము పడింది.

"ఇంత చనువుగా మాట్లాడే అమ్మాయిల మధ్య తానున్నట్లు ఉపేక్ష ఒక్కసారి కూడా చెప్పలేదు సుమీ!" హేమ చిలిపిదనాన్ని గమనించుతూ అన్నాడు విమలానంద్ బాబు.

"మీరయినా గ్రహింపుకు తెచ్చుకున్నారు కృతజ్ఞులం" అంది హేమ. విమలానంద్ చిఱునవ్వు నవ్వి వెళ్ళిపోయేడు.

"ఈ విజయ ఎవరు ఉపేక్షా?'' అన్నాడు విమలానంద్ ఉపేక్షను కలసికొన్నప్పుడు.

"ఏం !"

"ఏం లేదు ఎవరా అని అడుగుతున్నాను."

"విశ్వనాథంగారి అమ్మాయి."

"విశ్వనాథంగారి అమ్మాయియా !" విమలానంద్‌కు ఆశ్చర్యం కలిగింది.

"మదిర ?"

"ఆమె స్నేహితురాలు."

విమలానంద్ ఒక్క క్షణం మౌనంలో పడ్డాడు. "ఆ మదిర ఎవరోగాని చాలా ప్రమాదమయిన వ్యక్తి.''

"ఆనంద్ ! నీవుకూడా నిరాధారమైన అభిప్రాయాలు ప్రకటించుతున్నావ్ ? వీటినే అభాండాలంటారు."

"ఒక్కొక్కర్ని చూస్తే అంతనేమో ఉపేక్షా !''

"కానీ విజయకు ఆమె మీద ఎనలేని గౌరవాభిమానాలున్నాయి. మదిర ఆమెకు తోబుట్టువుకాని సోదరి."

"అలాగా !'' అని వూరుకున్నాడు విమలానంద్.

# 10

ఆశావాదానికి అవధులూ, పరిమాణాలూ, ప్రమాణాలు, గిరిగీసిన సూత్రాలు ఏమీ వుండవు. ఉన్నా అవి

దర్శనేంద్రియాలకు అతీతంగా వుంటాయి.

హేమకుంతల ఆదర్శవాది. ఉపేతు వచ్చి సనాతనుడని నిరాశావాది అనీ ధైర్యసాహసాలు అతనిలో లవలేశంకూడా లేవని ఆమె మనస్ఫూర్తిగా విశ్వసించేది. అతని పిరికితనాన్ని లొంగుబాటు స్వభావాన్ని హేళనచేసి ఎలా అయినా అతనిలో నిద్రాణమై వున్న శక్తుల్ని రెచ్చగొట్టాలని శతధా ప్రయత్నించేది.

"విజీతో నీవు ఏకాగ్రతతో సంభాషించనే సంభాషించవేం బావా? పాపం! నిన్ను గురించి అంతర్యంలో ఎంత ఆనందంగా ఊహాగానం చేసుకుంటూ వస్తుందో! నీవొక శిలా ప్రతిమలా అచంచలంగా నిలిచిపోతావు!" అనేది హేమకుంతల.

"నేను చాలా ఆప్యాయంగానే వున్నాననుకుంటున్నానే" అనేవాడు ఉపేతు.

"అనుకుంటున్నావా? వుంటున్నావా?"

"అసలు నీకీ విషయం ఎలా తెలిసింది హేమా!"

"అరచేతిలో అద్దం వుంది. నాముఖాన్ని గురించి మరొకరు చెప్పనవసరం లేదు. ఆ విషయం అలావుంచు. నీవు విజీని మనఃపూర్వకంగా ప్రేమించుతున్నావా అసలు!" ఎంతో కాలానికి హేమకుంతల ఉపేతును నిగ్గదీసి ప్రశ్నించింది.

"ప్రేమించడం వేరు. ప్రేమఫలాన్ని సాధించడం వేరు హేమకుంతలా!" "సాధించటం వేరు కదా అని సాటి హృద

యాన్ని ఆవేదనపాలు చేస్తావా ?"

"అసలు నీచేతిలోవున్న అద్దం చూపుతున్న ప్రతిబింబం పొరపాటు కావచ్చు హేమా. అది వట్టి మిథ్యాబింబమే ! అది ఎంతకాలం అలా నిలిచివున్నా దానికి వాస్తవికత సిద్ధించనే సిద్ధించదు. నీవు అనుకున్నట్లే విజయ ఈప్రశ్నలన్నీ వేసుకుని యోచిస్తున్నదని నీ భావనా ?

హేమ చెక్కిళ్లు ఎరుపెక్కాయి. "అవును బావా అద్దంలోని దెప్పుడూ మిథ్యాబింబమే అవుతుంది. ఒప్పుకుంటున్నాను కానీ ఆమిథ్యాబింబానికి మూలమైన వస్తువెప్పుడూ ఊహాజనితం కాదు. ఆ వాస్తవికతను నీవు ప్రయత్నపూర్వకంగా కూడా మిథ్యారూపంగా మార్చలేవు గదా ?

స్త్రీ ఒక్కరికే హృదయం ఇవ్వగలదు. ఆ ఇవ్వడమే వాస్తవికత. దానికి రూపాలు, ప్రతిరూపాలూ, మిథ్యాబింబాలూ ఉండవు. ఆ రాగస్పందనకు షరతులు, నియమాలు తెలియవు. తెలిసిందా ?"

"తెలిసింది హేమా కానీ అది హేతువాదమని కానీ దూరదృష్టి అనికానీ అనిపించుకోదు. నీవు చెప్పినవిషయాలనే అంగీకరించవలసివస్తే ప్రేమకు నిర్వచనం, అంధత్వం అని ఇవ్వవలసి వస్తుంది."

"బావా ?! హృదయం ఇవ్వగలిగి ఒకరికి ఇస్తే తిప్పి స్వీకరించనూలేదు. తిప్పి తీసికొనగలిగితే అసలు ఇవ్వనూలేదు. ఈ ఔన్నత్యాన్ని అర్పణ అని మాత్రమే అంటారని నాకు

తెలుసు. కాని దానికి నీ విద్వాళ అంధత్వం అని నామకరణం చేసేవు..."

"హేమా...." ఉపేక్ష ఒక అరక్షణం మౌనం వహించేడు. "జీవితం ఆదర్శాల తేనెపట్టు కావాలని, జీవనధ్యేయాల పూలసెజ్జ కావాలని ఆసించనివా రెవ్వరూ వుండరు. కానీ తేనెపట్టులో విషపుటీగల వాస్తవాలు, పూలసెజ్జలో రక్షక పత్రాల నిశిత ములుకులూ వున్నాయనే సంగతి మరచి పోవను కుంటాను.......స్త్రీ ఒక్కరికే హృదయం అర్పించగలదు. దానికి ఔన్నత్యమే అని నామకరణం చేస్తాను. అయినా పరిస్థితుల ప్రాబల్యాన్ని బట్టి ఆమె తన హృదయాన్ని ఇంకొకరితో పంచుకోవడానికి అభ్యంతరం లేదు కదా? అందువల్లనే స్త్రీకి భావానికన్న బాధ్యత ప్రధానమైంది."

హేమ తిరస్కరించింది. "నీవు బాధ్యతగురించి మాత్రమే ఆలోచించగలిగేవు గాని బాధగురించి రవ్వంత కూడా యోచించలేకపోయావు బావా. పరిస్థితుల ప్రాబల్యాన్ని బట్టి స్త్రీ మరొకరితో పంచుకునేది జీవితం మాత్రమే. హృదయం ఎప్పుడూ ఒక్కరికే చెందివుంటుంది. ఆ భావాన్ని ఆమె అంతర్యంనుండి ఎవ్వరూ తుడిచివేయజాలరు."

ఉపేక్ష గట్టిగా నవ్వేడు. "అదే హేమా నేను చెప్పింది. స్త్రీ భావరీత్యా హృదయం ఒకరి కిస్తుంది. జీవితం మరొకరితో పంచుకో గలుగుతుంది. అందువల్లనే ఆ జీవనప్రతిరూపం మిథ్యాబింబమే అపుతుంది. మూలమైన వస్తు వెప్పుడూ

వాస్తవికతకే చెందుతుంది. అద్దంలోనిరూపం ఎప్పుడూ ప్రతిబింబమే అనబడుతుంది. ఆ బింబ ప్రసారంలో ఏదో ఒకచోట అవాస్తవికత ఆత్మవంచన చోటు చేసుకోక తప్పదు. అప్పుడు వాస్తవికానుభూతికి బదులుగా మిథ్య ఏర్పడుతుంది."

"మీరు ఒట్టి హేతువాదంతో పారిపోజూస్తున్నారు. ఇలా అనే మీరు హృదయస్ఫూర్తిగా విశ్వసిస్తున్నారా?" అంది హేమ అతన్ని మానసికంగా దెబ్బకొడుతూ.

ఉపేక్ష నిట్టూర్చేడు. "ఇప్పుడు నీవు అన్నట్లే హేతువాదం ఉపయోగించదలిస్తే నీ ప్రశ్నకు జవాబు ఇవ్వడం కష్టతరం హేమా. మనిషి మేధస్సుతో ఆలోచనామగ్నుడవుతాడు. హృదయంతో భావించుతాడు. బాధపడతాడు. మనసుకు మాత్రమే హేతువాదనాశక్తి వుంది. హృదయానికి అనుభవించడంమాత్రమే చేతనవుతుంది. వాటిలో మనం ఒకదానికి బదులుగా మరొకటి వినియోగించుతున్నాము."

హేమ ఆశాభంగం చెందింది. విజీ హృదయాధిదేవతగా ఆరాధిస్తున్న వ్యక్తి ఇతడేనా అనిపించింది. మౌనంగా వుండిపోయింది.

విజయ వచ్చింది ఇంతలో.

"ఏం హేమా! ముంగిలా కూర్చున్నావ్?"

"బావగారికి పరీక్ష పెట్టేను. ఆ పరీక్ష సరిగా స్వీకరించకుండానే అది సులభంగా వుంటుందో కష్టతరంగా వుంటుందో చెప్పడం ప్రారంభించే రాయన."

ఉపేంద్ర హేమకుంతల వైపు క్రోధంగా చూశాడు.

"నీవేం నొచ్చుకోకు బావా! హేమ ఎప్పుడూ అలాగే పరిహాసమాడుతుంది."

"కాదు విజయా! హేమకుంతల పరిహాసం మాత్రమే చేయగలదని ఇంతవరకూ అనుకున్నాను. అబద్ధంకూడా ఆడ గలదని తెలిసింది." "బావా! ఈ చర్చ అప్పుడే పూర్తయిం దనీ జయం నీకే లభించిందని భావించుకుని నీవు మురిసి పోతు న్నట్లుంది. అది సరికాదు. దీనిని కొనసాగించవలసిన సమయం మళ్ళీ వస్తుంది. గుర్తుంచుకో!" అంది హేమకుంతల.

"సరే ఇవ్వాళనయినా షికారు వెడదామా?" అంది విజయ ఆసక్తిగా.

"హేమ ఉత్సాహంతో ఎగిరిపడింది. చెప్పేవు కాదేం అక్కా! నీవు డ్రైవింగు నేర్చుకుంటున్నావు కాబోలు! ఎంతవరకూ వచ్చింది."

"బావా! రావడానికి నీకేం అభ్యంతరం లేదుగదా?"

"ఆ విషయమూ నీకే తెలిసివుండాలి."

"అదిగో చూసేవా అక్కా. పోనీ ఆడదాన్ని నేను అబద్ధ మాడేను. ఆడదానిలా తానెలా ఎత్తిపొడుస్తున్నాడో చూడు?!"

అప్పుడే ఇద్దరూ ఏకమై పోయినట్లున్నారు.

హేమ నవ్వి పారేసింది. "ఈయనతోనా? శిలావిగ్ర హాన్ని ఆరాధించినా జీవితాని కొక వరం వుంటుంది... నేనే

ఇతగాడ్ని ప్రేమించి వుంచేనా ?" అంది అక్కసుగా.

"హేమా ? ?" విజయ ఆగ్రహం కక్కింది. "నీవు ఒక వైపున పసిపిల్లవై ప్రవర్తిస్తూనే ప్రతి విషయానికి అలా విరుపులు పెడతావెందుకు."

హేమ పకపకా నవ్వింది. "అదిగో అప్పుడే ఎవరెవరు ఒక్కటయ్యారో తేటతెల్లమయింది గదా ?"

విజీ నాలుక కరుచుకుంది.

"భయం లేదులే అక్కయ్యా నీతో నేను పోటీపడనులే. కాని ఇంతకు ఓ అయిదు నిముషాలక్రితం బావగారు నాతో ఒక విషయాన్ని గురించి వాదించి తార్కికజ్ఞానంతో బింబ ప్రతిబింబాలమధ్య మిథ్యను ఇరికించి. నా హస్తంలో ఉన్న సమతల దర్పణం సరైన ప్రతిబింబాన్ని చూపెట్టడం లేదేమో అని సందేహం వెలిబుచ్చేరు. ఆ సందేహం ఈ సరికి ఆయనకు తీరేవుండాలి ' అవునా బావా ?"

ఉపేక్ష కంపించిపోయాడు. "అయితే దానికి జవాబు నీ మాటలలోనే చెబుతాను హేమా. ఆ చర్చ ఇంకా కొంత సాగవలసిన సమయం ఆసన్నమవుతుందని అన్నావుగదా. నీ ప్రశ్నకు జవాబుకూడా అప్పుడే పొందగలవు.

విజయ భావగర్భితమైన వారి సంభాషణ మౌనంగా వింటూన్నది.

"హేమా !" విశాలాక్షమ్మగారు పిలిచింది.

"అదిగో పీడా ప్రారంభమయింది. బావా చర్చ తీవ్ర

స్థాయిలో వున్న సమయంలోనే నిన్ను ఎవరో ఒకరు రక్షిస్తారు. ఇంతకు ముందు విజయ అక్క రక్షించింది. ఇప్పుడు మా అమ్మ అడ్డుపడింది. ఇంతలోనే విజయాన్ని సాధించేసని భావించకు" అని చివాలున వెళ్ళిపోయింది.

ఉపేక్ష చకితుడయ్యాడు. "చూచేవా విజయా హేమ పరాజయంలో కూడా విజయాన్ని చిలికి తీస్తున్నది. అదే స్త్రీలోని నేర్పు.

"ఇంతకూ హేమ నిన్నేం ప్రశ్నించిందేం బావ?"

"హేమ ప్రశ్న అలా వుంచు విజయా. మనం అసాధ్యాన్ని సుసాధ్యం చేయడానికి పటుత్వంలేని ప్రయత్నం చేస్తున్నామేమో అని నీ కనిపించడం లేదా?"

విజీ బాధగానే అసహాయంగా మూలిగింది.

"నిరాశావాది కయినా జీవితంలో అప్పుడప్పుడు కోరికలు చిగురించి ఆశలు మొగ్గదొడుగుతాయి. ఆ మొగ్గలు విరిసి సౌరభం విరజిమ్మి సఫలీకృతం కాకపోతే అది ఆ వ్యక్తి దౌర్భాగ్యంగానూ అదృష్టహీన జాతకంగానూ పరిగణించబడుతుంది..........క్షమించు బావా! నీకు కూడా బాధ కలిగించుతున్నానేమో!"

ఉపేక్ష వ్యధితుడయ్యాడు. విజయను పట్టి పరిమార్చి వేదన పర్చుతున్న హృదయభారం ఏమిటో అతనికి అర్థము కాలేదు.

"ఇప్పుడు నీకు వచ్చిన ఇక్కట్లు ఏమిటి విజయా?"

విజయ గుండెలు కుంపట్లు చేసుకుని నిట్టూర్చింది. "నీవూ అందరిలానే ప్రశ్నించుతున్నావు బావా? దేనికి నేను జవాబు చెప్పలేను. నా కే సమస్యా లేదు. కానీ నా జీవితమే సమస్యాతోరణం. కానీ బావా ఎన్నడయినా అవసరం పడితే జాలిపడి నా కొక స్వల్పసహాయం చేయగలవా?"

ఉపేఄ తలపంకించి అడ్డంగా తిప్పేడు. "కానీ నీ కలాంటి అవసరం ఏర్పడే పరిస్థితి రాదని దృఢంగా వాదించి చెప్పగలను.'

"నీ సంకల్పం దృఢమైంది బావా! అందువల్ల నీ వలా గుండెమీద చేయి వేసుకుని చెప్పగలవు."

"అంటే" ఉపేఄ తెల్లబోయాడు సంకోచంగా.

"సంకోచిస్తున్నావా బావా? హు....కొందరి జీవితాలను అందరూ వడ్డించిన విస్తళ్ళుగా ఎంచుకుంటూరు. కానీ అది విందుగుడుపూ కాదు. దాని ముందు విస్తరే వుండదు.... వస్తాను" అంటూ చివాలున లేచి వెళ్ళిపోయింది.

విమలానంద్ ఎదురుగా వచ్చేడు. విజయభారతి అప్రయత్నంగానే నమస్కరించింది.

"వెడుతున్నట్లున్నారు" అన్నాడు విమలానంద్ ప్రతినమస్కారం చేస్తూనే.

"అవును బావ లోపల ఉన్నాడు వెళ్ళండి" అంది విసురుగా నిష్క్రమించుతూనే.

విమలానంద్ వెనుక చూపులు చూస్తూ లోనికి

వచ్చేడు. "ఉపేఖా! విజయభారతిని చూడగానే నీలంరంగు ముద్దకలువ గుర్తుకొస్తున్నది. ఆ గాఢనీలిమలో కూడా ఎంతసొంపో!"

"అవును కానీ నీవు స్త్రీవ్యక్తిత్వాన్ని గౌరవించనిదీ, సౌందర్యాన్ని అభివర్ణించనిదీ ఎప్పుడు ఆనంద్?"

"కానీ విజీలో గౌరవం ఆకర్షణే కాదు ఉపేఖా! ఆమె దృష్టిలో స్వచ్ఛమైన రాగస్పందన. ఆమె విశ్వనాధం గారి యింటిలో ఎలా పుట్టిందో!"

"అయితే ఏం ఆనంద్. విజీ విశ్వనాధంగారి ఇంటిలో పుట్టింది కనుకనే ఆమెకు కావలసిన భవిష్యత్తు వుంది."

"కావచ్చు ఉపేఖా! కానీ ఎదుటివారి జీవితాలన్నీ వడ్డించిన విస్తళ్ళనుకోవడం కేవలం పొరపాటు కాగలదు."

ఉపేఖ ఉలిక్కిపడ్డాడు. "విజయ కూడా ఇంతకు ముందు సరిగా ఇవే మాట లంది."

"ఆమె యథాలాపంగానే అని వుండవచ్చు. నేను గట్టిగానే అంటున్నాను." "ఇంకొంచెంసేపు అలా కూర్చుంటావా? అలా వెళ్ళి స్నానంచేసి వస్తాను" అని వెళ్ళేడు ఉపేఖ.

విజయ మళ్ళీ వచ్చింది అడుగులో అడుగు వేసుకుంటూ.

"కూర్చో విజయా!"

"ఏదో ఆలోచిస్తున్నట్లున్నారే?" విజయే కలుపుగోలుగా ప్రశ్నించింది.

''వాస్తవం చెబుతే నీ మనసు కష్టపెట్టుకుంటా వేమో !''

''నిజం చెబితే ఎవరి మనసు నొచ్చుకొన నవసరంలేదు ఆనంద్‌బాబు.''

''అయితే నీవు ఎంతో అందంగా వున్నావు విజయా !''

విజయ త్రుళ్ళిపడింది. చురుక్కుమని చూచింది.

''నీ మనసుకు కష్టం కలిగింది కదూ ?''

''అవును విమలానందబాబు కష్టం కలిగింది. మీరన్న మాటకు కష్టం కలగనంత సాన్నిహిత్యం మనిద్దరి మధ్య లేదు కదా ?''

విమలానంద్‌కు కనువిప్పయినట్లయింది. ''క్షమించు విజయా నీ మనసు అనవసరంగా గాయపరిచేను.''

విజయ అతని మాటను త్రోసివేసింది. ''లేదులే ఆనంద బాబు. ఇందులో క్షమించేందుకేముంది ? నిజం చెబుతానని ముందరగానే చెప్పేరుగదా. ఇంకొక పరిస్థితిలో అయితే ఇలాంటి మాటలు తీయగా వుండేవేమో. అప్పుడు స్త్రీ క్షమించడానికి బదులుగా కృతజ్ఞత చెప్పుకోవలసి వచ్చేది.''

విమలానంద్ పేలవంగా నవ్వేడు. "అవును విజయా ! జీవితంలో ఏ దిక్కునుండి క్రోధప్రతీకారాలు ఎదురు పడ తాయో మరేదిక్కునుండి కృతజ్ఞత తరలి వస్తుందో తెలియని దిక్కుతోచని వస్తువు మానవమేధస్సు. దాని కొక శాశ్వత ఉన్నతతత్వం, మధుర భావన అంటగట్టాలని చేసే ప్రయ

త్న మే జీవితం !"

"ఏదో చర్చించుకుంటున్నారే" అన్నాడు ఉపేక్ష తువ్వాలుతో తుడుచుకుంటూనే లోపలికి వస్తూ.

"ఏం లేదు. నీవు ఏం ఊహించుకున్నా బయటికి చెప్పవు. ఆనంద్‌బాబు మనసులో ఏది అనుకున్నా బయటికి అనేసి త్రుళ్ళిపడేట్లు చేస్తారు."

ఆనంద్‌బాబు గట్టిగా నవ్వేడు. "నా తత్వం ఎంత క్లుప్తంగా ఎంత స్పష్టంగా చెప్పేవో."

విమలానంద్ ఎప్పుడూ అలానే అనేవాడు. విజయ ఎప్పుడూ హెచ్చరికగానే మాట్లాడేది. ఉపేక్ష ముభావంగా వుండేవాడు.

# 11

వినాయకరావంటే ఆ గ్రామంలో అందరికీ హడలు. ఆయన వాక్కు దూర్వాసముని శాపం లాంటిది. ఆయన దృష్టి భస్మాసురుని మంత్రం వంటిది.

అతగాడు ఎవర్నయినా చూసి హేళనగా పరిహసించినా లేక మితి తప్పి మెచ్చుకున్నా ఆరోజున ఆవార్త ఊరంతా పాక్కిపోయేది. అంత నిర్లిప్తంగా నిర్లక్ష్యంగా వుంటాడు.

బేఫర్వాగా తిరుగుతాడు. మాట జారేడంటే దివినుండి భువికి జారిపడిన పిడుగువలె అగ్నిజ్వాలలు కక్కుకుంటూ దూసుకొని పోయినట్లు వుండేది.

ఇంతమాత్రంచేత అతగాడిని కోరమీసాలు తిరిగిన రౌడీగానో జబ్బలు విరుచుకున్న వస్తాదుగానో, కండ్లలో నిప్పులు చిమ్మే దొమ్మీగానో భావించుకుంటే అది శుద్ధ పొరపాటు.

సన్నగా పొట్టిగా నల్లగా గాలివస్తే పడేట్లుగా వుంటాడు. అయితే నిద్రాణమైన అనంతశక్తులేవో అతనిలో గుప్తంగా దాగివున్నట్లుగా అతన్ని చూచిన వారంతా త్రుళ్ళి పడతారు.

అతని వాక్కు విమోచన రహితమైన శాపం లాంటిది. అది అతనిలో గుప్తంగా దాగివున్న అజ్ఞాతశక్తో లేక పరిపక్వం చెందిన లౌకిక పరిజ్ఞానమో నిశ్చింతగా నిర్ధారణ చేయాలని జాడతీయ సాహసించిన గుండె దిటవు గలిగిన మగవాడెవ్వడూ ఆ ఊరిలో బయటికి రాలేదు. రాకపోగా అతడెదురు పడితే గుండెలు చేతబుచ్చుకొని రివ్వున మార్గం తొలగిపోయి పునర్జన్మ కలిగినట్లుగా ఆయాసం తీర్చుకొనేవారు.

అందుకు ఆగ్రామంలో సంభవించిన అనేక సంఘటనలు దృష్టాంతాలుగా నిలిచి వున్నాయి.

ఊళ్ళో వెండిపన్ను చేతికఱ్ఱ చౌదరీ, మీసాల పెద్ద నాయుడు ఆగర్భశత్రువులు. వారు ఎక్కడ నిలిచినా మధ్య

విషజ్వాలలు రగుల్కొని పసిసహాలను దగ్ధం చేస్తాయి. పచ్చి గడ్డివేస్తే భగ్గున మండుతుంది. పార్టీలు కనలినా ఎన్నికలు వచ్చినా వారిద్దరు ఒకరిపై మరొకరు శతాధికంగా అపవాదుల ఆయుధాలు నూరుకొని ఎక్కుపెడతారు.

ఒకసారి పొలం సరిహద్దు వద్ద కక్షలు పెరిగి అభియోగాలు మోపుకొని, ముఠాలు కడదొక్కుకొని ఈటెలు, బరిసెలు నూరుకొని,తుపాకులు దట్టించి మహాభారత సంగ్రామానికి సిద్ధపడ్డారు.

ఆ దారిన పోతున్న వినాయకరావు పక్కున నవ్వి ఆక్షేపణగా "మీరిద్దరు కత్తులు చరుస్తున్నారటోయి. బస్తీలో మీ పిల్లలిద్దరూ కులాలను ఉట్టి కెక్కించి సంబంధం కలుపుతున్నారే!" అన్నాడు.

అవమానంతో చౌదరి ముఖం ఎర్రగా కందిపోయింది. నాయుడు ఆగ్రహపరవశుడై నాడు.

సంధ్యా సమయానికి నాయుడు కూతురూ, చౌదరి కొడుకూ చెట్టపట్టా లేసుకొని దిగారు.

చౌదరి వెండిపన్ను చేతికర్ర నేలమీద వేసి తపతపా కొట్టేడు. నాయుడు మీసాలు క్రోధంతో మెలికలు తిరిగేయి.

నవదంపతులు చిఱుదరహాసాలు విరియించి పార్టీలు గంగలో కలిపేసి ఊరందరికీ తేనీటి విందిచ్చారు. చౌదరి అగ్నివర్షం కురిపించి తోలు ఛర్ణాకోలు ఝులిపించేడు నాయుడు కళ్ళు విస్ఫులింగాలయ్యేయి. తుపాకి దట్టించి

హుంకరించేడు.

ఛరణాకోలు వెళ్ళి మూల పడింది. తుపాకి రెండు ముక్కలై వీధి పాలయింది.

"మీరూ మీ దురాగ్రహాలు, శత్రుత్వాలూ. పట్లో కలవండి. ఈ గ్రామం కక్షాపూరిత ద్వేషాగ్నితో దహనమయి శ్మశానం కావడానికి మాత్రం వీలుపడదు. ఆపైన మేమిద్దరం మాత్రం సతీపతులం. మాది చట్టసమ్మతమైన వివాహం దీన్ని తిరస్కరించడం బ్రహ్మతరంకూడ కాదు. మూర్ఖంగా చేతులెత్తారో జేడీలు పడతాయి" అనేసేరు పిల్లలిద్దరూ.

నాయుడూ, చౌదరీ గుడ్లు మిటకరించి కుక్కిన పేనులయ్యారు. నేటికీ అదొక పొడుపుకథ. పుట్టుకాదిగా ఎన్నడూ బస్తీలో కాలు పెట్టని వినాయకరావు కీ సంగతి ఎలా తెలియ వచ్చిందని ఆశ్చర్యపోయింది గ్రామం.

ఆ తరువాత చిన్ననాయుడు తన విధవ కూతురుకు వివాహం జరిపించాలని పచ్చని పందిరి వేసుకునే ప్రయత్నంలో వుంటే "కూతురుకి పెండ్లి చేస్తావా?" అని అర్ధంతరంగా ప్రశ్నించేడు. అంతే!!

ఆ మరునాడు తనసద్వర్తనతో 'శాంతమ్మ' అని పేరు తెచ్చుకున్న ఆ దొడ్డకూతురు తనమేనబావతో లేచిపోయింది.

బస్తీలో ప్లీడరీ చేస్తున్న నారాయణరావు ఆస్తిపెంపు జేయాలని పొలం బేరం చేస్తుంటే "నీ కెందుకయ్యా ఇవన్నీ సత్వరంగా వున్న ఆస్తివ్యవహారాలు చక్కబెట్టుకోక" అన్నాడు.

కర్కశంగా. ఆ రెండవనాడు ప్లీడరు మళ్ళీ మంచం మీంచి లేవ లేదు.

ఈ విషయం విని వూరంతా గజగజా వణికింది. ఆ వికృత శక్తి పనాటికి ఎటు పలవలు విస్తరించుతుందోనని ప్రజానీకం భీతావహామైంది.

వినాయకరావు నోటినుండి పవాక్కు వినవలసివస్తుందో నని ఎవరికి వారు ఆయన్ను తప్పించుకుని తిరిగారు.

విశ్వాసరావు కతనితో స్నేహం అంటే విచిత్రంగానే వుంటుంది మరి ! ఇద్దరూ సంధ్యాసమయంలో ఎప్పుడయినా రెండు చదరంగం ఎత్తులు వేస్తారు. పేకముక్కలు కలుపు తారు.

వినాయకరావు సంక్షిప్తంగా మాట్లాడతాడు మధ్యలో. "ఆఁ !ఊఁ!" అని మాటల్ని పొదుపుచేస్తాడు. పేకలు కత్తెర్లు వేస్తూనూ, చదరంగం పావులు మార్చుతూనూ కళ్ళుమూసుకుని ఎక్కడో అగాధం లోకి దిగిపోతూవుంటాడు.

ఆ రోజు విశ్వాసరావుగా రెండువల్లనో మహా సంతో షంగా వున్నారు. అంతరంగికంగా ఆయన సంతోషం చెలియలి కట్టనే అతిక్రమించి దుమికి వస్తున్నది.

"మ్యా విశ్వంను గమనించవయ్యా ! లక్షలు గడించే పారే స్తున్నాడు" అన్నారు.

"అవును" అన్నాడు వినాయకరావు గుజ్జాన్ని వంక రగా గెంతించుతూ.

"వ్యాపారం అంటె అలా వుండాలి" విశ్వాసరావు గారు ఏనుగును కదిలించి రాజుకు కాపు పెట్టారు.

వినాయకరావు వ్యంగ్యంగా పరిహసించేడు.

విశ్వాసరావుగారి హృదయం ఝల్లుమంది. వినాయక రావు స్వరపేటిక అంత వ్యంగ్యంగా పలికి పరిహసించిందంటే!

మీరేమైనా పెట్టుబడి పెట్టేరా ఏమిటి? అన్నాడు వినాయకరావు అతని ఆలోచనల ద్వారబంధాలు మూసి వేస్తూ.

ఆ అనడం సాధారణంగానే వుంది. అయితే అందు లోంచి ఒక పిలుపు, ఒక అంధకారం, ఓ చిన్న హెచ్చరిక.

విశ్వాసరావుగారు త్రుళ్ళిపడ్డారు. ఆయన హృదయంలో ధూమశకటాలు పరుగెత్తేయి. ఆందోళన పెరిగిపోయింది.

"నీ అంతరార్థం ఏమిటి? విశ్వం వ్యాపారదక్షత బట్టి బాహ్య పటాటోపం మనేనా నీ ఉద్దేశ్యం? అయితే మన కర్తవ్యం ఏమిటి?" అని ప్రశ్నపరంపర కురిపించేరు. లిరిపురలు పడ్డారు. పరితపించేరు.

వినాయకరావు తాపీగా చదరంగం ఎత్తులు వేస్తూనే ఉన్నాడు. అంతేకాక 'మిత్రమా ఇదీ సంగతి' అని విడమర్చి చెప్పలేదు.

"వినాయకరావు చెప్పవేం? అని బలంగ కుదుపు చేసేరు.

"ఏమిటిది?" అన్నాడు వినాయకరావు

అమాయకంగా.

విశ్వాసరావుగారికి గంగవెర్రులెత్తేరు. స్వేదం పట్టి స్నానం చేసినట్లయింది. "అయితే నే వెళ్ళి తెలుసుకొస్తాను" అన్నాడు విశ్వాసరావుగారు చదరంగం పావులు దూరంగా విసిరికొడుతూ.

"ఎక్కడికి ?" అన్నాడు వినాయకరావు.

ఈసారి విశ్వాసరావు పంచప్రాణాలూ విశ్వాంతరాళం లోనికి అంతర్హితమైపోయాయి. వినాయకరావు యథాప్రకారంగా చదరంగం పావులన్నీ భరిణెలో పోసి గట్టిగా మూత తిప్పి విశ్వాసరావు హస్తాలలో పెట్టేడు వెడుతూ.

"వినాయకరావూ! ఒక ప్రశ్న వేయదలుచుకున్నాను. కనీసం స్నేహధర్మంగానయినా దీనికి జవాబు చెప్పు. నాకు విద్రోహం జరిగిన తప్పంటావా ?" అన్నాడు దీనంగా.

"ఎంతమాట ? మీకు ద్రోహం జరగాలని నేను మాత్రం కోరతానా విశ్వాస్ ?" అని చివాలున వెళ్ళిపోయాడు వినాయకరావు.

విశ్వాసరావుగారికి సందేహ నివృత్తికన్న అనుమాన ప్రవృత్తి అధికమయింది. వెంటనే విశ్వనాథంగారి దగ్గరకు వెళ్ళేరు.

విశ్వనాథంగారు గాఢంగా కౌగిలించుకున్నారు. కాఫీ స్వయంగా ఇచ్చేరు. సకల మర్యాదలు జరిపేరు.

వినాయకరావు నిర్వచనం మనసులో దాచుకుని నిగూ

ధార్థాల కోసరం గాలిస్తున్న విశ్వాసరావుగారికి విశ్వనాథం గారి వర్తనలో అతివినయం వ్యక్తమయింది. హడలి పోయారు.

"విశ్వం నా ఆర్థిక పరిస్థితి ఇరుకున పడింది. వ్యవసాయంలో ఆదాయంకన్న వ్యయ భారాలే అధికంగా వున్నాయి. ఆపైన ఈ విషయాలన్నీ సరిగా పరిశీలించకుండా ఇరవై ఎకరాల పొలానికి ఒప్పుదలపత్రం వ్రాసేను."

విశ్వనాథంగారు పరధ్యానంగా 'వూ' కొడుతూనే వున్నారు.

"డబ్బుకు ఇంత త్వరితంగా కటకట వస్తుందని నేను ఎన్నడూ భావించలేదు...."

విశ్వనాథంగారిదంతా సావధానంగా వినిపించుకోలేదు. మేనేజరును పిలిచేరు. ఫైల్సు తిరగేశేరు. కరస్పాండెన్సుమీద సంతకాలు పెట్టేరు. ఆవలించేరు. వెన్నువిరుచుకున్నారు. కళ్ళు నులుముకున్నారు.

ఇంతసేపు విశ్వాసరావుగారు విశ్వనాథంగారి వంక బిక్కుమంటూ చూస్తున్నారు. నేత్రాలలోని తడి ఆరిపోతున్నది.

"ఇంతకూ ఎప్పుడు వెడతానంటావు?" అన్నారు విశ్వనాథంగారు ఫైలు మూసివేస్తూ.

విశ్వాసరావుగారి హృదయం నిలువునా అవిసిపోయింది.

తను వచ్చిన కార్యసాధనసంగతి ప్రక్కకునెట్టి "వెళ్ళు" అంటాడేం అనుకున్నాడు. వినాయకరావు మాట అక్షరాలా నిజమనిపించింది.

"శాస్త్రి! ఆ చెక్ బుక్ ఇలా తే!" అన్నారు విశ్వనాథం గారు హటాత్తుగా.

శాస్త్రి విశ్వాసరావుగారివంక అత్యాశ్చర్యంగానూ వింతగానూ చూస్తూ చెక్ బుక్ తెచ్చేడు.

విశ్వనాథంగారు నవ్వుతూ తృణప్రాయంగా బాంక్ చెక్ మీద సంతకంచేసి విశ్వాసరావుగారి ఒడిలోకి విసిరారు.

"ఎంత అవసరపడితే అంత వినియోగించుకో విశ్వాస్! అయినా ఇంకో రెండురోజు లిక్కడ నుండగూడదూ?" అన్నారు ప్రక్కగదిలోకి వెడుతూ.

విశ్వాసరావుగారికి ఒక విద్యుల్లత తటల్లున మెరిసింది. కండ్లు మిరుమిట్లుగొలిపాయి. నిలువెల్లా విస్మయంతో కంపించి పోయారు.

"మీ రెంత పొరపడ్డారు. విశ్వాసరావుగారు? విశ్వనాథం గారు మిమ్మల్ని ఎంత ఆప్తులుగా ఎంచుకుంటున్నారు?! వారం రోజులనాడు మూడువేలు ఖర్చుపరచి విరంజన్ గారికి స్కూటరు తీసేరు. మాసానికి మూడువందలు తన స్వంత ఖర్చులో వ్రాసి ఆయనకు పంపమన్నారు. కానీ ఏం ఫలితం? ఆయన నిజాయితీని మీరు శంకించేరు" అని శాస్త్రి నిరాద రంగా చప\రించేసేడు.

విశ్వాసరావుగారి శిరస్సు అవమానభారంతో క్రుంగి పోయింది. సిగ్గుతో కుంచించుకుని పోయారు. తన లోభత్వం, బలహీనత ఇంత సులభంగా బహిర్గతం అయినందుకు చిన్నబుచ్చుకున్నారు.

శాస్త్రి సాంత్వనవచనాలు వల్లించేడు. మనసు కుదుట పరిచేడు.

ఆ చెక్కు తిప్పి విశ్వనాథంగారి స్వాధీనమే చేద్దాం అనిపించికూడా ఆగిపోయాడు. అలా చేస్తే తన సందేహం ప్రవృత్తి, అనుమాన వ్యక్తిత్వం మరింత తేటతెల్లమవుతుంది.

విశ్వాసరావుగారు గ్రామంలోకి వచ్చేరు. ఉత్తరీయం సవరించుకున్నారు. ఇంట్లోకూర్చుని చదరంగం పావులు తనకు తానే యిష్టానుసారం పెట్టుకుంటూ వినాయకరావు ఆగమనం కోసం ఎదురు చూస్తున్నారు.

వినాయకరావు వచ్చేడు. ఆ రావడంలో కొద్దిగా ఆశ్చర్యం పరాజయం వ్యక్తపరిచాడు. విశ్వాసరావుగారి విజయగర్వం రెట్టింపయింది.

"వినాయకరావూ ! నీవు వెల్లడించిన అభిప్రాయానికి ఇంతవరకూ ఏనాడూ తభావతు రాలేదు. నీ అశరీరవాణి యింతవరకూ పొల్లుపోలేదు. కానీ నావిషయంలో మాత్రం నీవు నిస్సందేహంగా పొరపడ్డావు" అన్నారు సగర్వంగా.

వినాయకరావు నోరు విప్పలేదు. తలవంచుకుని చదరంగం పావులు సర్దుకున్నాడు అన్యమనస్కంగా,

"ఇదిగో! విశ్వనాథంగారు స్వయంగా సంతకం చేసిన బాంక్ చెక్ తునాలమీద లతులు సర్దగల వ్యక్తిదగ్గర లెఖ్ఖల తభావతు రావడానికి పీల్లేదు. కనుక ఈ చెక్కును తిప్పి ఆయనకే పంపించివేస్తున్నాను."

వినాయకరావు తలఎత్తి చూసేడు. "పంపండి. అది ఎప్పటికయినా మిమ్మల్ని పునర్దర్శనం చేసుకోవలసిందే కదా?" అన్నాడు మందహాసంతో.

విశ్వాసరావుగారు విజయోత్సాహంతో పొంగి పోయారు.

"అంతేకాదు. విశ్వనాథం చిత్తశుద్ధిని నేను శంకించేను. వాడు నిజాయితీని అపార్థం చేసుకున్నాను. వాడి స్నేహ బంధాన్ని అవహేళన చేసేను.

మొన్ననే మన విరంజన్‌కు స్కూటరు తీసి ఇచ్చేడు. నెలకు మూడు వందలు తన ఖర్చు క్రింద వ్రాసి వాడికి పంపు తున్నాడు."

"అవును మీ స్నేహబంధానికి ఆర్థిక విషయాలెన్నడూ ప్రతిబంధకం కావు."

"అంతే! అంతే!" అన్నారు విశ్వాసరావుగారు.

"మీ సంగతెలావున్నా ఆయనెప్పుడూ మీ వాడు సరే నా?" అన్నాడు గంభీరంగా. విశ్వాసరావుగారు లజ్జపడి పోయారు. తనెంత స్వార్థపరుడయినా, విశ్వనాథం మాత్రం సువిశాల హృదయుడనేనా దాని అంతరార్థం?

'సందేహించకండి విశ్వాసరావుగారూ నేను చెప్పిన ఈ మాట మాత్రం నిజం" అని లేచిపోయాడు చదరంగం పావులు చెల్లాచెదరు చేసి.

విశ్వాసరావుగారి శిరస్సు గాఢతప్తమయింది. అయితే వినాయకరావు ప్రచ్ఛన్న హెచ్చరిక చేయడానికి బదులుగా శుభాన్ని కోరడం ప్రలోభపెట్టింది. గతంలో వినాయకరావు చేసిన హెచ్చరికవలే ఈ శుభాకాంక్ష కూడా వమ్ముకావచ్చు నన్న భావం అతని అంతర్యానికి తట్టలేదు.

బయట నిశి నల్లని ముసుగు వేసుకుని ఒళ్ళు విరుచు కుంది. ఆమెనుండి వెచ్చని నిశ్వాసాలకు బదులుగా చల్లని శీతల వాయువులు పరుచుకుంటున్నాయి. జడలు విప్పుకుంటున్న కారుమేఘాలు విచ్చుకుంటున్నాయి.

విశ్వాసరావుగారు అంత గాఢాంధకారంలోనూ వినాయకరావు గృహాభిముఖుడయ్యాడు.

ఎన్నడూ తన ఇంటిలో అడుగుపెట్టని విశ్వాసరావు అంత చిక్కని చీకటిలో తన ఇంటికి రావటం చూసి వినాయకరావు చకితుడు కాలేదు.

పైగా గాఢనిద్రలోంచి మేలుకొని కండ్లు నులుముకొని నిర్లక్ష్యంగా ఏమిటన్నట్లు చూసేడు. బయట ఎముకలలోని మూలుగులు రుచిచూస్తున్న చలి! వినాయకరావు కిటికీ తలుపులు తీసి గాలి లోన ప్రవేశించేట్లు చేసేడు తిరిగివచ్చి కుర్చీలో కూర్చుంటూ.

"వినాయకరావు? విశ్వనాథం నిజంగా మన సంబంధం కలుపుకుంటాడంటావా ? అదేనా నీ భావన ?" అన్నాడు భయంగా.

వినాయకరావు నిర్లక్ష్యంగానే "శుభాకాంక్షలకు కూడా నిర్వచనాలూ, భాష్యాలూ చెప్పుకుంటున్నారా విశ్వాసరావు గారూ ? అయితే ఈ ప్రలోభంతోనే ఇంత అర్ధరాత్రి ఇక్కడికి వచ్చేరన్నమాట !" అని చిత్రంగా ఎత్తిపొడిచేడు.

విశ్వాసరావుగారి శిరస్సుమీద చల్లని మంచుగడ్డ వుంచి నట్లయి ముఖం ముడుచుకొని పోయింది.

"మరేం ఆందోళన లేదులే విశ్వాసరావుగారూ ! విశ్వనాథం మీ బాల్యస్నేహితులుగదా ? ఒకవేళ ఆయన కా భావం లేకున్నా మీరు కోరితే తిరస్కరించగలరా ?" అన్నాడు ఆవులించి చిటిక వేసుకుంటూ.

విశ్వాసరావుగారు ఆలోచనామగ్నంగా బయట్టికి దారి తీశారు.

తుమ్మెదల సౌరులా చిక్కగా అలుముకున్న చీకట్ల లోతులలో ఆయన అన్వేషించుతున్న అదృష్టరేఖ ఎక్కడో లీలామాత్రంగా ప్రదర్శితమై అంతర్లీనమైంది.

# 12

విజయ ఇంటిలోనికి అడుగుపెడుతూనే విశ్వనాథం గారి మాటలు విని నిర్ఘాంతపోయింది. తను ఎన్నడూ భరించ

లేని భారం క్రుంగదీసినట్లయింది. అంతలోనే ఆవేశం.

పిడికిలి బిగిసింది. ప్రతిఘటనాశక్తి వెల్లుబికి వచ్చింది. ఇలాంటి పరీక్షాసమయంలో లొంగుబాటు స్వభావం మానసిక బలహీనత తన్ను వంచించి తన జీవితాన్ని శాశ్వతంగా పరిమార్చడానికి వీలులేదు. ఆమె అంతరాంతరాలలోంచి ప్రకృతిశక్తి శృంఖలాలను త్రెంచుకొని నిలుచుంది.

విశ్వనాథంగారు దరహాస వదనంతో నెమ్మదిగా వచ్చేరు

"విజయా విరంజన్‌తో నీ వివాహం నిశ్చయమైంది."

"నాన్నా నాతో...." విజయ గొంతు తడిచేసుకుంది.

విశ్వనాథంగారు గర్వాతిశయంతో వెలిగిపోయారు.

"అవునమ్మా! నీతో చెప్పకుండా చేయవలసిన నిర్ణయాన్ని చెప్పిచేయడం ఎందుకనా? అయినా నీకు చెప్పకుండా చేస్తానా?

విజయ నిర్విణ్ణురాలైంది. "నాన్నా విరంజన్...."

"తెలుసు తెలుసు విజీ. విద్యాధికుడు, సంస్కారి, నీపట్ల అభిమాని....."

విజయ మరింత తడబడింది. "నాన్నా ఉపేంద్రబావ..."

"అవును విజీ అమ్మ అలానే అంటున్నది. కానీ ఉపేంద్ర నీ కంగీకారయోగ్యం కాడని నాకు తెలియదా? జీవితం పరువు, ప్రతిష్ఠ, అంతస్తు, సౌభాగ్యాలకు తులాభారం లాంటివి."

విజయ ముఖం వెలవెలా పోయింది. అయినా ఆ అసహాయతలోనుండే మరొక విఫల ప్రతిఘటన.

"నాన్నా నేను. . . ." గొంతు ఎంతగా విప్పుకోవాలని సకలశక్తులతో కూడదీసుకొని ప్రయత్నించినా పెగలలేదు.

"హు! ఎందుకమ్మా ఆ మాట చెప్పటానికి అంత సిగ్గు. నేనుండగా నిన్నింకొకరి ఇంటికి పంపుతానా?"

విజయ ఆయన కంఠంలోంచి వెలువడిన దుస్సూచనా స్వరంచూచి నిప్పు తొక్కినట్లు ఎగిరిపడింది. తనమీద తనకు ఏహ్యాం కలిగింది.

విశ్వనాథంగారు తన హస్తాలతో విజయ శిరస్సును మృదువుగా నిమిరి వెళ్ళిపోయారు.

ఆయన అలా చేస్తుంటే విజయకు తన సౌభాగ్యాన్నంతటినీ జుట్టుపట్టుకొని ఈడ్చి నేలమీద మట్టగించినట్లు వుంది. ఆంతర్యం అదృశ్యశృంఖలాలను వేటినో త్రెంచుకోవాలని శూన్యంలో కలిసి పోవాలని ప్రయత్నించింది.

వెక్కి వెక్కి పడుతూ ఉపేక్ష దగ్గరకు పరుగు తీసింది. తలుపు మూసి తాళం బిగించివుంది. ఆమె ఆశలన్నీ నిలువునా కూలిపోయి ఆవేశం మీద నీళ్ళు చల్లినట్లయింది.

"ఏమయిందక్కా ఉపేక్షబావకు జ్వరంగా వుంటున్నదిగా హాస్పటల్లో చేరి అప్పుడే రెండు రోజులయింది" అంది అప్పుడే వచ్చిన హేమకుంతల దుఃఖదేవతవలే వున్న విజయను చూసి.

"నా కొక ఉపకారం చెయ్యగలవా హేమా!

ఉపేతు ఎక్కడ వున్నారో చెప్పగలవా? పోనీ ఇలాగే వెడదాం పద" అంది వేగంగా వీధిలోనికి వస్తూ. మేడక్రింది భాగంలో "హేమా!" అని విశాలాక్షమ్మ అప్పుడే కేకలు పెడుతున్నది.

విజయ సంబాళించుకుంది. "సరే నీవు నావెంట రానవసరం లేదులే హేమా! పోనీ ఉపేతు ఎక్కడ వుంటున్నారో తన దేహారుగ్మత ఏమిటో నీకు తెలుసా ఏవిఁటి?" అంది దుఃఖం ధ్వనిస్తున్న స్వరాన్ని దృఢపరుస్తూనే.

హేమకుంతల శిరస్సు అడ్డంగా తిప్పింది. "తెలియదు అక్కా. తెలియదు. అయనకు ఏం జబ్బో ఎక్కడ వుంటున్నారో కూడా తెలియదు. హాస్పిటల్లో చేరాలని చెప్పి వెళ్ళిపోయారు. అంతే! ఈ గదికి తాళం బిగించింది కూడ నేనే."

విజయకు క్రోధాగ్రహాలు ఒక్కసారిగా చిమ్ముకొచ్చేయి. "హేమా! తోటి వ్యక్తి ఏ జ్వరమో జబ్బో వచ్చి వీధులంట పడిపోతున్నానని వెడితే అలా వదలి వేయడమేనా! స్త్రీవైన నీలోకూడ ఆ మాత్రం జాలి, సానుభూతి, మంచితనం కరువైనాయా మూర్ఖురాలా?" అంది గిరుక్కున వెనక్కు తిరిగి వెడుతూ.

ఎఱ్ఱగా కందగడ్డయిన ఆమె ముఖమండలాన్ని, క్రోధంతో జేవురించివున్న కండ్లను చూచి, అత్యంత కఠినం

గానూ, అభియోగ పూరితమైన ఆమె ప్రసంగాన్ని హేమకుంతల చూచి నిశ్చేష్టురాలైంది.

అప్పటికి రాత్రి తొమ్మిది గంటలయింది. విజయ ఇంటికి వచ్చి చూచేప్పటికి అంతా నిర్మానుష్యంగా వుంది. రామలక్ష్మమ్మగారు ఇంటలో ఆలాపన చేసుకుంటున్నది. పోర్టికోలో చూచింది. డ్రైవరు అప్పుడే గాఢనిద్రలో వున్నాడు. విజయ ఆ వళ్ళు తెలియని పరిస్థితిలో క్షణంలో కారు స్టార్టుచేసుకుని బయటకు వెళ్ళిపోయింది. కాలు యాక్సిలేటరును తొక్కివేస్తున్నది. రోడ్డు నియమాలు రహదారి వత్తిడి ఆమె దృష్టిలో ఎక్కడా లేవు. ఎలాగోలా ఉపేక్షను పట్టుకోవాలి.

బోర్డు వ్రేలగట్టిన ప్రతి డాక్టరును "ఉపేక్షగారు మీకు తెలుసా! ఆయన మీతో సంప్రదించడానికి వచ్చేరా?" అంది. ఇంకొంతమంది వద్ద మరింత అయోమయంగా "ఆయనకు జబ్బేమిటి?" అని ప్రశ్నించింది. రాత్రి చీకటిలో అర్ధోన్మాది స్థితిలో ఫలాని వారు మీకు తెలుసా అంటూ బయలుదేరిన ఈ నల్లని స్వైరిణి ఎవ్వరని ఆశ్చర్యపడినవారున్నారు. ఆమె నిశ్వసించుతున్న అగ్నిజ్వాలలు నయనాల లోంచి రాల్చుతున్న నిప్పురవ్వలు చూచి భీతావహులైనవారున్నారు. యుద్ధరంగంలో వలె ప్రచండధ్వనితో ఎదురైన ప్రతి అడ్డంకినీ పిప్పిచేయాలన్నట్లు తమమీదికి వురికి వస్తున్న ఆ కారును చూచి ప్రజ తొలగిపోయింది.

అయినా ఆమె గుండెలలోని మంట చల్లారలేదు. క్రోధాగ్ని ఆణగారిపోలేదు. ఆ పట్టణంలోని వీధి వీధి గాలించింది. ఫలితం శూన్యమయింది. ఆమె మరింత క్రుద్ధురా లయింది. ఉన్నపళాన ఆ కారును అలాగే ఎదురుగా వున్న చెరువులోకి నడిపివేస్తే ! ఆ కారు, ఆ కారుతోపాటు తాను పచ్చి బూటకమయిన తన అంతస్థు.

విజయ కారు రంయిమని నడిపింది. ఇంకొక వంద గజాలు. ఆ తరువాత పదిహేను, ఇరవై అడుగుల ఎత్తున్న రివిటోమెంటో ! ఆ క్రింద మూడు, నాలుగు నిలువుల నీరు. ఆ క్రింద ఎన్ని రహస్యాలనయినా తనలో శాశ్వతంగా తొక్కి పట్టగల ఒక నిలువులోతు ఊబి. ఆ క్రింద శాశ్వత శాంతి !

తుపాకి గుండులా దూసుకుని వెడుతున్న కారు మూడు బోల్తాలు వేయబోయి ఆగి ఆ వేగానికి అడ్డంగా తిరిగి ఆగిపోయింది.

ఎదురుగా రివిటోమెంట్ ప్రక్కనే నడచి వచ్చిన వ్యక్తి ముందుకు తూలి కారువైపుకు పడ్డాడు.

విజయ తీవ్రకతతో కారు డోర్ పగిలేటట్లు తెరచి పారేసి బయటికి దూకింది. సృష్టించిన హక్కు అంటూ ఒకటి వుందిగదా అని దాన్ని మెడకు తగిలించుకొని తిరుగుతూ చావడానికి స్వాతంత్ర్యం కూడ ఇవ్వని మూర్ఖుడు సృష్టికర్త. విజయకు వాడి కోరలు నిలువునా పీకి పారేయాలనిపించింది.

బయట వాన తుంపర. అమితాగ్రహం. "ఎవరు మీరు ?

అందరూ చస్తే మీరు వచ్చి అడ్డుపడి ఋణశేషాన్ని మిగుల్చు తారా ఏమిటి ? సృష్టికర్తకు మీరుకూడ ఏమైనా సన్నిహిత బంధువులా ?" విజయ కసితో అతన్ని అసహ్యంగా ప్రక్కకు నెట్టివేయ బోయింది.

ఆ మసక వెలుతుర్లో ఇంకొక అరక్షణంలో అతన్ని ప్రక్కకు ఈడ్చివేసేది. కానీ అతని ముఖం అస్పష్టంగా కనిపించింది. మూలుగు మందస్వరంలో వినవస్తున్నది.

ఎవ రతను ?

విజయ ప్రూన్పడిపోయింది. రెండు అరచేతులతో ముఖం కప్పుకుని కుమిలిపోతూ ముందుకు కూలబడింది.

"బావా ?"

ఆ సంబోధన వినగానే ఆ వ్యక్తి దిగ్గున లేచి కూర్చు న్నాడు. "విజయా నీవా ?" అన్నాడు నివ్వెరపోతూ.

"అవును నేనే నీ సహాయం స్వీకరించే అర్హతలేని దైవం ఎవ్వరికీ ఇవ్వలేదు. అదలా పోనీ. నీవు వ్యాధిపీడితుడవైతే అది చెవిని వేసుకోవడానికి కూడ ఎవ్వరికీ అర్హత లేదా ? ఊరూ వాడా వదలిపెట్టి, గదికి తాళం పెట్టి, మందూ, మాకూ లేకుండా అర్ధరాత్రి చలిగాలిలో ఇలా దిక్కూ మొక్కూ లేకుండా తిరుగుతావా ? ఇలాంటి కఠినశిక్ష వేయ డానికి నేను చేసిన అపరాధం ఏమిటి ఉపేక్షా ?"

ఉపేక్ష వీటినన్నింటినీ చెవినివేసుకోలేదు. "అసలు నీ విక్కడి కెలా వచ్చావు విజయా ?"

విజయలోంచి ఇప్పటివరకూ వెల్లువలై పారిన "లావా" తిరిగి ప్రజ్వరిల్లి విజృంభించింది.

"ఏమిటి బావా అది ? ఎవరి సహాయమూ లేకుండానే ప్రపంచంలో బ్రతకగలనని అహంకారమా ? లేక నీ కీర్తి ప్రతిష్ఠలకు మచ్చ ఏర్పడుతుందని భయమా ?" అంది కస్సై విరచినట్లు.

ఉపేంద్ర ఆమె కటుస్వరానికి తీవ్ర అభియోగానికి అదిరిపడ్డాడు. మౌనంగా వూరుకున్నాడు. వర్షం చినుకు చినుకుగా పడుతూనే వున్నది.

"సరే ఇంకలే" విజయ ఉపేంద్రను చేయిపట్టి లేవనెత్త బోయింది. చేయి చుర్రుమంది. ఉపేంద్ర శరీరం తడిమి చూసింది. జ్వరం మండిపోతున్నది.

"ఇంత జ్వరంతో . వర్షంలో, చలిగాలిలో తిరుగు తున్నావా ?" అంది కారులోకి తీసుకొని వెళ్ళడానికి సహాయంపడుతూ.

"ఫరవాలేదు. మందు తీసుకునే వస్తున్నాను. ఇంటి కనే" అన్నాడు ఉపేంద్ర.

"అంటే ఆ డాక్టరు ఇలా వర్షంలో తడవమనే చెప్పేడు కాబోలు !" అంది విజయ వచ్చిన దారివైపే తిరిగి.

"నీకు కారు నడపడం వచ్చినట్లుంది" అన్నాడు చాల సేపటికి నసుగుతూ.

"అవును వచ్చింది. అదిగో అప్పుడే ఒకవైపు ట్యూబ్

పంచర్ కూడ అయినట్లున్నది. బర బర లాడుతూ కారు ప్రక్కకు ఎలా వెడుతున్నదో చూశావా'' అంది రెండవ చేతితో చీర చెంగు తీసి అతని శిరస్సు తడి తుడుస్తూ పోతూ.

ఆమె మాటలు అర్థంగాక తల పంకించుతూ ప్రక్కకు తొలగి.

"ఇప్పుడు నన్ను ఇంటికే తీసుకుని వెడతావా ?" అన్నాడు. ఎక్కడో శూన్యంలో మాట్లాడుతూ వున్నట్లుగా.

విజయ ఆందోళనగా ప్రక్కకు చూచింది. ఉపేక్ష అపస్మారకంగా కారుసీటు మీదకి తలపెట్టుకుని వెనుకకు పడుకున్నాడు.

కారు హేమకుంతల ఇంటిముందర వచ్చి ఆగింది. హేమకుంతల ముఖం దిగాలుగా వేలవేసుకుని కూర్చుంది. విజయ మనస్సు నొప్పించిన విషయం ఏమిటో ఇంకా ఆమె యోచించుకుంటూనే వున్నది కాబోలు !

"హేమా ! హేమా !'' పిలిచింది విజయ. ''కాస్త సాయం పట్టగలవా ?'' అంది మామూలు విజయవలె సాధువుగా !

హేమకుంతల విజయ తన్నలా పిలవడమే మహా భాగ్యంగా ఎంచుకొని త్వర త్వరగా కారువద్దకు వచ్చింది. ''ఏమిటక్కా ? ఏం తెచ్చేవు కారులో !''

''నా కర్మభారాన్ని మోసుకొచ్చేను హేమా !'' అంది ఉపేక్షను నెమ్మదిగా బయటికి చేతులలోకి

పంచుకుంటూ.

హేమకుంతల ముఖం వెలవెలా పోయింది. "బావ' అంటి గాద్గదికంగా.

"అవును బావే! ఏం ఆశ్చర్యపడుతున్నావా? తనకు జ్వరం వచ్చింది. బయట వాన కురుస్తున్నది. అయినా దిక్కూ మొక్కూ లేకుండా బయట తిరగడానికి ఆయనకు హక్కు వుంది హేమా! నీవూ నేనూ తనకు ఎవ్వరం?" అంది విజయ దుఃఖస్వరంతోనే.

ఆమె పెదవులు వణకుతూనే వున్నాయి. కంటివెంట ధారాపాతంగా అశ్రువులు రాల్తున్నాయి.

విజయ, హేమకుంతల ఇద్దరూ చేతులు ఆన్చి ఉపేక్షను పైకి చేర్చారు.

బట్టలన్నీ తడిసి పిడచలయ్యాయి. శరీరం తడిసి మంచు గడ్డగా తయారయివుంది. ప్రజ్వరిల్లి చల్లారిన అగ్నిపర్వతంపై పొగలు సెగలు నెమ్మదిగా విచ్చుకున్నట్లు అంతరాంతరాల లోంచి ఉష్ణం వెలికి వస్తున్నది.

విజయ అలా కన్నీరు కార్చుతూనే అతని శరీరం తువ్వాలుతో తుడవసాగింది. హేమకుంతల సహాయం చేసింది. శరీరానికి కాస్త తడి ఆరి స్వాస్థ్యం చిక్కగానే ఉపేక్షకు మెలకువ వచ్చింది. బలహీనంగా కళ్ళు తెరిచాడు. ప్రక్కన తైలం నిండుకున్న దీపజ్యోతులవలే ఒకవైపు విజయ, మరొకవైపు హేమకుంతల దైన్యమూర్తులై దుఃఖిస్తూ కూర్చుని వున్నారు.

"లేవగలవా బావా! నీవు ఇంకా బట్టలు మార్చుకో వలసివుంది" అంది విజయ అతనికి పొడిబట్టలు అందించుతూ.

"నీవు వెళ్ళి ఎవర్నయినా డాక్టర్ను పిలిపించగలవా హేమా అవకాశం ఉంటే కాస్తంత కాఫీకూడా తెప్పించు" అంది విజయ మందస్వరంతో.

ఉపేక్ష తల త్రిప్పి తిరస్కరించేడు. "అవసరంలేదు విజయా! ఇంకొక గంటలో జ్వరతీవ్రత పూర్తిగా తగ్గిపోతుంది. డాక్టరు అవసరంలేదు. కాఫీ ఎలాగూ తీసుకుంటాను."

"బావా?!"

"క్షమించు విజీ ఈ ఒక్క విషయంలో మాత్రం నన్ను వత్తిడి చేయవద్దు. నిన్ను వేడుకుంటున్నాను" అన్నాడు బట్టలు అందుకుంటూ.

విజయ మౌనంగా రెండు నిముషాలు అతని ముఖం లోనికి చూసింది. ఆ తరువాత బయట అంధకారంలో రెండు నిముషాలు పచార్లు*చేసింది.

హేమకుంతల ఇంతలో పొగలు కక్కుతున్న కాఫీ తెచ్చింది. ఉపేక్ష బట్టలు మార్చుకుని కూర్చుని వున్నాడు. అతని శరీరం డస్సిపోయి ముఖం పీక్కు పోయివుంది.

"ఇంక కాఫీ అయినా తీసుకో బావా!" అంది విజయ లోనికి వస్తూ.

ఉపేక్ష నుదురు తడువుకున్నాడు. కాఫీ చప్పరిం చాడు. కృతజ్ఞతాపూరితంగా అన్నట్లుగా నవ్వేడు. ఆ నవ్వు

తెల్లగా, పేలవంగా, ఉద్వేగరహితంగా వెలవెలా పోయింది. విజయపంక కన్నెత్తి చూచాడు.

విజయ అతనివంకే పంచప్రాణాలూ కేంద్రీకరించుకుని గదేకధ్యానంతో అతనివంకే చూస్తున్నది. నీరసించిన అతని దేహంలో విద్యుచ్చాలన ఎప్పటికయినా పునఃప్రతిష్ఠ కాగలదా అని కుమిలి కుళ్ళిపోతున్నది.

హేమకుంతల మౌనంగా గోడకు చేరగిలబడి నిల్చుని చూడసాగింది.

"విజయా !"

"ఏం బావా !" విజయ పటాలున జవాబిచ్చింది ఉత్సాహంగా.

"ప్రొద్దుపోయినట్లున్నది. ఇంటికి వెళ్ళవా ? మీనాన్న, అమ్మ ఎదురుచూస్తూ ఉంటారు ? అన్నాడు ఉపేతు ఆమె ముఖంలోకి చూడసాగి.

విజయ స్తంభీభూతురాలయింది. భూస్థాపితం కాబో తున్న తన భవిష్యజ్జీవనం వికృతావేశంతో తనలో పెల్లగిలిన ప్రతిఘటనాశక్తి అప్పుడు ఆమె కళ్ళకు కట్టినట్లయింది.

కానీ ఎదురుగా జ్వరపీడితుడై వానలో తడిసి చిక్కి డస్సిఉన్న ఉపేతు.

విజయ తన ఆందోళన నంతటినీ అణచుకుని పేలవంగా నవ్వింది. "అలాగే బావా అలాగే వెడతాను. నీవుమాత్రం ఎక్కడికీ కదలడానికి వీల్లేదు. ఇక్కడే పడుకుని విశ్రాంతి

తీసుకోవాలి. నే నీ రాత్రికి ఇక్కడే వుండిపోతే ఎంత బాగుం డును! కానీ నాకా అదృష్టంలేదు. నీ కే సహాయం కావలసినా హేమ నడుగు. ఉదయం నేను మళ్ళీ రావడానికి ముందరే ఇక్కడనుంచి వెళ్ళిపోయావంటే నన్ను హత్యచేసినంత ఒట్టు" అని గబగబా తలగడా సర్ది అతనిమీద దుప్పటి కప్పసాగింది.

ఉపేతు ఖిన్నుడయి మాట పెగలక మౌనంగా వూరు కున్నాడు. విజయ అతని పక్క సర్ది తలకు తలగడా వత్తు పెట్టింది.

"సరే వస్తా బావా ?! కానీ ఒక్కవిషయం గుర్తుం చుకో ! నీవు ఎంతో జ్ఞానవంతుడవు. నీకు నేను చెప్పవలసిన పనిలేదు. అయితే ఎంత విజ్ఞానికైనా ఒక్కొక్కప్పుడు చిత్త పై కల్యం కల్గడం సంభవం. ఆ భ్రమలో కొన్ని వాస్తవికాలు దృష్టికి అందకపోవచ్చు.

నిర్జీవమై కునారిల్లి వేడి నిట్టూర్పులు మాత్రమే విడు స్తున్న అగ్నిపర్వతం కూడా ఎప్పుడో ఒకనాడు ప్రజ్వరిల్లు తుంది బావా ! అది శాశ్వతంగా చైతన్యరహిత మనుకోవడం కేవలం పొరపాటు మాత్రమే కాదు. ఆత్మవంచనకూడా అవుతుంది" అని విజయ చివాలున వెళ్ళిపోయింది.

ఉపేతు వేడిగా ఒక నిట్టూర్పు విడిచాడు. అతని కను కొలుకులలో కన్నీటి బిందువులు స్పష్టంగా పేరుకొని వున్నాయి.

ప్రక్కకు వత్తిగిలేడు. హేమకుంతల విచారంగానూ,

ఉద్విగ్నంగానూ అతనివంకే చూస్తున్నది. దౌర్భాగ్యమైన ఈ జీవన సూత్రాలకు ఎక్కడెక్కడ ఎందువల్ల విడిపడని చిక్కులు ఏర్పడుతున్నాయో ఆమెకు అర్థం కాలేదు.

"హేమా !"

హేమ ఉలిక్కిపడింది అతని హీనస్వరం చూచి.

"ఏం! బావా!"

"విజయ మాటలు విన్నావుగా"

"ఇప్పు డెందుకు బావా అవన్నీ !"

"ఒకప్పుడయితే అవసరం లేదు హేమా. కానీ ఇప్పుడిక తప్పదు. ఒక వాస్తవాన్ని కొంతకాలం విస్మరించి నిర్లక్ష్యం చెయ్యగలం. ఎరగనట్లు నటించగలం. తప్పించుకుని తిరగగలం. కాని ఎప్పుడో ఒకప్పుడు దాని ఎదుటపడి నిజాన్నంగీకరించక తప్పదు.

కునారిలి వేడి నిట్టూర్పులు విడిచే అగ్నిపర్వతం ఎప్పుడో ఒకప్పుడు ప్రజ్వరిల్లుతుంది. నిజమే! కానీ అదే దానిలోని చివరి చైతన్యం. ఆ ప్రజ్వలన తరువాత దానిలో జీవనమే లేదు. ఉండదు. అది ఆత్మవినాశకరం" అని దుప్పటి గుండెలవరకు కప్పుకుని కళ్లు మూసుకున్నాడు.

హేమ చలించి పోయింది. ఆమె కండ్లలో జాలి, సానుభూతి కలసి కన్నీరు జలజలా రాలింది. ఉపేక్షకు గాలి పీచుతూ బయట అంధకారంలోకి చూడసాగింది.

విజయ ఇంటికి చేరుకునేప్పటికి పదకొండు గంట

లయింది. విశ్వనాథంగారు ఇంకా ఇంటికి తిరిగిరాలేదు. రామలక్ష్మమ్మగారు కంగారు పడుతున్నది. డ్రైవరు కారు లేకపోవడం చూచి తనను నిద్రాదేవత అంతగా వంచించి నందుకు భయపడిపోతున్నాడు.

కారువచ్చి పోర్టికోలో ఆగే సమయానికి ఒక టైర్ లో గాలి పూర్తిగా పోయి రిమ్ముమీద ఆనిపుండి బరబరా మోగుతున్నది.

"నన్ను నిద్ర లేపకపోయ్యారా అమ్మా! ఆ టైరులో గాలి పూర్తిగా పోయిందే" అన్నాడు డ్రైవరు.

"పోయింది. పోతే ఇంకో టైరు, ట్యూబు వేయించరాదా? ఈ ఇంట్లో ఏం కరువొచ్చినా ఇంకా డబ్బు కరువు రాలేదుగా" అంది విజయ కఠినస్వరంతో కారుడోరు చక్రీమని తీసి. డ్రైవరు నిశ్చేష్టితు డయ్యాడు.

"అలా భయపడ నవసరంలేదు. గాలి ఎలాపోయిందని విశ్వనాథంగా రడిగితే విజయభారతే ఈ కారు ఒంటరిగా తీసుకెళ్ళిందని చెప్పు" అంది నిర్లక్ష్యంగా.

డ్రైవరు మరి పోయింది. విజయ నోటివెంట నాన్న అనడానికి బదులుగా విశ్వనాథంగారన్న సంబోధన వినడం అదే ప్రథమం.

విజయ చరచరా ఇంటిలోనికి వెళ్ళింది.

"ఒంటరిగా బయటికి వెళ్ళవద్దని నాన్న అన్నిసార్లు చెప్పారుగదా! ఎక్కడికి వెళ్ళేవే విజయా!" అని నిగ్గదీసింది

రామలక్ష్మమ్మగారు.

విజయకు గాయం మీద కారం చల్లినట్లయింది.

"కొట్లోకి వెళ్ళేను" అంది విజయ కోపంగా.

"కొట్లోకా ఏం కొన్నావేమిటి ?" అంది రామలక్ష్మమ్మ గారు అమాయకంగా.

విజయకు అంత విషాదంలో కూడ నవ్వువచ్చింది. "కొనలేదు అమ్మా కొనిపించుతున్నారు కర్మఫలం" అనేసి వెళ్ళిపోయింది.

# 13

ఉదయం ఉపేక్ష కనులు తెరిచేప్పటికి ఆరుగంట లయింది. అప్పటికే విజయ అతని ప్రక్కన కూర్చుని ఏదో ఆలోచించుకుంటూ వుంది. కండ్లు ఎర్రగా ఉబ్బి నిద్రలేమిని సూచిస్తున్నాయి. మనిషి నిస్త్రాణగా వుంది. క్రిందిరెప్పలక్రింద కన్నీరు స్రవించి ఎండిపోయిన చారికలు !

ఉపేక్ష కొద్దిగా కదిలేడు. విజయ అతనివైపు తిరిగింది. అతడు కండ్లు విప్పటం చూచి లేచి పోబోయింది.

"విజయా !" ఉపేక్ష కాస్తంత స్వాస్థ్యం చిక్కిన కంఠస్వరంతో పిలిచేడు.

"రాత్రంతా ఇక్కడే వున్నావా ? నేను వెళ్ళమని చెప్పలేదూ ?"

"వెళ్ళేను. కానీ రాకతప్పలేదు" అంది చేతులలో ముఖం దాచుకుని.

ఉపేంద్ర మౌనంగా విజయవంక నిశ్చలంగా చూస్తూ వూరుకున్నాడు.

విజయ దుఃఖిస్తున్నది. వెక్కి వెక్కి పడుతున్నది. ఆమెలోని గాంభీర్యమూ, ఔన్నత్యమూ అడుగంటిపోయాయి.

"ఏమిటిది ?" ఉపేంద్ర సందేహంగా. ఏదో అనుమానం అతన్ని శూలంతో గ్రుచ్చినట్లయింది.

ఒక నిమిషం అలాగే ఆగి "ముందు పళ్లు తోముకుని కాఫీ తాగు బావా" అని తనలోని దైన్యాన్ని, దుఃఖాన్ని తుడిచి వేసుకుని లేవబోయింది. ఉపేంద్ర అనూహ్యంగా ఆమె చేయిపట్టుకుని కూర్చోన బెట్టేడు.

"విజయా ! నీవు చెప్పింది ఎంతఘోరవార్త అయినా కాఫీ త్రాగడం ఎలాగూ మానను. ఆ విషయం ఏమిటో ముందుగానే చెప్పివేయి" అన్నాడు తీక్ష్ణదృష్టితో.

"అయితే చెబుతాను. కానీ నేను చెప్పదలచుకున్నది ఏమిటో నీకు తెలియదా బావా ?"

ఉపేంద్ర బాణపు వ్రేటు తిన్నాడు.

"తెలియదు. తెలియదనే అనుకుంటున్నాను."

విజయ తెల్లగా పాలిపోయింది. ఆమె నయనాలలోని

కాంతిని అంధకారం క్రమ్మివేసింది.

"అయితే నే చెప్పకుండా ఉండటమే మంచిది" అంది లేచి నిల్చుంటూ.

"విజయా నీ పెళ్ళి నిశ్చయమై...." అంటూ హేమకుంతల ఆగిపోయింది. ఉపేక్ష మేలుకొని వుండటం చూచి నివ్వెరపోయింది.

ఉపేక్ష విజయభారతి వైపు హేమకుంతల వైపు శూన్యంగా చూచాడు. విజయ ఆతని కండ్లలోనికి చూడాలని ప్రయత్నించుచూనే కండ్లు దించివేసుకుంది.

"హేమా !"

హేమ నేరంచేసిన దానిలా అడుగులు వేసుకుంటూ ముందుకు వచ్చింది.

"విజయ వివాహం నిశ్చయమైందా ?"

హేమ అవ్యక్తురాలయింది. విజయభారతి వైపు ఉపేక్ష వైపు వెర్రిగా చూచింది. "అవును"అంది చివరికి కాలి బొటన వ్రేలు నేలమీద రాస్తూ. "బావా! అక్క నిన్నటినుండి నీకోసం కండ్లలో వత్తులు వేసుకుని ఎదురుచూస్తూంది" అంది బాధగా తనే మళ్ళీ.

ఉపేక్ష నిర్లక్ష్యంగా, నిస్సారంగా, ఉపేక్షాభావంతో నవ్వేడు.

"బాగుంది విజయా! నా అభినందనలు అందజేస్తున్నాను".

విజయ తటిల్లున అతని ముందు కూర్చుని అతని చేతులు అందుకుంది.

"బావా! నీవా ఈమాట అంటున్నది? నేను నీకేమీ కానా?" అంది కన్నీటితో.

ఉపేక్ష ఉద్వేగాన్ని అణచుకొని పొడిగా చిఱునవ్వు నవ్వేడు. "విజయా! ఈ ప్రశ్నను చాలాసార్లు వేశావు? కానీ ఈ సారి జవాబు చెప్పుకోక తప్పదు. నీవు నాకేదో అవుతావు. కనుకనే అంత అర్ధరాత్రి తెచ్చి ఇక్కడ పడేశావు. యోగక్షేమాలు విచారించావు. నీవు ఎక్కడున్నా నా యోగ క్షేమాలువిచారిస్తావు. ఇంక అంతకన్న ఏం కావాలి?" అన్నాడు.

విజయ, హేమకుంతల కొయ్యబారిపోయారు.

"బావా! బావా!" అంది విజయ గొనుగుకుంటు న్నట్లుగా ప్రాధేయపూర్వకంగా.

ఉపేక్ష ఒకక్షణం ఆగి నెమ్మదిగా విజయవైపు చూస్తూ కండ్లు మూసుకుని నెమ్మదిగా విజయ హస్తాలలోంచి తన చేతుల్ను వదిలించుకున్నాడు.

"విజయా? నీవు నిజంగా నన్ను ప్రేమించు తున్నావా?"

"మాటలు ఎంత గట్టిగా చెప్పినా సందేహించడాని కాస్కారం వుంటుందేమో బావా! నా హృదయాన్ని చీల్చ మంటావా?" అంది విజయ.

విజయభారతి అశగా చూస్తున్నది. అతని గుండెల్లోంచి

ఏదో విస్పష్టమైన కృతనిశ్చయం. విషాదంగా చిన్న నవ్వు నవ్వాడు.

"విజయా! నీవు తప్పనిసరిగా నాకేదో అవుతావనే అనుకున్నాను. కావాలనే నీవు అనురాగాల్ని చిందించేవు. ఇప్పుడేం చేద్దాం. నాతో లేచి వస్తావా ?"

హేమకుంతల కొయ్యబారిపోయింది. విజయ నిర్విణ్ణురాలయింది. కానీ వెంటనే ధైర్యసాహసాలను కూడదీసుకుంది.

"బావా! అంతర్యానికీ, ఆత్మ విశ్వాసానికీ విఘాతం కలిగించకుండా వుండటమే స్త్రీ ధర్మమయితే వివాహానికీ, లేచిరావడానికీ భేదంలేదు. నా అంతర్యాన్ని నీ కప్పగించుతున్నాను. నేనునీదాన్ని. నువ్వు 'ఊఁ' అనుఇలా నేవచ్చేస్తాను" అంది అతని హస్తాలను గుండెలకు హత్తుకుంటూ.

ఉపేక్ష నెమ్మదిగా కండ్లు తెరిచాడు. అవి విస్ఫులింగాలవలె నిప్పులు రాల్చుతున్నాయి. అప్పటివరకు బిగించుకుని వున్న పండ్లు పటపటా కొరికాడు.

"వస్తావు. ఎవ్వరితోనయినా లేచి వచ్చేస్తావు. మూర్ఖురాలా! మనిషి చచ్చినా బ్రదికినా నిలబెట్టుకొన వలసిన మానమర్యాదలు, నిలుపుకొనవలసిన పరువు ప్రతిష్ఠలూ కొన్ని వున్నాయి. వాటిని మంటగలప దలుచుకున్నావా? స్వైరిణి" అన్నాడు క్రోధంగా.

విజయ శిరస్సు సహస్రశకలా లయింది. ముఖం

కప్పుకొని శరవేగంతో రివ్వున బయటికి దూసుకొని పోసాగింది.

"బావా! ఇదా? నీవు..." అంటున్న హేమను ఉపేక్ష కసిరికొట్టాడు. "నీవు కూడా పో ఇక్కడ్నించి".

విమలానంద్ అప్పుడే లోనికి ప్రవేశిస్తున్నాడు.

"విజయా! విజయా!" అన్నాడు ఆశ్చర్యంగా మూస పోసిన ఆ అవమానిత దుఃఖదేవతవైపు చూస్తూ. విజయ భుజాన్ని స్పృశించబోయిన అతని హస్తం విద్యుదాఘాతం తగిలినట్లు వెనుకకు పోయింది.

విజయ తల ఎత్తింది. కండ్లు బురదనీటిలో మునిగిన కలువపువ్వులవలె వున్నాయి. వాటిలోంచి చురుక్కు మంటున్న ఎర్రని జీరలు!

"మీరు కూడా ఇంతేనా విమలానంద్ బాబు! స్త్రీ అంటే మీకు కూడా గౌరవంలేదా?" అంది. అశ్రువులు వెల్లువలై జలజలా రాలేయి. అది క్రోధమో, దైన్యమో స్పష్టంకాలేదు.

విమలానంద్ హృదయం బాకుతో పొడిచినట్లయింది. బాధాతప్తు డయ్యాడు. కాళ్ళు వాటంతటవే వెనుకకు నడిచేయి. బల్లిలాగ గోడకు అంటుకుని నిలిచాడు ఖిన్నుడయి చూస్తూ.

విజయ క్షణం కూడ ఆలస్యం చేయకుండా ఇంకో రెండు అడుగులు ముందుకు వేసింది. పాదాలక్రిందికి దిగివున్న

చీర కాలికి లుంగలు పడింది. ముందుకు తూలింది. విమలా నంద్ చేతులు చాచి ఆమెను ఆదుకొనబోయి కూడా తనను తాను అదుపులోకి తెచ్చుకున్నాడు.

విజయ అతని చేతులను దూసుకుంటూనే నేలమీదకి ఒరిగింది. ముక్కు జెదిరి రక్తం స్రవించసాగింది.

విమలానంద్ ఆమె తల పైకెత్తబోయాడు.

విజయ అంత బాధలోనూ అతని హస్తాన్ని విసిరి కొట్టింది. "మన స్నేహబంధాన్నయినా శాశ్వతంగా వుండనీ ఆనందబాబు" అంది వేడుకుంటున్నట్లుగా.

తనంతట తనే లేచి వెళ్ళిపోయింది. హేమ ఆమెకు సహాయం పట్టింది కన్నీరు కార్చుతూ.

ఉపేక్ష ఇంతసేపూ అర్ధనిమీలిత నేత్రుడయి చూస్తు న్నాడు. విమలానందబాబుకు అతన్ని చాచి లెంపకాయ కొట్టాలనిపించింది. జీవితంలో రాగస్పందనే లేని ఇలాంటి శిలావిగ్రహాలు ఎంతమంది ఆశలను నేలంటా కూల్చివేస్తు న్నారో అనిపించింది. "దీనంతటికీ కారణం నీవేనా ఉపేక్షా?" విమలానంద్ గర్జించాడు.

"కాదు. పరిస్థితులు. అపార్థాలు. అవాంఛిత కార్య."

విమలానంద్ రెచ్చిపోయాడు.

ఒక కార్యాచరణ అవివేకమో ఆత్మార్పణో అందరికీ ఒక కాలంలో తెలియదు. ఉపేక్షా! తెలిసిన తరువాత తిరిగి కాలు కూడదీసుకోనూ లేరు".

"కావచ్చు. కానీ తెలుసుకొనగలిగిన వారు పర్యవ

సానాలూ, ఫలితాలూ తెలుసుకొన్నప్పుడు సాహసం చెయ్యనూలేరేమో! మానవతల్ని గురించి నీకు చాలా విచిత్రమైన అభిరుచులున్నాయి ఆనంద్" అన్నాడు నిరసనగా.

ఆనంద్ కొద్దిగా జంకేడు. "అవునేమో ఉపేక్షా! కానీ ఏ అభిరుచీ, అభిప్రాయమూ వుండకపోవటం కూడ ఒక సిద్ధాంతం క్రిందనే చెల్లితే చాలా ప్రమాదంవుంది. ధైర్య సాహసాలు లేకపోవడం నిగ్రహం క్రిందనూ, నమ్మిన వారిని కూల...."

"విమలానంద్!" ఉపేక్ష గట్టిగా గద్దించేడు. అతని ముఖం జేవురించింది. అంతలోనే ఆవేశ కావేషాలను అదుపులోనికి తెచ్చుకొని తన్నుతానే సంబాళించుకున్నాడు.

"నాలో తెగింపు, ధైర్యసాహసాలు లేనిమాట నిజమే కావచ్చు. కానీ అదే విషయాన్ని పదే పదే జ్ఞప్తిచేసి నన్ను ఎత్తిపొడిచి మీరందరూ పొందుకొనేదేమిటి?"

విమలానంద్ ఒకింతసేపు తటపటాయించాడు. "మా కెవరికీ ఏమీ ఒరగ నవసరం లేదు ఉపేక్షా! కానీ ఆత్మ విమర్శ చేసుకుంటే ఎవరిన్యాయం వారికయినా కలుగవద్దా?"

"పోనీలే ఆనంద్! నాకు న్యాయమే జరుగుతున్నదో అన్యాయమే జరుగుతున్నదో నాకు తెలుసు. ఆపైన సవ్యాప సవ్యాలు ఎప్పటికో ఒకప్పటికి నిర్ణయం కాకనూపోవు. దయచేసి ఇంకనయినా ఈ ప్రసక్తి ఆపుచేస్తావా" అన్నాడు ఉపేక్ష.

విమలానంద్ నైరాశ్యంతో "సరే అలాగే" అని లేచి వెళ్ళిపోసాగాడు.

"విమలానంద్" ఉపేక్ష హీనస్వరంతో పిలిచాడు.

ఆనంద్ వెనుకకు తిరిగాడు ఏమిటన్నట్లు.

"కాఫీ చల్లారిపోయింది. కాస్త బయట ఏదైనా హోటల్నుంచి కాఫీ పంపించగలవా?"

విమలానంద్‌కు ఉపేక్షస్థితి అప్పటికి కనువిప్పయింది. ఉపేక్ష వ్యాధిపీడితుడై కృశించి నీరసంగా కొనవూపిరి పెట్టుకొని ప్రక్కమీద పడివున్నాడు. విమలానంద్ పశ్చాత్తప్తుడై తిరిగివచ్చి అతనికి కాలకృత్యాలలో సాయం చేయసాగాడు. ఆనాడు అలా తెల్లవారింది. మిటమిటలాడుతూ సూర్యుడు నడినెత్తి కొచ్చాడు.

# 14

విశ్వనాథంగారి కబురు విశ్వాపరావుగారిని ఆనందాబ్ధిలో ముంచి పైకి లేపనెత్తింది. తన శ్రవణేంద్రియాలను తానే విశ్వసించలేక పోయాడు. విశ్వనాథం నిజంగా అంత విశాల హృదయుడా?

వెంటనే ఆయన వినాయకరావు దగ్గరకు వెళ్లారు. ఆయనలో చెప్పరాని ఉత్సాహ సంతోషాలు తొణికిసలాడుతున్నాయి.

వినాయకరావు ఆయన్ను గమనించగానే "ఏం? సంబంధం నిశ్చయం చేయమని కబురు వచ్చిందా ఏవిఁటి?" అని ప్రశ్నించేడు.

అందుకు విశ్వాసరావుగారు ఆశ్చర్యపడటం మర్చిపోయి "మంచిదే నంటావా?" అన్నారు.

"అద్భుతం విశ్వాసరావుగారూ, విజయభారతి మీ ఉభయ కుటుంబాలకు కులదీపికై వెలుగుతుంది" అని పెద్ద సర్టిఫికేటు ఇచ్చాడు.

"ఆమె విశ్వనాథంగారికి తగిన కూతురని, విశ్వాసరావుగారికి తగిన కోడలని అనిపించుకుంటుంది."

అతని మాటలలో విరంజనరా వన్న పదం ఎక్కడా పడక పోవడం విశ్వాసరావుగారు గమనించలేదు.

"అయితే సంబంధానికి అంగీకారం తెల్పుతున్నాను."

"తెల్పండి మీరు ఆపుచేయాలన్నా ఇక ఆగదు."

విశ్వాసరావుగారికి పుట్టెడంత బలం చిక్కింది. "సరే" అని విశ్వనాథంగారికి కబురు పెట్టేసి ఈ సంబంధం కలుపుకోవడంవల్ల తన ఆస్తి చక్రవడ్డీలాగా ఎంత పెరుగుతుందో, విశ్వనాథంగారి వ్యాపారం ఈ వరసను పెరిగితే ఎన్ని జిల్లాలను కొనుగోలు చేయవచ్చో అంచనా వేసుకున్నారు.

అసలు విశ్వనాథంగారి తత్వమే అంత! ఆయన తలపెట్టిన పనికి ఎప్పుడూ అవాంతరాలు రావు. రావడానికి వీలులేదు. వస్తే ఆయన దాని అంతు తేల్చుతారు.

ఢంకాపలాసులో ఒకఆటగాడికి ఎప్పుడూ మూడు ఆసులే పడి నట్లు ఆయన ప్రణాళికలు నిర్విఘ్నంగా కొనసాగి పోతాయి.

"వచ్చే మాసంలో విజయ పెళ్ళి" అని విశ్వనాథంగారు చెబితే రామలక్ష్మమ్మగారు ఆశ్చర్యపోయింది. ఆయనకు విజయ పెళ్ళిమీద ఇంత ఆసక్తి ఎప్పుడు, ఎలా పుట్టుకొచ్చిందో ఆమెకి అర్థంకాలేదు.

"వరుడు మన విశ్వాసరావు కొడుకు విరంజన్" అని చెబితే-

"అయితే మన ఉపేక్షకిచ్చి చేయరన్న మాట ?" అని అమాయకంగా అడిగింది.

విశ్వనాథంగారు ఫక్కున నవ్వేరు. "వాడికి పెళ్ళి ఎప్పుడో నిశ్చయమై పోయింది" అన్నారు తేలికగా.

"విజయా వచ్చే మాసం నీ వివాహం" అన్నారు విశ్వ నాథంగారు విజయతో. ఆయన ముఖంలో నవ్వు.

"ఊ" అంది విజయ.

విజయ నిస్సారంగా కుంచించుకు పోయింది. ఆమెలో ప్రజ్వరిల్లిన తిరుగుబాటు మీద ఉపేక్ష కుమ్మరించిన చన్నీళ్ళతో ఆమె వ్యక్తిత్వం చల్లని మంచుగడ్డలా ఘనీభవించింది.

ఉపేక్ష తనకు చేసిన అవమానం ఆమెలో క్రోధాన్ని ఆగ్రహాన్ని నింపింది. జీవితాన్ని హింసించుకోవడమే అందుకు ప్రతీకారం !

విజయభారతి వివాహం అని తెలుస్తూనే మదిర

రెక్కలు కట్టుకొని వాలింది.

"చివరికి ఆశించిన జావే దొరికావా" అంది విజయను ఎత్తిపొడిచి.

"విజయ కండ్లలో నీరు నింపుకుంది.

"అయితే ఎవరు ?" మదిర ఆశ్చర్యపడింది.

"నాన్నగారికి విశ్వాసరావని స్నేహితులున్నారు. విరంజన్ రావు ఆయన కొడుకు."

మదిర నిర్విణ్ణురాలయింది. "అయితే నీకు ఇష్టంలేదా?' అంది వేలవంగా.

"ఈ ప్రశ్న నీవు వేయవలసిందేనా మదిర అక్కా' అంది విజయ ముఖం తిప్పుకుంటూ.

ఆ సంభాషణ అంతటితో ముగింపు.

విజయ పెండ్లికి వచ్చిన మధురమ్మ "పెండ్లీడుకు వచ్చిన తన కూతురు మదిర అలాగే వుండిపోయిందని" కండ్లనీరు పెట్టుకుంది.

"దానికేం చదువుకున్నది. మన జెడద లేకుండా తగిన వరుడ్ని అదే ఎన్నుకుంటుంది" అన్నారు విశ్వనాథంగారు గర్వంగా.

రామలక్ష్మమ్మగారు పెండ్లి హడావిడిలో మునిగి పోయింది.

ఉపేక్ష ఎక్కడికో చెప్పిచేయకుండా వెళ్ళిపోయాడు. విజయ పెళ్ళికన్న ముందరే అతనికి లగ్నం నిశ్చయం

అయిందని మాత్రం హేమకుంతలకు తెలిసి కొయ్యబారి పోయింది. ఇంత అమృత భాండం ఒక్క క్షణంలో విషపూరితం కావడానికి కారణం ఎవ్వరో ఆమెకు అర్థంకాలేదు. ఎవరు ఎంత కాదన్నా, వాదించినా కొన్ని విషయాలు మాత్రం ఆమెకు తెలుసు.

విజయ ఉపేక్షను ప్రేమించింది. ఇంకా ప్రేమిస్తున్న దేమో! ఉపేక్ష విజయను ప్రేమించాడు. అతను ఎంతగా నిరాకరించినా అతని అంతర్యం ఈ విషయాన్ని అజ్ఞాతంగా ఉంచజాలదు.

అయితే ఈ క్షణిక క్రోధావేశాలు, వికృత మలుపులు ఏమిటి?

విజయ వివాహానికి నిస్సంతోషంగా వున్నది హేమ కుంతల ఒక్కతే. అంత హడావిడిలో ఆమె ముఖకవళికలను పరిశీలించినవారు ఎవ్వరూ లేరు.

విమలానంద్ విజయను కలుసుకోవాలని ఎంతగానో ప్రయత్నించేడు. కాని అతని ఆశ నిరాశే అయింది. ఉపేక్ష ఎక్కడికి అదృశ్యమయ్యేడో అతనికి వివాహంనాటి చివరి క్షణం వరకూ తెలియదు.

విజయవివాహానికి అనాహూతుడుగా వచ్చింది అత నొక్కడే. అతను తెచ్చిన బహుమానం నీలం పొదిగిన వుంగరం. ఆ నీలం కలువమొగ్గలా చెక్కబడింది.

# 15

ఈ వివాహాని కింత వ్యయంకావాలని విశ్వనాథం గారు ఎవరికీ చెప్పలేదు. దీని నిమిత్తం ఇంతయిందని కరటక శాస్త్రి విశ్వనాథంగారికి ఎరుకపరచనూ లేదు.

ఓ జిల్లాకు జిల్లాకే అద్భుతంగా సంతర్పణ జరిగింది. మంచినీరు కావాలన్న వారికల్లా కూల్‌డ్రింక్ సప్లయి చేసేరు. వీధినపోయే ప్రతివ్యక్తికీ స్నేహబాంధవ్యాల ప్రసక్తి లేకుండా ఈడ్చుకొచ్చి గొంతువరకూ విందు తినబెట్టేరు.

విశ్వాసరావుగారి కండ్లు గిర్రున తిరిగేయి. బెలబెలా తిరుగుతున్న ఈ కార్లు, స్వపరభేదం లేకుండా సాగుతున్న ఈ సంతర్పణ చూచి ఆయనకు మతి పోయింది.

నిర్లక్ష్యంగా సంపదను, పరువును, ప్రతిష్ఠను గోటితో మీటి చిఱునవ్వు నవ్వుతున్న విశ్వనాథంగారిని పలుకరించ డానికి కూడా ఆయనకు ధైర్యం చాలలేదు.

పట్ట పగలుగా వెలుగుతున్న ట్యూబ్‌లైట్ల కాంతిలో, మల్లెపువ్వుల మందిరంలో అడుగు పెడుతూనే విజయ సూచకంగా దీర్ఘంగా గాలి పీల్చుకున్నాడు విరంజన్.

విరంజన్ ప్రక్కగా పచ్చని పట్టు శాలువా ఎత్తి పట్టేరు. వధువు వచ్చి కూర్చుంది. ఆమె వంక చూచి పిఐయో త్సాహంతో సంతృప్తిగా చిఱునవ్వు నవ్వాలని విరంజన్ తపనపడి పోయాడు నాలుగు నిమిషాలు.

పట్టు శాలువా తొలగించేరు. విరంజన్ చూపులు చెంగున ప్రక్కకు దుమికాయి. అతని వీపు ఛెళ్ళుమనిపించి నట్లయింది.

విజయ భారతి ప్రక్కనే మదిర నిశ్చలంగా పోత విగ్రహంలా నిల్చునివుంది.

విరంజన్‌కు అర నిముషంలో వళ్ళంతా స్వేదం పట్టింది. ఫేన్ గిఱ్ఱున తిరిగింది. దానిమీద ప్రతిఫలించిన కాంతి విరంజన్ ముఖంమీద ఇంద్రధనుస్సై వెలిగింది. గొంతు తడి ఆరింది. ఆ స్త్రీ వైపు భయంగా చూచాడు.

మదిర అచంచలంగా విజయ ప్రక్కన నిల్చునేవుంది. సూత్రధారణ సమయమైంది. పురోహితుడు సూత్రం పుచ్చుకున్న హస్తంతో అందరికీ అక్షింతలు పంచి వచ్చి బిగ్గరగా మంత్రోచ్చారణ చేస్తూ మాంగల్యాన్ని విరంజన్‌చేతి కందించాడు.

విరంజన్ పేలవంగా లేచి నిల్చున్నాడు.

మదిర విజయ వెనుకనే నిల్చుని కుడి హస్తంతో మల్లెలు తురిమివున్న విజయ జడను పైకెత్తింది విరంజన్ వంక చూస్తూ.

విరంజన్ ఏదో అజ్ఞాత ఆఘాతం తగిలినట్లు నిలిచి పోయాడు.

పురోహితుడు వేగిర పెట్టేడు. విరంజన్ చేతులు ఎందుకో చలించేయి. రెండుముళ్ళు వేసి సరిపెట్టబోయాడు.

"మూడు ముళ్ళు వేయాలి" అని హెచ్చరించేడు పురోహితుడు.

ఉపేతు ఎక్కడయినా ఉన్నాడేమోనని ఎంతగానో ఆశగా చూసింది విజయ. ఆమె కంటికి అనాహూతుడుగా వచ్చిన విమలానంద్ మాత్రమే అపుపించాడు. కండ్లల్లో నీరు గిరుగ్రిన తిరిగింది. తలవంచుకుంది. అప్పుడే మదిర విజయ జడ చేతిలో ఎత్తి పట్టుకోవడమూ, విరంజన్ వణకు తూనే మాంగల్యం ముడివేయడమూ జరిగి పోయింది. విజయ చూపులు భూమిలోనికి దించుకుని పోయాయి.

విజయ భారతికి విశ్వనాథంగారి స్నేహితులు ఇచ్చిన బహుమానాలు గుట్టలు పడ్డాయి. విశ్వనాథంగారే స్వయంగా లెక్కలేనన్ని రవ్వల నగలు, పట్టు చీరెలు దొంతర్లుగా పేర్చేరు.

ఆ నగలక్రింద ఎంత ఖర్చయిందోనని విశ్వాసరావుగారు విలవిలలాడి పోయారు.

"ఇన్ని నగలెందుకు విశ్వం వడ్డీ దండుగగాని" అన్నారు విశ్వాసరావుగారు.

"ఇంకా నయం విశ్వాస్ మనిషి బ్రదకడమే అనవసర

ఖర్చు అనేట్లున్నావే!" అని నవ్వేశారు విశ్వనాథంగారు.

"మదిర ఏమయింది హేమకుంతలా? అంది తనని అంటి పెట్టుకొని వున్న హేమకుంతలతో విజయ.

"ఏమోనక్కా ఇంతకు ముందు ఇక్కడేవుంది" అంది హేమ.

లగ్నం పూర్తయి వధువు, వరుడు విశ్వనాథంగారి ఇంటిలోనికి వస్తూంటే విరంజన్ తొట్రుబాటు పడ్డాడు. ఏదైనా అజ్ఞాత శక్తి అకస్మికంగా అడ్డుపడుతుందన్నట్లుగా ఆందోళన పడుతున్న విరంజన్‌ని చూసి హేమ ఆశ్చర్య పడింది. ఇంకో రెండు ఘడియలు గడిచాయి. మదిర జాడే అవుపించలేదు.

విశ్వనాథంగారు ఆందోళనగా తిరిగారు. మదిర కోసరం హేమకుంతలను గిరికలు పెట్టించారు. ఆమె ఎక్కడ వుందో, ఎక్కడికి వెళ్ళిందో ఎవరికీ అర్థం కాలేదు.

అయ్యో! అమ్మాయి విజయ వెంట వెళ్ళేందుకు సమయానికి లేకపోయిందే అని నొచ్చుకుంది రామలక్ష్మమ్మ. విశ్వనాథంగారు ఆందోళన పడ్డారు. మధురమ్మగారు చిక్క మొగం వేసి ముక్కు చీది వేసింది. విశ్వనాథంగారు కోపపడి "అదేం చదువూ, సంధ్యా రానిదా. అత్యవసరంగా ఎక్కడికి వెళ్ళిందోలే" అని సర్దేరు.

"దానికి మీ రనవసరంగా స్వాతంత్ర్యం ఇస్తున్నారు" అంది మధురమ్మగారు విశ్వనాథంగారి మీద నిష్ఠూరంగా.

"ఈ మాత్రానికే ఏం మునిగిపోలేదు" అని గుంభనగానే సర్ది వేసేరు విశ్వనాథంగారు.

కలువ కన్నీరు పెట్టుకుంది.

విశ్వనాథంగారు ఓదార్చేరు. హేమకుంతల విజయ వెంట తోడు వెళ్ళింది.

విశ్వనాథంగారు సగర్వంగా నిశ్వసించేరు. స్నేహితులకు, బంధువులకు, ప్రభుత్వాధికారులకు, ప్రతి ఒక్క వ్యక్తికీ బంగీలుగా కట్టి బహుమతిప్రదానంచేసి తమ బాధ్యతను వదల్చుకున్నారు.

విజయ విశ్వాసరావుగారింటికి రావటం ఆగ్రామంలో కలకలం కుప్పలు కుప్పలుగా త్రవ్వి పోసింది.

ముందుగా వధూవరులను చూడవచ్చిన వాడు వినాయకరావు. వివాహానికి ఎంత బ్రతిమాలినా రాని వినాయకరావు తనంతట తానుగా వధువును చూడటానికి రావటం విశ్వాసరావుగారికి ఆనందమయింది.

వినాయకరావు విజయను చూశాడు. చిఱునవ్వు నవ్వాడు. ఎంతో కాలానికి హృదయ పూర్వకంగా మందహాసం చేసేడు.

"నువ్వు సరయిన చోటే పుట్టి సరయిన చోటే మెట్టేవమ్మా. నీ జీవితం సార్థకం అవుతుంది. నువ్వు నువ్వుగానే బ్రతుకుతావు" అన్నాడు వినాయకరావు.

విజయ అప్రయత్నంగానే అతనికి పాదాభివందనం

చేసింది. అదో సుకృతం కాబోలు !

విశ్వాసరావుగారు ఆశీర్వచనం విని పొంగి పొయ్యారు.

"నిజంగా నీకు సంతృప్తి కలిగిందా వినాయకరావ్!" అని ప్రశ్నించాడు విశ్వాసరావుగారు.

"మీ రెండు కుటుంబాలకు సరయిన పరువు, ప్రతిష్ఠలు తెస్తుంది. విరంజన్‌కు తగిన భార్య అనిపించుకుంటుంది" అని పెద్దగా అంగలు వేసుకుంటూ వెళ్ళి పోయాడు.

# 16

విమలానంద్ ఎంతో ఆదుర్దాగా వచ్చేడు.

"హేమా ఉపేఉ వెళ్ళేప్పుడు నీతోటి ఏమైనా చెప్పేడా?" అని ప్రశ్నించేడు. "నాతోనా ?" అంది ఆశ్చర్యంగా "నాతోనే కాదు చెప్పవలసిన వాళ్ళతో ఎవ్వరితోనూ చెప్పనేలేదు. అంత సౌమ్యతలో ఇంత కాఠిన్యం, కృతఘ్నత దాచిపెట్టుకున్నాడని ఎవ రూహించగలరు" అంది నిందారోపణగా.

విమలానంద్ తల అడ్డంగా తిప్పేడు. "కాదు హేమా! అతడు ఎవరికో విద్రోహం తలపెట్టాడని, కృతఘ్నత వ్యక్త

పరిచాడని మాత్రమే మనం అనుకుంటున్నాం. కానీ ఆత్మ ద్రోహం కూడ చేసుకున్నాడు. తనకు నిశ్చయమైన వివాహాన్ని నిరాకరించి అంతర్ధానమయ్యాడు. నేనిప్పుడు వాళ్ళ వూరినుండే వస్తున్నాను."

హేమకుంతల నివ్వెర పోయింది. "నిశ్చయమైన వివాహాన్ని కాలదన్ని నాతో లేచి వస్తావా ? మనిషి చచ్చినా బ్రతికినా కాపాడుకోవలసిన విలువలు కొన్ని వున్నాయి. మూర్ఖురాలా ?" అని విజయను నిందించిన ఉపేక్ష తనకు నిశ్చయమైన వివాహాన్ని కాలదన్నాడా ? ఆమెకు అంతా అయోమయంగా తోచింది.

ఈ మనుష్యు లేమిటో, వాళ్ళ ఆదర్శా లేవిటో, వీళ్ళ నిజాయితీకి, చిత్తశుద్ధికి, ఆత్మౌన్నత్యానికి నిదర్శనలు ఎలాంటివో ఆ హేమకుంతలకు తెలిసి రాలేదు.

"అయితే ఉపేక్ష ఇప్పు డెక్కడ వున్నట్లు ? మనలో ఎవ్వరికీ తెలియకుండా అతని వివాహం ఎలా నిశ్చయమైంది?!" హేమలో ఆశ్చర్యం.

విమలానంద్ చెప్పసాగాడు. "ఉపేక్షకు సంబంధం విశ్వనాథంగారే కుదిర్చారు. వివాహం నిశ్చయం చేసారు. అదే విజయ వివాహానికన్నా ముందరగానే......ఉపేక్షకు కూడా ఇక్కడినుండి ఇంటికి వెళ్ళిన తర్వాతనే తన పెళ్ళి నిశ్చయమైందని తెలిసింది——'తనకా వివాహం ఇష్టంలేదు' అని ఒక్కమాటే చెప్పాడు. ఆ మరునాడే అంతర్ధానం..."

హేమకుంతల ఆశ్చర్యంగా వింటున్నది. ఈ విడీవిడని చిక్కులన్నింటికీ మూలం ఏమిటో. ఎక్కడో అర్థంకావటం లేదు. "అయితే ఇప్పుడేం చేయాలి ?"

"ఉపేక్ష జబ్బు పడినప్పుడు ఏ డాక్టరు వద్ద మందు పుచ్చుకున్నాడో నీకేమయినా తెలుసా ?"

హేమ తల త్రిప్పింది తనకు తెలియదన్నట్లుగా. అంత లోనే తెలివి వచ్చినట్లై "ఆయన గదిలో ఏమైనా వుండి వుండవచ్చు చూద్దాం రండి" అంటూ పైకి దారితీసింది.

రూముకు గొళ్ళెం పెట్టివుంది. ఇద్దరూ కలసి రూమంతా కలయ వెదికారు. ఎక్కడా మందుచీటీ కూడ లేదు. డాక్టరు ప్రిస్క్రిప్షను దొరకలేదు.

ఆల్మైరాలో పెద్ద కవరు! అది చూడగానే విమలా నంద్ ఉలిక్కి పడ్డాడు. చటుక్కున బయటికి తీసి అది తెరి చాడు. లోన యక్సరే ఫోటోలు. అతని కండ్లు విప్పు కున్నాయి. ఎక్సరే బయటికి తీసి పరిశీలనగా చూశాడు.

దానిమీద యు. పి. అని ఉపేక్షపేర అక్షరాలు. విమలానంద్ ఆ ఎక్సరే ఫోటోలు రెండూ దొరక బుచ్చుకుని బయటకు పరుగెత్తేడు. హేమకుంతలలో భయసందేహాలు.

విమలానంద్ ఆ తరువాత రెండు గంటలకు తిరిగి వచ్చాడు. అతని ముఖం నల్లగా కుమిలిపోయి వుంది. హృద యంలో బాధ.

"ఏమిటి ఆనంద్ బావా ?" అంది హేమ.

విమలానంద్ మౌనంగా వున్నాడు ఒకటి రెండు క్షణాలు. "ఇవి ఉపేక్షలంగ్స్ ఎక్సరే ఫోటోలు. ఒక లంగ్ పూర్తిగా చెడిపోయి వుంది."

హేమకుంతల మెదడు పేలిపోయింది. "అంటే ?!" అంది నీరసంగా.

"ఇంకా అర్థం కాలేదా ? తన వ్యాధి ఏమిటో తనకు తెలుసు. దానికి పరిష్కారం లేదని కూడ తెలుసు. అందు వల్లనే విజయను రెచ్చగొట్టి క్రోధం పెంచడానికి జంకలేదు. తన వివాహాన్ని కాలదన్నడానికి సంకోచించలేదు. విజయ తనకు దూరమై సుఖపడడమే అతని ఉద్దేశ్యమై వుండవచ్చు" అన్నాడు విమలానంద్ పశ్చాత్తాపంగా.

అతనిలో విచారం, జాలి, సానుభూతి అంకురించేయి. ఉపేక్ష ప్రదర్శించిన బలహీనతకు, పిరికితనానికి, నిర్లిప్తతకు, నిరుత్సాహానికి అర్థం అతనికి ఇప్పుడు తెలిసింది.

హేమకు సమస్య విడిపోయింది. విజయ సౌఖ్యంకోసమే విజయను ఉపేక్ష అవమానపరచి రెచ్చగొట్టాడు.

కానీ ఒక్కటే విచారం. తనకు జబ్బువస్తే ఆదుకొని రక్షించగల ఆప్తమిత్రులు లేరా? అందుకు జీవితాన్ని నిరసించి అంతర్ధానం కావాలా? విజయ కీ విషయం తెలిస్తే తల ఎంతగా నేలకు వేసి బాదుకుంటుంది?

విజయకు ఈ విషయం తెలియ నివ్వరాదని నిశ్చయించుకుంది. కానీ అదెలా సాధ్యం?

"హాసిరి ఉపేక్ష పెళ్ళి నిశ్చయం కావడమూ, వాడొద్దని తిరగ గొట్టడమూ కూడ అయిపోయిందా!" అని రామలక్ష్మమ్మగారు నొచ్చుకుంటూ వుండగా విజయ కండ్లు విప్పుకుంది.

ఆమెకు ఏదో సందేహం.

హేమకుంతలను గద్దించి అడిగింది "అసలు విషయం ఏవిఁటి? నీకు తెలియదా? ఇన్ని రోజులనుండి బావ ఇక్కడే వుంటున్నాడు గదా!" అని.

బావ ఇక్కడ వుండటము లేదు. కానీ అంత భారమైన రహస్యాన్ని హేమకుంతల దాచుకోలేక పోయింది. అపైన ఉపేక్ష నీచమైన వాడనీ, కృతఘ్నుడనీ విజయకు ఏర్పడిన అభిప్రాయాన్ని కొనసాగ నివ్వడం హేమకుంతలకు ఇష్టంకాదు.

చెప్పి వేసింది. పూర్తిగా చెప్పివేసింది. విజయ కదో పెద్ద అఘాతం, ఉపేక్ష తన నామాత్రం విశ్వసించజాలనందుకూ, సుఖాన్ని పంచి ఇవ్వడానికి సిద్ధపడి కష్టాన్ని భాగం పెట్టడానికి సంకోచించినందుకూ ఈటెతో పొడిచినట్లుగా బాధ.

మనిషి జీవితానికి సౌఖ్యం ప్రసాదించాలనుకుంటాడు. జీవితం మనిషిని శృంఖలాబద్ధంచేసి బందీని చేస్తుంది.

# 17

విశ్వనాథం గారింటిలో వివాహపు రద్దీ తగ్గింది. అయితే మదిర ఎక్కడికి వెళ్ళిందో, ఎప్పుడు వస్తుందో మాత్రం ఎవ్వరికీ తెలియ రాలేదు.

మధురమ్మ శోకముద్ర చూచి విశ్వనాథంగారి హృదయం దేవినట్లయింది. ఆమెను ఓదార్చలేక అసహాయంగా చూడసాగారు.

"మీరు దాని ఆలనా పాలనా పట్టించుకోవడం లేదు. తప్పిపోవడానికి పసిపిల్లకాదు సరే ఎక్కడపడితే అక్కడ తిరగడానికేం అది పసిపిల్ల అవుతుందా. స్త్రీకి వయస్సెల్లాంటిదో మీకు తెలియదా ?" అంది నోటిలో గుడ్డ కుక్కుని.

విసురుగా బయటికి వెళ్ళబోయిన విశ్వనాథంగారా మాట విని ఠక్కున ఆగిపోయారు. ఆయన ఆత్మను శూలంతో పొడిచినట్లయింది. ఎదురుగా దీనంగా మధురమ్మ.

"మదిరను గురించి అంత ఆవేదన పడతావేం మధురా?" విశ్వనాథంగారామె వైపు రెండడుగులు వేశారు.

మధురమ్మ నయనాలలో ఎక్కడిదో పురాతనమైన కాంతిరేఖ ఒకటి తళుక్కుమంది.

"దాన్ని నా కూతురే అనుకోనక పోతే దానికింత స్వాతంత్ర్యం ఇచ్చివుండే వాడినే కాదు" అన్నారు ఓదార్పుగా ఇంకో అడుగు ముందుకు వెళ్ళి.

ద్వారం వద్ద చప్పుడైంది. విశ్వనాధంగారు, మధురమ్మ ఇద్దరూ తుళ్ళిపడి వెనక్కు తిరిగారు.

మదిర ప్రత్యక్షమైంది.

"ఎక్కడికి వెళ్ళేవు మదిరా? నీ కోసం అమ్మ తల్లడిల్లి పోతున్నది. ఆమెను ఓదార్చడం, ఉపశమింప జేయడం పెద్ద సమస్య అయిపోయింది.

"మనం ఏమైపోతే దానికేం అన్నయ్యా! దాని చదువేమిటో, అదేమిటో, తిరగడా లేవిటో" అంది మధురమ్మ.

మదిర మధురమ్మ మాటల్ని లెక్కచెయ్యలేదు.

"పెళ్ళయేంత వరకూ ఇక్కడే వున్నాను బాబాయి! ఆ క్షణంలోనే మాక్లాస్ మేట్ కు సీరియస్ గా వుందని వైర్ వచ్చింది. పెండ్లి సమయంలో ఆ వార్త వినిపించడం ఎందుకులే అని వెళ్ళిపోయేను. అయినా ఇంతలోనే ఇంత రాద్ధాంతం చేయాలా అమ్మా?" అని కసురుకుంది.

"ఇదంతా నేనే చేసేనా? నీ వలా చెప్పకుండా వెళ్ళి పోయినందుకు నేనెంత ఇదయిపోయానో!" మధురమ్మ కండ్ల నీరు నింపుకుంది.

విశ్వనాధంగారు మదిరను కోపపడుతూనే మధురమ్మకు

సర్దిచెప్పి అప్పటి కా విషయాన్ని సర్దేశారు.

"అలాగా మదిరా! నీవు ఎక్కడికి వెళ్ళిపోనని మా గుండెలు గుండెల్లో లేవనుకో!" అంది మదిరను చూచి ఆశ్చర్యపడిన రామలక్ష్మమ్మ.

మదిరను చూడగానే విజయభారతి కంట తడిపెట్టింది.

"నన్నిలా ఒంటరిదాన్ని చేస్తావా అక్కా?" అంది నిందారోపణగా.

మదిర భృకుటి ముడి వేస్తూనే చిఱునవ్వు నవ్వింది. "నిన్ను ఒంటరిదాన్ని చేస్తానా విజయా? ........"

"మరి ఇప్పుడు వదలి వెళ్ళేవుగా?"

మదిర ఒక్కక్షణం ఎక్కడికో శూన్యంలోకి చూసింది. ఆమెలో విరుద్ధభావాలు. మండుతున్న కండ్లు. సంతోషంగా కనపడడానికి ప్రయత్నిస్తున్న ముఖం.

"వెళ్ళేను విజీ వెళ్ళేను. కానీ నీకు నాతో ఎప్పుడూ ఈ సాన్నిహిత్యమూ, సాహచర్యమే వుంటాయంటావా?"

"ఏం? ఎందుకుండవు అక్కా? నీవు నా అక్కవు. నీ కా హక్కుంది. విరంజన్‌గార్ని పరిచయం చేస్తా రా" అని మదిరను తీసుకుని వెళ్ళింది.

మదిర నిరాకరించింది. "వద్దులే విజీ! వద్దు మరొక సారి పరిచయం చేయవచ్చు" అని తప్పుకోసాగింది.

విజయ నిలిచిపోయింది. "మదిరా! ఇది నామీద నిరాదరణా! ఇష్టమో, అయిష్టమో దైవం నా నొసటను ఈ

వివాహం వ్రాసిపెట్టింది. దాన్ని నేను శిరసావహించదలుచుకున్నాను. అందుకేనా నాపైన ఈ ఉపేక్షా భావం ?"

మదిర అసహాయంగానే లేచి వచ్చింది. విజయ ఆమెను విరంజన్‌కు పరిచయం చేసింది.

"ఈమె నా స్నేహితురాలు, సోదరి మదిర."

మరోవైపుకు తిరిగి వున్న విరంజన్ బరువుగా వెనక్కు తిరిగాడు. అతని కండ్లలో భయం వల్లనో, సిగ్గు వల్లనో వింతైన జీర !

మదిరే ముందుగా "నమస్తే" అంది.

"నమస్తే, నమస్తే" అన్నాడు గొంతు తడి ఆరినట్లుగా.

"మీరూ చదువుతున్నారా అన్నా ?"

"తప్పు తప్పు మదిరా అన్నా అంటావేం !" విజయ సరిదిద్దింది.

"పోనిస్తూ అలా అనిపించింది నాకు అంతే" మదిర నిస్సంకోచంగా నవ్వేసింది.

విరంజన్ హృదయం అజ్ఞాతంగా కంపించినట్లయింది. అతని ముఖం మీద గ్రాఫ్ కాగితం మీది గీతల్లా లజ్జారేఖలు, శిరఃకంపనం.

తనను కోకిలపిల్లను ఆడించినట్లు ఆడించి గర్వించే విరంజన్ మదిర ముందు లజ్జపడడం, భయం ప్రదర్శించడం సిగ్గుపోవడం చూసి విజయకు కూడా నవ్వు వచ్చింది. కానీ

తన్ను తాను అదుపులో పెట్టుకుంది.

"అలా 'అన్నా' అని పిలిస్తే వదినవు కావలసినదానవు చెల్లెమ్మ వవుతావు."

"ఏం కాకూడదా ? నేను బావా అని పిలిస్తే ఆయన మరింతగా బెదిరిపోయేట్లున్నారు" అంది మదిర !

విరంజన్ తల తిప్పివేసుకో సాగినప్పుడల్లా "అన్నా" అని మదిర అతన్ని పలుకరించేది.

ఆ కుటుంబంలో అలా అవి గిజిగాడి గూడు లాంటి అనుబంధాలు. వావివరుసలు. రామలక్ష్మమ్మ గారిని మధురమ్మ అక్కా అంటుంది. ఆమే మళ్లీ విశ్వనాథంగారిని "అన్నయ్యా" అంటుంది. మదిర విశ్వనాథంగారిని "బాబాయి" అంటుంది. విజయ మదిరను "అక్కా" అంటుంది. మదిర విజయను 'విజయా' అని మాత్రమే పిలుస్తుంది. ఆమె విరంజన్‌ను 'అన్నా' అని అంటుంది. విరంజన్ మదిరను "మదిరా!" అనే పిలుస్తాడు.

విజయ ఒకప్పుడు విశ్వనాథంగారి కూతురు. లక్షాధికారిణి. ఇప్పుడు విరంజన్ సహభాగిని. కాదు భార్య. ఈ విషయాన్ని అతనే అనేకసార్లు చెప్పేడు. గుర్తు చేసేడు.

విజయ ఒకప్పుడు ఎక్కడికయినా వెళ్ళవచ్చు. ఇప్పుడు విరంజన్ అందుకు ఓ అనుమతి పత్రం మంజూరు చేయాలి. అది ఆరిస్టోక్రసీలోని హుందా. సంపదలోని తలపొగరు.

ఒకప్పుడు విజయ స్నేహితులు ఆయింటి కెవరయినా

వచ్చి కాసేపు కబుర్లు చెప్పుకొని పోవచ్చు. ఇప్పు డందుకు విరంజన్ ఇంటివద్ద ఉన్నాడో, లేదో తెలుసుకోవాలి! అతను లేకుండా విజయను కలుసుకోవడం మర్యాద కాదు. అతను దగ్గరవుంటే వెళ్ళడానికి వీల్లేదు. తను దగ్గరవుండగానే ఎవ రయినా వస్తే అనుమానం, ఆగ్రహం. తను లేనప్పుడు ఎవ రయినా వచ్చి వెళ్ళేరని తెలిస్తే సందేహం. అదే విజయకు పెళ్ళివలన వచ్చిన రక్షణ. అవే విరంజన్‌కు వివాహం వల్ల లభించిన హక్కులు, ఆత్మగర్వం.

ఇప్పుడు హేమకుంతల విజయకు సన్నిహితురాలు! మదిర నమ్మిన అక్కయ్య. విరంజన్ దొరికిన భర్త!!!

విరంజన్ మళ్ళీ చదువుకు వెళ్ళేడు. వైజాగులో అతని కింకా రెండు సంవత్సరాల చదువుంది.

"వెడ్తాను విజయా! ఇక్కడ నేనేమీ ఆనందం పొంద లేదు" అన్నాడు విరంజన్ వెడుతూ. విజయ నివ్వెరపోయింది. నోట మాట రాలేదు.

"నీవేం విచారించకు విజయా. యూనివర్శిటీలో ఈయన పని నే చూస్తానుగా" అన్నది మదిర అభయహస్త మిస్తూ. ఆమె కళ్ళల్లో మెరిసిన మెరుపు, స్వరూప స్వభా వాలు అగమ్యగోచరాలు.

ఆ ఇంట్లో మిగిలింది విజయ ఒక్కతే. హేమకుంతల ఎప్పుడైనా ఆమెకు తోడు. విరంజన్, మదిర ఎప్పుడయినా వచ్చి వెడతారు.

# 18

విజయభారతిని చూచినప్పుడల్లా విరంజన్‌కు నవ్వు వచ్చేది. విశ్వనాథంగారు కనిపించినప్పుడల్లా హుందాతనం ప్రదర్శించేవాడు.

అందులో ఒకరు కామధేనువు. మరొకరు కల్పతరువు. కుడి ఎడమల అతనికి అదృష్టం గుట్టలుపడింది. వ్యక్తి స్థాయికి మించిన గౌరవం. అర్హతకు పైబడిన మన్నన పొందితే మనిషికి పొగరు పట్టి అహంభావం ఏర్పడుతుంది.

విరంజన్ నవ్వినప్పుడల్లా "ఏం నవ్వుతున్నారు ?" అనేది విజయ నిష్కల్మషంగానే.

"చెప్పుకో !"

"ఎందుకో నేనెలా చెప్పగలను ?"

"విజయా నామీద ఇంతవరకూ నీకు సద్భావం లేదు గదూ ?" ఆమాటలో ఓ గర్వం.

"మీ అంతట మీరే ఊహించుకుని నిందారోపణ చేయడం ధర్మం కాదు."

"అని సంతృప్తి పడి నమ్మమంటున్నావు ?"

"కాదు హృదయ స్ఫూర్తిగా విశ్వసించే చెబుతున్నాను."

"విజయా నీకు కూడా భర్త అదృష్టవంతుడవాలవే వుంటుంది గదూ ?"

విజయ కదొక ప్రశ్న - కాదు పరీక్ష కాబోలు !

"స్త్రీ చిత్తశుద్ధినే శంకించుతున్నారు మీరు."

"నేను నవ్వుతూ మాట్లాడుతున్నాను. నీవు దాన్ని పరిహాసం చేస్తున్నావు."

విజయ మనస్ఫూర్తిగానే నవ్వింది. "నే నెందుకు చేస్తానండి ? తన భర్త అదృష్టవంతుడు కావాలని ఏ స్త్రీకి వుండదు ?"

"అయితే అదృష్టాన్ని ఎలా అంచనా వేస్తారు ?"

విజయలో మౌనం.

"అదిగో జవాబు చెప్పడం లేదు."

"ఏం చెప్పను ? నే నేదయినా తెలియక చెబితే మీకు కోపం రావచ్చు."

విరంజన్ ఆత్మగర్వంగా నవ్వు. "రాదులే విజయా చెప్పు."

"అదృష్టం అనుభవించ గలిగింది; అంచనా వేయగలిగింది కాదు."

"విరంజన్‌లో గలగలానవ్వు" పొరపాటు కాదనుకున్నది వాస్తవం కావడం అదృష్టం. జీవితంలో ఊహించని అంశం

ప్రత్యక్షం కావడం అదృష్టం. అంతే."

"ఊహించలేనిది వాస్తవం కావడం అదృష్టమే కానవసరం లేదు. దురదృష్టమూ కావచ్చు; ప్రారబ్ధమూ కావచ్చు."

"కాదు నా జీవితంలో నేను ఊహించినవన్నీ అయాచితంగా అంది వచ్చేయి. నిన్ను పెండ్లి చేసుకుంటే బావుండుననుకున్నాను. చివరికి జరిగిందా ?"

విజయలో పల్చని నవ్వు. "కానీ అది మీరు ఊహించలేనిది కాదు గదా ?"

"అవును. కానీ అయాచితమే గదా ?" విరంజన్‌లో సంతృప్తిగా నవ్వు.

ఇంతలో ఎదురుగా మదిర. ఆ కండ్లలో తీవ్రవీక్షణాలు. ముందు విరంజన్ వంక. ఆ తరువాత విజయవైపు. ఆ వెనకనే మత్తైన చిఱునవ్వు.

"ఏదో నవ్వుకుంటున్నారు ?"

"ఊహించనిది వాస్తవం కావడం. వాంఛితం అయాచితంగా ఈడేరడం అదృష్టమని విరంజన్ అంటున్నారు. అది నిజమా అక్కా ?"

మదిరలో అదే చిఱునవ్వు. "ఊహించనిది ఎప్పుడూ స్వాప్నికమే అవుతుంది గాని వాస్తవం కాదు. అయాచితం దానం కావచ్చు. ధర్మం కావచ్చు. అదృష్టం మాత్రం కాదు. కావడానికి వీల్లేదు. అవునా విరంజన్ ?"

విరంజన్ ముఖం ముడుచుకుని పోయింది. విజయ

కామాటలు బోధపడలేదు. కానీ విరంజన్ ముఖం చిన్నపుచ్చు కోవడం చూసి విజయ ఆ సంభాషణ అంతటితో ఆపివేసింది.

మదిర ఫక్కున నవ్వింది విరంజన్ వంకచూసి.

"అన్నయ్య కన్న ఆడవాళ్ళు నయం. తనమాట నెగ్గక పోయినంత మాత్రాన చిన్నబుచ్చుకోవాలి కాబోలు!"

విరంజన్‌లో తెచ్చిపెట్టుకున్న నవ్వు.

"అరే! అన్నయ్యా ఇంకా ఆ ధోవతే చుట్టుకుని కూర్చున్నావా? లే, లేవాలి. సూటు వేసుకుని రా. షికారు పోదాం. నీకేమీ తెలియదేం విజయా! అన్న అలా వుంటే వూరుకుంటావేం. చక్కని బట్టలు వేయించి, బూటువేసి తలదువ్వి కోటువేయకూడదూ?"

విజయలో తన అజ్ఞానానికి సిగ్గు. విరంజన్ ముఖంలో చిఱునవ్వు.

విజయకు తను సాధారణంగానూ, సహజంగానూ వుండడం మాత్రమే తెలుసు. అందానికీ సౌందర్యానికి నిర్వచనం ఏమిటో ఆధారాలు ఏమిటో మదిరే చెప్పగలదు.

ఇంతలో బెలాబెలా హేమకుంతల. కిలాకిలా నవ్వు.

"బావగారూ! మీరు కండ్లు మూసుకోవాలి." ఆమె గుప్పెట్లో ఏదో వస్తువు.

విరంజన్ అయిష్టంగా దిగమ్రింగుకునే వాటిలో హేమకుంతల స్వాతంత్ర్యం ఒకటి.

"ఎందుకో!"

"కండ్లు మూసుకోమన్నాగా అంతే"

"ఊ సరే అయితే!"

"నోరు కూడా తెరవాలి"

" హు. నన్నేదో వెర్రివెంగళాయి క్రింద జమ కట్టేస్తున్నావే. ఇంతకూ నీ చేతిలోని దేవిఁటి?"

హేమకుంతల పకాపక నవ్వి "అయ్యో బావ. ఆడది ఎప్పుడు పరిహాసం చేస్తుందో ఎప్పుడు హేళన చేస్తుందో కూడా తెలియక పోయె. ఊ. ముందు కండ్లు మూసికొని నోరు తెరవాలి – ఇదిగో విజీ – అదే వద్దన్నాను. నేను బావతో మాట్లాడుతున్నపుడు ఇటు తిరిగి చూడవద్దని చూసినా నవ్వ వద్దనీ చెప్పేనా?" ముందు నువ్వటు తిరుగు" అంది బెదిరింపుగా.

నిరంజన్ నోరు తెరిచాడు. హేమకుంతల గుప్పెడు పంచదార అతని నోట్లో పోసి ఒక రబ్బరు బొమ్మను విజయ భారతి ఒడిలో పెట్టికి కిచకిచా నవ్వింది.

నిరంజన్ గొంతు పొర తప్పి దగ్గుతూ కండ్లెర్ర పడగా ఆశ్చర్యంగా కండ్లు తెరిచాడు. విజయ సిగ్గుపడిపోయి లేవ బోయింది.

"ఆగమ్మా అక్కా ఆగు. కోరుకోవేం బావా కోరుకో! అబ్బాయా? అమ్మాయా?" విజయ ఇంకొక్క క్షణం కూడా ఆగకుండా పారిపోయింది.

మదిర ఇంతసేపటినుండి ఆశ్చర్యంగా చూస్తూ వున్నది.

హేమకుంతలంటే ఆమెకు ఏవగింపు; కానీ భయం.

"ఏమిటి హేమా ఇది ?" విరంజన్ నెమ్మదిగా పంచదార నమిలి మ్రింగుకున్నాడు. హేమకుంతల గుక్కపట్టి నవ్వింది. "ఇదేం బావ! ఉదయం పంచదార చలిమిడి వద్దంటూనే తిన్నావా? ఇది ఎందుకు ఎక్కడినుండి వచ్చిందని అడిగేవా? ఉదయం నీకు పట్టుబట్టలు కట్టబెట్టేరే. ఎందుకో తెలియ లేదా?" హేమ నవ్వాపుకుంది.

మదిర గ్రహించింది. తన తెలివిలేమికి తనే సిగ్గుపడి పోయింది.

"విరంజన్ అన్నా! నీవు తండ్రివి కాబోతున్నావు."

విరంజన్ ఎగిరి గంతువేసేడు. "నిజమా హేమా?"

"కాదు. అబద్ధం. సీమంతం పెళ్ళికొడుకు కాబోతూ ఏం ప్రశ్న వేస్తున్నాడంటేను" అంది హేమ కొంటెగా.

విరంజన్ సగర్వంగా గుండెలు విరుచుకున్నాడు. విశ్వనాధంగారి ఆస్తికి వారసుడు పుడతాడు!

"నీవు అదృష్టవంతుడివి" అంది మదిర మందస్వరంతో. అందులోనే నిట్టూర్పు. "అయితే — ఈ అదృష్టం నీది కూడాను." ఇది విరంజన్ ఓదార్పు!!

విరంజన్ తండ్రి కాబోతున్నాడని విని విశ్వాసరావు గారి ముఖం పద్మంలా వికసించింది. విశ్వనాధంగారి ఆస్తికి వారసుడు పుడతాడు కాబోలు!

ఆయన వెంటనే వినాయకరావు దగ్గరకు పరుగెత్తేరు.

వినాయకరావు ఆ సమయానికి తనలో తనే ఆత్మగతంగా నవ్వుకుంటూ చదరంగం ఆడుకుంటున్నాడు. విశ్వాసరావుగారి రాక చూచి "చాపమీద కూర్చోండి" అన్నాడు చేతితో చూపెడుతూ.

"విరంజన్ తండ్రి కాబోతున్నాడు" అన్నారు విశ్వాసరావుగారు నడచి వచ్చిన ఆయాసం అన్నా తీర్చుకోకుండానే.

వినాయకరావు అభినందించేడు శకటు పావును మూలగడిలోకి నెట్టుతూ.

"ఊఁ అయితే విజయ భారతి తల్లి కాబోతున్న దన్న మాట. పుట్టబోయేవాడు మీ ఉభయ వంశ తారకుడు అవుతాడు. విశ్వాసరావు గారికి విశ్వనాథం గారికి మనుమడనిపించుకుంటాడు" అన్నాడు వినాయకరావు.

ఆ మాటలు విశ్వాసరావుగారి చెవుల్లోంచి రివ్వున దూరిపోయి ఆయన హృదయంలో హర్షామోదాలను ధారగా పోశాయి. అది వినాయకరావు నోటివెంట వచ్చిన మంచిమాట! శుభాకాంక్ష!!

"ఏమైనా ఎత్తులు వేస్తారా విశ్వాసరావుగారూ?" అన్నాడు వినాయకరావు చదరంగం బల్లవైపు చూస్తూ.

విశ్వాసరావుగారు తీరికగా కూర్చున్నారు. చదరంగం నల్లపావులను తనవిగా ఎంచుకుంటూ.

"నేను నిష్పక్షపాతంగానే ఆడుతున్నాను. కానీ ఆ

నల్ల బలగం ఓడిపోతున్నది" అన్నాడు వినాయకరావు.

విశ్వాసరావు ధీమాగా పావులు నెట్టసాగాడు.

"అయినా ఆ రాజు కట్టుపడక తప్పదు. మీరెన్ని ఎత్తులు వేసినా ఆ బలగం స్థానాన్ని రక్షించలేరు" అన్నాడు వినాయకరావు తనంతట తానే.

"చూస్తాగా" అని ఆటలో దిగారు విశ్వాసరావుగారు.

# 19

శ్యామసుందరి వయసు ముప్పది సంవత్సరాలు. ఆమె సౌందర్యం విరిసిన పున్నాగపూవు లాంటిది. సౌకుమార్య లాలిత్యాలు ఆమెకు సహజ ఆభరణాలు. పచ్చి పసుపు కొమ్ములాంటి శరీరచ్ఛాయ. సన్నని ముక్కు. ఆమె లేత నీలిరంగు చీర ధరించి అదే వర్ణపు చోళీ వేసుకుని నడిస్తే హంస తన రూపవైకల్యాన్ని చూసి తల వంచుకుంటుంది. అసూయ పడుతుంది. ఆ మెరుపు తీగె అదృష్టం దాని హృదయాన్ని రెండుగా చీల్చి ఈర్ష్యాగ్నితో దహింప జేస్తుంది.

సౌందర్య లాలిత్యాల నొసటను స్వాతిశయగర్వాలు కాటుకబొట్లు. ఆమెలో అలాంటి మాలిన్యం ఏదృక్కోణానా

నలుసంత అయినా అపుపించదు. ఆమె మందహాసం స్వచ్ఛ మైన జాతిముత్యాలు వెదజల్లినట్లుంటుంది. ఆ సమ్మోహన సౌందర్యానికి ఆ చిఱునవ్వే సార్థకత. ఆ నవ్వు తొలకరి తుంపరగా నిరీక్షిస్తే, శరద్రాత్రి నవ్వినట్లూ, గులాబీ విచ్చు కున్నట్లూ వుంటుంది. ఆ మూస పోసిన మృదుత్వానికి ఆ హుందాతనమే ఆభరణం.

ఆమె ఎక్కడినుండి ఎందువల్ల ఇక్కడికి వచ్చిందన్న విషయం ఎవ్వరికీ తెలియదు. విమలానంద్, శ్యామసుందరి బాంధవ్య బంధనా లేమిటన్న సంశయం ఎవరికీ నివృత్తి కాలేదు.

శ్యామసుందరి పగలల్లా ఆఫీసులో పనిచేస్తుంది. విమలానంద్ రోజంతా సోమరిగా కూర్చుని ఆలోచించు కుంటూ వుంటాడు.

విమలానంద్‌కు ఉద్యోగం లేదు. శ్యామసుందరికి విచారం లేదు. వీరిద్దరిదీ విచిత్రమైన స్నేహం. విస్పష్టం కాని అనుబంధం. విమలానంద్ ఆశకు పర్యాయపదం శ్యామసుందరి నిగ్రహానికి ఉత్పత్తి అర్థం. నయనాలలోని కాంతి రేఖలే విమలానంద్ జీవన వీచికలు. చిఱునవ్వులోని హెచ్చరికే శ్యామసుందరి గాంభీర్యంలోని ప్రత్యేకత.

వారిద్దరూ నిత్యమూ కలుసుకుంటారు. నవ్వుకుం టారు. ఆశ పెట్టుకుంటారు. హెచ్చరించుకుంటారు. నిస్పృహ చెందుతారు. నిట్టూర్పులు విడుస్తారు. పరస్పరం జాలి పడ

తారు అసహాయంగానే సహాయాన్ని ఎత్తి ఇవ్వాలని, అంటి పుచ్చుకోవాలని కాంక్షపడతారు. పరాజయం పొందుతారు. వారి ఆదర్శాలకు హద్దులు లేవు. ఆశయాలకు సంకెళ్ళు పడవు. ధ్యేయాలకు నిర్వచనం లేదు.

కాలం వారిద్దరి అనిర్వచనీయమైన బంధాన్ని గమనించదు. అది బాకులా దూసుకుని వారిద్దరి హృదయాలనూ చీల్చుకుని జీవితాలకు గుచ్చుకుంటుంది. విమలానంద్ కెవ్వుమని అరుస్తాడు. కన్నీటి పర్యంతం అవుతాడు. దైన్యంగా చూస్తాడు, స్తిమితం తప్పుతాడు.

శ్యామసుందరి ఓదార్చుతుంది. నచ్చ జెబుతుంది. వారించుతుంది.

విమలానంద్‌కు కాఫీ తీసుకోవడం బాధ్యత. భోజనం చేయడం బద్ధకం. నిద్ర పోవడం విసుగు.

శ్యామసుందరి అతన్ని హెచ్చరించుతుంది. ఉదయం ఆఫీసుకు వెడుతూ భోజనం చేశావా అని గుర్తు చేస్తుంది. సాయంత్రం వచ్చి భోజనం చేసేడో లేదో వంటపాత్రలను పరికించుతుంది. కాఫీ కాస్తుంది. ఫ్లాస్కు అతని మేజామీద పెట్టి గుర్తుగా దానిమీద అతని రిస్ట్‌వాచ్ పెడుతుంది. ఎప్పుడయినా అతను టైము చూసినా కాఫీ గుర్తుకు వస్తుంది గదా అని.

అయినా అప్పుడప్పుడూ భోజనం చేయడం మర్చిపోతాడు. కాఫీ ముట్టుకోడు.

"భోజనం చేయడం కూడా మర్చిపోయేంత ఆందోళ నలు నీకేమున్నాయి?" అని శ్యామసుందరి నిలదీసి ప్రశ్నిస్తుంది.

"ఇలా అయితే ఎలా ఆనంద్! ఏ బాధ్యతలూ నెత్తి కెత్తుకోన వసరంలేదు సరే. వేళకు భోజనంకూడా చేయ కుంటే ఎలా" అని మందలించాతుంది.

"ఇంత శ్రద్ధ తీసుకునే ఆత్మీయురాలివి నీ వుండగా నాకింకేం కావాలి సుందరీ?" అంటాడు ఆనంద్.

"కావాలి ఆనంద్! నీ కోసం నీ జీవితం నీకు కావాలి గదా! నీ కిన్ని సపర్యలు చేయగల హక్కు, అధికారాలు నాకేమున్నాయి? వాటిని స్వాధీనం చేసుకునే అదృష్టవంతు రాలెవరో?" అని నిట్టూర్చుతుంది.

చెల్లా చెదరుగా పడివున్న బట్టలు పుస్తకాలు సర్దు తుంది. ఇల్లంతా అద్దంలా శుభ్రపరుస్తుంది.

"ఇలా అయితే ఎలా ఆనంద్? పనిమనిషితో చెప్పి అయినా ఇల్లంతా సర్దించుకోవడం తెలియవద్దా?" అని కోప్పడుతుంది.

ఒకనాడు పాతకాలం నాటివి పదిపన్నెండు కవర్లు చిందరవందరగా పడివుండటం చూచి ఇవేమిటని ప్రశ్నించింది.

"చదువుకో. ఒకరి జీవితానికి సంబంధించిన మరణ శాసనాలు" అన్నాడు నిర్లక్ష్యంగానే.

శ్యామసుందరి వాటిలో ఒకటి రెండు చదివింది. నిట్టూర్చింది.

"నీవు బాధపడతావెందుకు ఆనంద్? కావేరి చాలా అవివేకి. అంది వచ్చిన అదృష్టాన్ని నిర్లక్ష్యంచేసి కాలదన్ను కుంది. అందుకు నేడు ఎంత చింతించుతున్నదో?"

విమలానంద్ గట్టిగా నవ్వేడు. "ఆమె ఏం చేస్తున్నదో నాకింకా తెలియదుగా సుందరీ. అందువల్లనే కావేరి మీద నాకింకా అనురాగాభిమానా లున్న వేమో?"

"కాబోలు! సంపూర్ణ స్త్రీ కావలసిన వ్యక్తి ఒట్టి ఆడదైంది"

"సుందరీ?"

"ఏం ఆనంద్?"

"ఎదుటివారి కిన్ని ఉదారపూరిత సలహా లిస్తావు గదా. నీ జీవితం చుట్టూరా అలా అవధు లేర్పరుచుతావేం?"

"ఆర్జించిన విజ్ఞానం మాత్రం సర్వసౌఖ్య ప్రద మౌతుందా ఆనంద్? జీవితాన్ని నీవింత నిర్లక్ష్యంగానూ, నిష్కర్షగానూ వెళ్ళ దీస్తున్నావు. మరి నీ మీద ఒక్కరికీ ఆగ్రహం కలగదేం? అది ఒక్కొక్కరి అదృష్టం."

ఆనంద్ నవ్వేడు. "లేదు సుందరీ నీవు ప్రసంగ ధోరణి మార్చడానికే ఇలా అంటున్నావు. నామీద అనురాగం వున్నది నీ కొక్కదానికే. ఆ విషయం నీ హృదయానికీ తెలుసు, కాగా అది అనురాగమా, అభిమానమా, అన్న

విషయం ఇంకా స్పష్టంగా తేలనే లేదు.........నిజంగా నేనంటే నీకు అనురాగమేనా సుందరీ?"

"అసలా సందేహం ఎందుకు వచ్చింది? నిత్యమూ అయిదుగంటలకే రివ్వునవచ్చి ఇక్కడెందుకు వాలుతున్నాను?"

"ఏమో జాలిపడి రావచ్చు. లేక........."

శ్యామసుందరి బిగ్గరగానే నవ్వింది. "పొరపాటు ఆనంద్. జాలిపడిన స్త్రీ సానుభూతి అయినా ప్రకటించు తుందేమోగాని అభిమానం మాత్రం కాదు."

"కావచ్చునేమో సుందరీ. అయితే అందరూ నీలాంటి వారే అయితే ఎంత బాగుండును?"

"కాదేమో ఆనంద్, మౌలికంగా అందరూ ఒకలాంటి వారే అయినా జీవన పరిణామంలో వారి తత్వాలు మారవని హామీ ఏమిటి. దేవత కాదగిన వ్యక్తి రాక్షసుడుగా రూపొం దనూ వచ్చు. అందుకు భిన్నమూ కావచ్చు.

"కానీ అసలు గుర్తింపే లేని వ్యక్తిలో పరిణామం సంభవమా సుందరీ. నిజం చెప్పు! ఈ ప్రశ్నకు సమాధానం చెప్పకుంటే...."

శ్యామసుందరి రివ్వునవచ్చి అతని నోరు మూసింది. ఇంక అంతటితో ఆపాలి ఆనంద్. నీవు వేసిన ప్రశ్నకు జవాబు ఇవ్వడానికి నిరాకరిస్తున్నాను. ఇంకా కొంతకాలం పడు తుంది. ఈ లోపుగా నీవు ఒట్లు పెడితే నన్ను హత్య చేసిన నట్లే!"

ఆనంద్ ముఖమండలం దీప్తమానమైంది.

"నిజంగానా సుందరీ ఆ ప్రశ్నకు జవాబివ్వడానికి ఆమాత్రం సందేహం వుందా నీకు'' అన్నాడు ఆనంద్ ఆమె మెత్తని చీరచెంగును చేతులతో స్పృశిస్తూ. అతని నయనాలలో రెండు కన్నీటి బిందువులు.

"కానీ నేనంటే నీకింత అభిమానం ఎందుకు ఆనంద్?"

''ఏం చెప్పను సుందరీ! నీ ముఖం చూడగానే అదొక తన్మయత, నీ సౌందర్యంలోని పారిజాతప్రసన్నత నేన్నెటికీ మరువలేను. నా హృదయ మంతటితో ప్రేమించాలనీ నీస్వచ్ఛతలో అంతర్లీనం కావాలనీ గాఢమైన కోరిక''.

''కానీ నీ మనస్సు నిన్ను వంచన చేస్తున్నది ఆనంద్ నాలో అంత గొప్పదనం ఏమీ లేదు''

వారి నిత్య సంభాషణ ఇలాగే కొనసాగుతుంది. విమలానంద్ ఎంతో రాగస్పందిత హృదయంతో శ్యామసుందరిని దగ్గరకు లాక్కుంటాడు. శ్యామసుందరి ఏ ఏహ్యాభావమూ లేకుండా మందస్మితంగానే అతని హస్తపాశాన్ని వదుల్చుకుంటుంది. అతని కండ్లలో కోరిక. ఆమె ముఖంలో వారింపు హృదయంలో నిగ్రహం. అతనిలో దైన్యం, నైరాశ్యం. ఆమె అంతర్యంలో జాలి, సానుభూతి, ఇది వారి దినచర్య. జీవితం.

సంఘపు మలుపులలో ద్వేషాసూయలు. ఆనంద్ అంతరాంతరాలలో ఆరాధన. శ్యామసుందరి ముఖంలో నిర్లక్ష్యం. ఆపైన దయ.

శ్యామసుందరిని చూచి లోకులు గుసగుసలాడ ప్రయత్నిస్తారు. ఆమె విమలానంద్ సరసనే కూర్చుని రిక్షాలో బజారుకే వస్తుంది. ఆమె రహస్యాల జాబితా తయారుచేసి ప్రకటించబోయే వారి ముఖాలు వెలవెలా, తెలతెలా పోతాయి.

శ్యామసుందరి ఆ తరువాత ముఖం వాల్చుకుంటుంది. ఎప్పుడయినా ఎవ్వరూ చూడకుండా రెండు కన్నీటిచుక్కలు రాల్చి హృదయభారం దించివేసుకుంటుంది.

విమలానంద్ బాధపడతాడు. లజ్జతో అతని ముఖమండలం ఎర్రపడుతుంది. ప్రపంచం మీద ప్రతీకారం తీర్చుకోలేని కసి.

చలించిపోతాడు. సుందరిని తనవైపు తీసుకుని మృదువుగా చుబుకాన్ని పైకెత్తుతాడు.

ఆమె కంటిలో అశ్రుజలాలు. అతని హృదయంలో శూలం గుచ్చినట్లు బాధ.

"సుందరీ నీలాపనిందలన్నింటికీ నేనే కారణం. ఇంత నిందాభారాన్ని భరిస్తూ కూడా మనకెందుకీ అంతరం" అంటాడు.

సుందరి నయనాలనుండి ముత్యాలు జలజల రాల్తాయి. "లేదు విమలానంద్! మనిద్దరికీ అంత సాన్నిహిత్యం వద్దు. అలాంటి అదృష్టం కొరకే ఎదురు చూద్దాం. ప్రస్తుతానికి క్షమించు" అని గదిలో దీపం వెలిగించి నిద్రపోయేప్పుడు

పాలుపుచ్చుకోవడం మరచిపోవద్దని చెప్పి వెళ్ళిపోతుంది. ఆనంద్ అంతర్యంలో పరిష్కారం లేని అల్లకల్లోలం మాత్రమే మిగులుతుంది.

# 20

ఆనాడు శ్యామసుందరి వచ్చేప్పటికి విమలానంద్ వాహ్యాళి వెళ్ళపోతున్నాడు.

"ఎక్కడికి ఆనంద్ ఎక్కడికో బయలుదేరి వెడుతున్నావే" అంది శ్యామసుందరి కాఫీ ఫ్లాస్కును మూత తీసి పరిశీలించుతూ.

ఆనంద్ ముసిముసి నవ్వులు నవ్వేడు. "ఇవ్వాళ భోజనం. కాఫీ ఏదీ మర్చిపోలేదులే సుందరీ".

"ఏమో భోజనమే గుర్తు వుండని వ్యక్తికి ఇతర విషయాలు ఎలా జ్ఞప్తిలో వుంటాయో!" అంది శ్యామసుందరి మిగిలిన కాఫీ గ్లాసులోకి వంచుతూ.

"నీ సాన్నిహిత్యం ఉన్నంతవరకూ మర్చిపోయినా ఇబ్బంది లేదులే సుందరీ. నీ వెలాగూ తప్పనిసరిగా గుర్తు చేస్తావు గదా".

శ్యామసుందరి నవ్వుకుంది. "ఎప్పుడూ ఈ పరాధీనత ఏమిటో" అంటూ కప్పులోని కాఫీ సగం సాసరులోనికి వంచి ఆనంద్ కందించింది.

"అదిగో నీ భాగంలో కూడా నాకు భాగం పంచుతున్నావు".

"పొరపాటు ఆనంద్. ఈమాత్రమైనా నేను పాలు పంచుకోగలుగుతున్నాను" అంది శ్యామసుందరి కాఫీని ఆప్యాయంగా పెదవులకు అందుకుంటూ. ఇద్దరూ నవ్వుకొంటూ పార్కుకు వెళ్ళేరు.

ఆనంద్ తనలో తనే నవ్వుకున్నాడు.

"ఏదో...నవ్వుకుంటున్నావు ?"

"నిన్ను గురించే సుందరీ! కాదు మన్ని గురించి. నన్నందరు ఎంత నిగ్రహం కల వ్యక్తిగా గుర్తించుతారో అంత తొందరపాటు వుంది నాలో! నిన్నందరూ ఎంత చంచలమైన వ్యక్తిగా భావించుతారో అంత నిగ్రహం వుంది నీలో ! ఈ ప్రపంచం నన్ను చూసి భయపడుతున్నది. కాని అందుకు తగ్గ ప్రతిఫలం నాకు దక్కడం లేదు. ప్రపంచంతో నీవు మాట పడుతున్నావు. కానీ అందుకు నీవు ప్రతీకారం తీర్చుకోవడం లేదు. ఇలా మాట పడుతూ కూడా మొహమాట పడటం మనలోని బలహీనతయేమో సుందరీ ?"

"కానీ, నీవు ఎప్పుడూ ఇలానే ఎందుకు ఊహ చేస్తావ్ ఆనంద్ ?"

"ఒక్క నీ విషయంలో తప్ప మరెప్పుడూ చేయను శ్యాం. కావేరిని ముందు ప్రేమించాను. ఆ తరువాత అభిమానించేను. కానీ నిన్ను ముందర అభిమానించేను. ఆ తరువాత.."

"ఆపు విమలానంద్. ఇలా అయితే కొంతకాలం పోయిన తరువాత నా మీద గౌరవం తప్ప మరే భావమూ మిగలకపోవచ్చు" అంది దగ్గరగా నడుస్తూనే.

అప్పటికి సాయంత్రం ఆరుగంటలయింది. పార్కులో అందం పురివిప్పుతుంది. ఆనంద్‌కు శ్యామసుందరి ప్రక్కన వుంటే ఇవేవీ పట్టవు. పరివేష్టిత జనాన్ని గమనించడు.

పార్కు చివరికి వెళ్ళేసరికి ఆనంద్ నయనాలు విస్మయంతో విప్పారేయి. ఎదురుగా విజయభారతి, నిరంజన్ కూర్చుని వున్నారు.

"విజయభారతీ!" ఆశ్చర్యంగా అరిచేడు విమలానంద్.

విజయముఖం వివర్ణమైంది. భయంతో కంపించి పోయింది. నిరంజన్ విజయ వంక, విమలానంద్ వంక సందేహాస్పదంగా చూడసాగాడు.

శ్యామసుందరి జరిగిపోయిన పొరపాటును అరక్షణంలో గుర్తించింది.

"అలా ఆశ్చర్యపడతావేం విజయా. వీరు విమలానంద్ లోగడ ఒక పర్యాయం పరిచయంచేశాను గుర్తు లేనేలేదా?" అంది స్వాతంత్ర్యాన్ని తీసుకుంటూ.

"ఓ ఓ నమస్తే" అంది విజయ తడబడుతున్నట్లుగా.

ఈసారి విమలానంద్ ఖిన్నుడయ్యాడు విజయ తనను, తనకు తెలియనట్లే నటిస్తున్నదని.

"వీరు మా శ్రీవారు" అంది విజయ విమలానంద్‌ను పూర్తిగా ఉపేక్షించి శ్యామసుందరికి పరిచయంచేస్తూ. పరస్పరం నమస్కరించుకున్నారు. మాట్లాడుకున్నారు. విమలానంద్ ముఖం చిన్నబోయింది. ఇది అరని కోరిక చెంపపెట్టు. సొంత నానుభవం. కోపాగ్నితో దహించుకొనిపోయ్యాడు.

శ్యామసుందరి నయనాలతోనే అతన్ని వారించింది. అతని ఆగ్రహం ప్రజ్వలించకముందే అక్కడినుండి దారితీసింది.

ఇద్దరూ పార్కు బయటికొస్తున్నారు.

"నీ తొందరపాటు చాలా ప్రమాద భరితమైంది ఆనంద్" అంది మందలించుతూ.

ఇంతలో ఎదురుగా మదిర! విమలానంద్ ఉగ్రహితంగా చూచేడు. ఆమెను పలుకరించాలో కూడదో అతనికి అర్థం కాలేదు. మరి ఆమె కూడా 'స్త్రీ' కదా!

కానీ మదిర స్వాతిచినుకులు పడినట్లు చిఱునవ్వు నవ్వింది. ఆమెలో విజయదీప్తి వెల్లివిరుస్తున్నది. నాలు గంగుళాల వెడల్పాటి జరీ అంచు చేనేత చీర. మెడలో కాంతులు చిమ్ముతున్న వజ్రాలహారం. ఆమెలో ఏదో పెద్ద మార్పు. ఆ మార్పేమిటో ఆనంద్‌కు అంతుబట్టలేదు.

"హలో ఆనంద్!" మదిరే చొరవగా కరచాలనం చేసింది. వ్రేలిని పొదిగిన వజ్రపుటుంగరం తళుక్కుమంది.

"ఈమె ఎవరు ?" మదిరే ప్రశ్నించింది.

"శ్యామసుందరి" ఆనంద్ క్లుప్తంగానే జవాబు చెప్పేడు.

శ్యామసుందరి కండ్లు పెద్దవిచేసి చూస్తున్నది. మదిర అంత త్వరగానే మెరుపులా కదలి వెళ్ళింది.

"ఈమె ఎవరు ?" శ్యామసుందరి ప్రశ్నించింది.

విమలానంద్ నివ్వెరపోయాడు. "ఇలాంటి ప్రశ్నను నువ్వు ఎన్నడూ వెయ్యలేదు."

"ఇలాంటి వ్యక్తిని నే నింతవరకూ చూడనూలేదు."

శ్యామసుందరి కావాలనే మదిరను 'స్త్రీ' అని సంబోధించడం లేదని గ్రహించాడు.

"విజయభారతి సోదరి. సన్నిహిత స్నేహితురాలు".

శ్యామసుందరి ఆశ్చర్యపోయింది. "నిజమా ఆనంద్ ! ఈమె విజయ సోదరేనా?"

"అవును. కానీ సుందరీ !, విజయ ఇంత అవమానకరంగా ప్రవర్తించ గలదని నే నెన్నడూ భావించలేదు. విజయను చూసేవా నన్ను తెలియనట్లు ఎలా నటించిందో !"

"ఆమెతో వున్న వ్యక్తి ఆమె భర్త అని నీకు తెలుసనుకుంటాను."

"అయితే !"

"అదే ఆనంద్ నీతో పేచీ. నీకు ప్రపంచాన్ని గురించి భయంలేదు. నేను దాన్ని గురించి పట్టించుకోను. అందరూ

మనలాంటి వారే అనుకుంటే ఎలా?"

ఆనంద్ తెల్లబోయాడు. "నీ వనేదేమిటో నా కర్థం కాలేదు."

"ఆనంద్! విజయగురించి నీ కేం తెలుసో నేను చెప్ప లేను. కానీ ఆమె కాపురాన్ని అత్యంతభయంగా వెళ్ళ దీస్తున్నదని మాత్రం చెప్పగలను."

ఆనంద్ ఆమె మాటలను త్రోసివేసేడు. "ఈ విష యంలో మాత్రం నీ అభిప్రాయం నిజం కాదు సుందరీ. విజయ ఎన్నడూ అంత పిరికిపంద కాదు. ఏ మాటనయినా నిష్కర్షగా ముఖాన చెప్పడానికి రవ్వంత కూడా సంకో చించదు."

శ్యామసుందరి నిరసించింది. "ఆమె వస్తుతః అలాం టిదే కావచ్చు. కానీ జీవితం వేరు. పరిస్థితులు వేరు. పరిస్థితు లను బట్టి జీవనప్రకృతిలోనే మార్పు రావచ్చు."

విమలానంద్ ఒక్కక్షణం మౌనం వహించేడు. "కానీ విజయ అసమాన సౌందర్యవతి కదూ ?"

శ్యామసుందరి బిగ్గరగా నవ్వింది. విమలానంద్ ఉడికి పోయాడు. "నీవు సరయిన సమాధానం చెప్పవలసి వచ్చి నప్పుడల్లా నవ్వుతావు" అన్నాడు.

"నవ్వక ఏం చేయను ఆనంద్ ? నీవు నన్ను ప్రేమించా నని చెప్పేవు....ఆ తరువాత కావేరిని ఇదివరలోనే ప్రేమించి వున్నానని అన్నావు...ఇప్పుడు విజయ అసమాన సౌందర్య

వని కదూ అని నన్నే ప్రశ్నించుతున్నావు....స్త్రీ యొక్క ఈర్ష్యాసహనాలను ఇలా పరీక్షకు పెడతా వెందుకుఆనంద్ ?''

ఆనంద్ అసహాయంగా చూశాడు.

“పురుషం ఎవరివద్దా ఈ ప్రేమ పిచికనూ గుప్తంగా దాచుకోలేవు. బహుశ ఈ నిష్కాపట్యాన్ని చూసే స్త్రీ నిన్ను ప్రేమించుతున్న దేమో ! కానీ మనసులో అనుకున్నవి అన్నీ బయటికి అనకూడదు ఆనంద్.''

విమలానంద్ లజ్జతో క్రుంగిపోయాడు. శ్యామసుందరి మళ్ళీ అతన్ని బుజ్జగించింది. అది ఆతనిలోని బలహీనత ! అదే ఆమెలోని ఔన్నత్యం !!

# 21

ఈ సకలసృష్టికి కారణం దైవం అయితే కావచ్చు కాని కొందరు పుట్టి ఒక వయసువరకు పెరిగిన తర్వాత తమ జీవితాలను తామే మలచుకోవడం ప్రారంభించుతారు. అందుకు అవిరళ పోరాటం సాగనూ సాగుతుంది. కానీ కొందరి జీవితాలు దైవం సృష్టించినట్లు ముడిపదార్థాల్లా యథాతథంగానే వుంటాయి. వాళ్ళు అలాంటి జీవితాలనే

చేత బుచ్చుకుని తలవంచుకొని దారినే పడి నడుస్తారు. వారి దొక తత్వం! వారిలో విప్లవ వీచికలు ఎప్పుడయినా నిప్పు కణాల్లా ప్రజ్వరిల్లవా అంటే ప్రజ్వరిల్లవు అని సమాధానం కాదు. కానీ వాటికి నలుసంత అవాంతరం ఏర్పడగానే పెంపకానికి అలవడిన ఆటవిక జంతువుల్లా బందిఖానా జీవితం శ్రేయస్కరమనీ, సంరక్షితమనీ బలీయమైన అభిప్రాయాలేర్పడతాయి. కట్టుకొయ్య నుండి మెడపలుపు విప్పగానే బండి కాడి క్రిందికి వచ్చే దుక్కిటెద్దుల్లా వారి జీవితాలు మొద్దుబారి పోతాయి.

ఇలాంటి సత్వానికే హేమకుంతల ఆశ్చర్యపడుతుంది. కమలానంద్ అసహ్యించుకుంటాడు. శ్యామసుందరి నవ్వి "మీరిద్దరూ అనుభవ శూన్యులు. ఇది జీవితం. జీవితంలో ఏదో ఒక క్షణంలో అయిష్టంగానే విషం పుచ్చుకోవలసి రావచ్చు. పిచ్చి ధైర్యమూ, మొండి సాహసమూ నిస్వతంత్ర జీవితానికి ప్రాతిపదిక వేసినా ఏకాకిని చేస్తాయి. అందువల్ల స్వాతిశయం ఏర్పడవచ్చునేమో గాని శాంతి సంతృప్తులు మాత్రం కాదు" అంటుంది.

ఇదే ఉపేక్ష అయితే ఏమనేవాడో మరి. అతను ఇల్లు, వాకిలి స్నేహితుల్ని వదిలి, రాగబంధాల్ని త్రెంచుకొని వ్యాధిగ్రస్తుడై అజ్ఞాతంగా ఎక్కడో కుళ్ళిపోతున్నాడు. కనుక అతని అభిప్రాయం ఏమిటో మనకు తెలియదు. కానీ "జీవితం జీవితమే! దానికి మార్పులూ, చేర్పులూ, మెరుగులు

దిద్దడాలూ వుండవు" అని అనిపించేవాడేమో అని మాత్రం ఊహించుకోవచ్చు.

అయితే విజయభారతి ఇలాంటి సందేహాలలో వేటి లోనూ చిక్కుపడలేదు. ఉపేక్ష ఆమె తిరుగుబాటు స్వభావం మీద చన్నీళ్ళు చల్లిన నాటినుండి జీవితాన్ని మౌనంగా అంగీక రించటం మాత్రమే నేర్చుకుంది.

ఇప్పుడు విరంజన్ ఆమెకు భర్త. తన ముందున్నది జీవితం. దాని చలనానికి ఎంత మౌనం, లొంగుబాటు అవస రమో అంతా అంగీకరించటమే ఆమె చేసే పని.

విరంజన్ ఎప్పుడయినా వైజాగ్‌నుండి వస్తాడు. ఆ తరువాత రెండు రోజులకో మూడు రోజులకో మదిర ప్రత్యక్షమౌతుంది.

అతను వెనుకటి విరంజన్ కాదు. మదిరను చూస్తే అతనిలో బెదురు, భయం, లజ్జ వగైరా భావాలు వ్యక్తం కావు.

ఇప్పుడామె ఇదివరకటి మదిర కాదు. వెనుకటి మదిర విజయను చూసి ఆశ్చర్యపడేది. కొద్దిగా అసూయ పడేదేమో. ఇప్పుడామెలో స్వాతిశయ అహంభావాలు శ్యామసుందరి లాంటి వ్యక్తులు స్పష్టంగా పోల్చుకోగలరు. విజయ, విశ్వ నాథంగారి ఆస్తి సంపదలు ఇప్పుడు ఆమె విస్మయానికి కారణం కావు. విరంజన్ అంటే ఆమె కిప్పుడెంతో అభిమానం. విజయభారతి అంటే చిఱునవ్వు.

ఒంటినిండుగా రవ్వలనగలు. నాలుగంగుళాల మేర జరీ అంచులున్న పల్చని పట్టు చీరెలు, మొఃహమలు చెప్పులు, ఇవన్నీ ఖరీదు చేసుకునేప్పుడు ఆమెకు విజయ సంగతి గుర్తు రాలేదు.

అవును మరి! డబ్బు మదించి వున్నవాడు ఆర్థిక సమతను గురించి విశాలాభిప్రాయాలు కలిగివుండాలి గాని మిగతా వెందుకు ?

అయినా విజయకు సంతోషమే. ఆమెకు అంతర్గతంగా ఆనందమే. విరంజన్ తనతోనే గాక తన వారందరితో కలుపుగోలుగా మాట్లాడితే మంచిదే కదా ?

ఒకప్పుడు మదిరను బెదురు చూపులు చూసిన విరంజన్‌కు ఇప్పుడు మదిర ఇచ్చిన కాఫీయే బావుంటుంది. మదిర దగ్గరవుంచేనే భోజనం రుచించుతుంది. ఆమె ఎన్నిక చేసిన బూటూ, సూటూనే అందంగా వుంటాయి.

ఆప్తులంతా ఇలా పొరుపులు లేకుండా కలసి కట్టుగా వుండడమే విజయకు కావలసింది.

విజయకు డబ్బు కొదువలేదు. విజయ అతని అభీష్టానికి దేనికీ ఎదురు చెప్పదు. అది గాడిన పడిన వారి జీవితం.

"విజయా నీవు అబ్బాయిని కనవలసిందే" అనేవాడు విరంజన్ శాసించినట్లుగా.

"అదెలా? అది నా చేతిలోని పనా?"అనేది విజయ తెల్లబోయి.

"అదంతే ! నీవు అబ్బాయినే కంటావు" అనేవాడు

విరంజన్ తనకు తెలిసినట్లు.

తనకు మనుమడు పుడితే తిరుపతిస్వామికి నిలువు దోపిడీ ఇస్తానని విశ్వాసరావుగారు మొక్కుకున్నారు.

"ఒక్కతెవె వీరందరి కోరికలూ ఎలా తీర్చుతావు? ఒక పని చేస్తావా?" అనేది హేమకుంతల.

"ఏవిఁటది?"

"ఒక ఆడ పిల్లను, ఒక మొగ పిల్లడ్ని కలిపి కవల పిల్లల్ని కను. అందరి కోరికలూ తీరుతాయి" అనేది హేమ.

అందరూ పకపకా నవ్వుకునేవారు.

## 22

విశ్వనాథంగారు ఎప్పుడో అక్కౌంట్సు చూసుకున్నారు. అప్పటికి విరంజన్ పేర పదిహేనువేలు ఖర్చు వ్రాసి వుంది. అదంతా బ్యాంక్‌లోనుండి డ్రా చేసుకున్న క్యాష్. విశ్వనాథంగారు తెల్లబోయారు. బ్యాంక్ లోంచి క్యాష్ డ్రా చేయడమా!

"శాస్త్రి! ఇదంతా ఎందుకు డ్రా చేసినట్లు?" అన్నారు ఆశ్చర్యంగా. "ఎందుకో తెలియదు. విరంజన్‌గారు డ్రా చేసి పంపమన్నారు. పంపేను. ఎంత కావాలన్నా పంప

మని మీరే కదా చెప్పేరు?"

విశ్వనాథంగారికి నోట మాట రాలేదు. అంతలోనే తత్తరపాటు సర్దుకున్నారు. "పంపమన్నాను; కానీ బ్యాంక్ లోంచి క్యాష్ డ్రా చేసి పంపమన్నానా? ఈసారి ఎప్పుడయినా కావలసివుంటే బ్యాంక్ చెక్ వ్రాసి పంపు" అన్నారు నవ్వుతూ. "ఇలా వేయి, రెండు వేలూ బ్యాంక్ లోంచి డ్రా చెయ్యడం ఎంత నామర్దా" అని హుందాగా నవ్వేరు.

ఈసారి పాలిపోవడం శాస్త్రి వంతు.

మరో మారు డబ్బు డ్రా చేసి పంపమంటే మేనేజరు శాస్త్రి చెక్ పంపడం చూసి విరంజన్ క్రుద్ధుడయ్యాడు. అతని అహం దెబ్బ తింది. అతిశయం రెచ్చిపోయింది.

"ఇందులో పోయిం దేముంది. చెక్ అయితేనేం? డబ్బయితేనేం?" అంది మదిర నవ్వుతూ. విరంజన్ ఆమెమాటను త్రోసివేసి శరవేగంగా విజయవాడ వచ్చేడు. అతను నిప్పు కణంలా కణకణా మండిపోతున్నాడు. విశ్వనాథంగారిని చూసి ముఖం మాడ్చుకున్నాడు. మేనేజరు శాస్త్రిని చూసి బుస్సుమన్నాడు. చరచరా లోనికి నడిచాడు. విజయను చూసి చిరచిరలాడుతూ మండి పడ్డాడు. నిప్పు శగలు కక్కేడు.

"ఏమిటిదంతా?" అని విజయ రిచ్చపడింది. లోలోపల భయం.

"నాకు డబ్బు కావాలి!"

అందుకింత రాద్ధాంతం ఎందుకని ఆశ్చర్యం. "తీసుకోండి ఎవరు వద్దన్నారు. మీకు అడ్డుపడేం దెవరు?"

"ఎవరూ అడ్డుపడలేదు. ముష్టివాడికి వ్రాసిచ్చినట్లు చెక్ వ్రాసి పంపేడు." చెక్ విజయ ముఖాన కొట్టేడు.

ఆమె బిర్ర బిగుసుకు పోయి రాయిలా నిలబడింది.

"చూడవేం చూడు!"

విజయ నిర్జీవంగా చెక్ తీసుకుంది. అందులో విరంజన్‌కు క్రాస్డ్ చెక్ రెండు వేలకు ఆర్డరు వేసి వుంది. విజయకేమీ అర్థం కాలేదు.

"అంటే నేనెంత డబ్బు వాడుకుంటున్నానో బాంక్‌లో పొందికగా లెఖ్ఖ వ్రాసి వుంటుందన్న మాట! రేపు ఏదయినా జరిగితే...."

విజయ అతన్ని ప్రాధేయపడింది. "ఇంక అంతకుమించి ఏమీ అనవద్దు. మీకు కావలసింది డబ్బేగా! ఎంత కావాలో చెప్పండి."

విరంజన్ మూతి బిగించుకుని కూర్చున్నాడు మాట లేని రాయిలా.

విజయ నెమ్మదిగా కదిలింది. అప్పటికి సాయంత్రం ఎనిమిది గంటలు. కాళ్ళీడ్చుకుంటూ ఆఫీసుగది వైపు దారి తీసింది క్రిందికి. లంకంత ఇంట్లో ఎవరు ఎక్కడున్నారో ఎవరు వచ్చి పోతున్నారో ఎవరికీ పట్టదు.

ఆఫీసు గదిలోంచి ఎవరివో మాటలు వినబడు తున్నాయి. అందులో ఒకటి స్త్రీకంఠస్వరం. విజయ నిలిచి పోయింది. కిటికీ పల్చని తెరలోంచి ఆ స్త్రీ స్వరూపం కాన వస్తున్నది.

కవటాకులాంటి అందగత్తె. నవీన నాగరికత నాజూకుతనం శరీరం నిలువెల్లా నింపుకుంది. వ్యక్తిలో గర్వం. వర్తనలో నిర్లక్ష్యం, కండ్లలో మిలమిల. పెదవుల మీద అహంభావంతో కూడిన చిఱునవ్వు. తల వెంట్రుకలు కత్తి రించి భుజాల మీదికి వ్రేలాడుతున్నాయి. వైనులాంటి చూపు. కోరే కళ్ళు. వాలే రెప్పలు. వింటిలా వంకులు తిరిగి వంపులు నొక్కుకుంటున్న శరీరం.

సోఫాలో, రొమ్ము విరుచుకుని, అందాన్ని వింటిలా వంచి, వక్షస్థలాన్ని బాణంలా ఎక్కుపెట్టి కాలుమీద కాలు వేసుకుని సునిశితంగా చూస్తూ నవ్వుతోంది. ఈ ప్రపంచం లోని పురుషత్వాన్నంతనూ లాంగదీసి పిడికిలి పట్టగల నన్నంత ధీమా. ఏ అదుపూ అడ్డూ సహించలేని స్వేచ్ఛా ధోరణి.

విశ్వనాథంగారు చేస్తున్నది మామూలు సంభాషణ కాదు. అది పరామర్శా కాదు. వ్యాపార వ్యవహారాలు చర్చించడమూ కాదు. ఆ మాట్లాడటంలో ప్రాధేయత, బుజ్జ గింపు, నచ్చజెప్పటం! ఆశపెట్టడం! బేరం చేయడం! లంచం పెట్టడం!

"నీలాలి! నీ పీ పని చేయక తప్పదు. బ్యాంక్‌లో ఓవర్ డ్రాఫు పెరుగుతూంది. థియేటర్ రిలీజ్ వ్యవహారం పూర్తి కాలేదు. లోన్ గ్రాంటు కావడానికి మాసాలు గడిచి పోతున్నాయి. నాధూరాం‌సేట్ ఇస్తానన్న మొత్తం ఇంకా చేతికందలేదు. ఇలా అయితే ఎలా ?"

నీలాలి నవ్వింది. ఉల్లిపొర చీర భుజాల చుట్టూరా కప్పుకొని మరింత వెనుకకు వంగి చేతి మునివ్రేళ్ళతో జుట్టు సవరించుకుంది.

"నేనిప్పుడు అవసరం వచ్చేను కాబోలు!" ఆ మాటలో వ్యంగ్యం. కంఠస్వరంలో ఎత్తిపొడుపు. 'నాకు తెలుసులే' అన్న నిర్లక్ష్యం. 'నేను తలచుకుంటే ఆ పని ఎంత?' అన్న అహంభావం.

"అదేవిఁటి నీకు కాదన్న దేమిటి. ఏం కావాలి?"

"ఓహో, కాదన్న దేవిటి? నేను కోరుకోవాలి కాబోలు! మీరు అనుమతిస్తారు. అంతేనా" పకపకా నవ్వింది నీలాలి.

"మీరు ఉదార స్వభావులు. అయినా చెప్పండి వింటాను. ప్రొజెక్టర్లు ఖరీదు చేయడంలో మీకు యాభయి వేలు కలసివచ్చేట్లు చేసింది ఎవరు? విశ్వాసరావుగారి థియేటర్లమీద మీ పేరన అప్పుపుట్టించిందెవరు? ఇప్పుడు నాధూరాం సేట్ ఇస్తానన్న మొత్తం రేపు అందనుంది. వీటన్నింటికీ మీరు నాకు అవునన్నదేమిటో చెప్పండి?"

విశ్వనాధంగారు ఎగిరి గంతువేశారు. "సేట్ వ్యవ

హారం పూర్తయిందా?"

"ఆ అయింది. వ్యవహారాలన్నీ పూర్తి అవుతూనే వున్నాయి. మీ వాగ్దానాలే చెల్లుబడి కావడం లేదు." నీలాలి మూతి ముడుచుకుంది.

"చెప్పు నీకేం కావాలో చెప్పు. ఏం కావాలో చెప్ప కుండా నిందారోపణ చేయడం బాగుండదు."

నీలాలి దిగి వచ్చింది. "నిరుడు తీసిన కారు పాతబడి పోయింది. కొత్తది తీయాలి. యాభయివేలు వెంటనే కావాలి"

విశ్వనాథంగారు బలవంతంగానే నవ్వు తెచ్చుకున్నారు.

"సరే ఇదుగో" బ్యాంక్ చెక్ వ్రాసి ఇచ్చేరు.

నీలాలి పకపకా నవ్వింది. "విశ్వనాథంగారూ! నేను మీ భాగస్థురాల్ని, స్నేహితురాల్ని కాదు. నాకా ఈ బ్యాంక్ చెక్ ఇవ్వడం? ఈ చెక్‌ల సంగతి నాకు తెలియందా? మీ వద్దనుండి డబ్బు తీసికొన్నట్లు నా పేరు బ్యాంక్‌లో నమోదు చేసుకోవలసినంత అవసరం నాకింకా పడ్డలేదు. మర్యాదగా రేపు డ్రాచేసి క్యాష్ పంపండి" నీలాలి చెక్ విసిరి ఆయన ఒడిలో పారవేసింది.

"అంతేకాదు. నేను ఇక్కడే ఇంకొక పదిరోజులుండ వలసిన అవసరం వుంది ఇక్కడే వుంటాను."

"ఇక్కడా"

"అవును. ఇక్కడే ఈ ఇంట్లో వుండకూడదా?

"అది నీకు మంచిదనిపించితే అలాగే చేయి."

నీలాలి బిగ్గరగా నవ్వింది. స్త్రీత్వంతో స్వార్థ లాభా లన్నీ కూర్చుకోవచ్చు. ఇంట్లోని స్త్రీకి వరదా! బయట స్త్రీ ప్రపంచానికి ఎర! అంతేనా? సరే! మీ మర్యాద మీవద్దనే వుంచుకోండి. రేపు పన్నెండు గంటలకల్లా యాభయివేలు పంపండి" నీలాలి హెచ్చరించి చరచరా వెళ్ళిపోయింది.

విజయ కొయ్యబారి పోయింది. ఆమె గుండెల్లో ఒక ఆటంబాంబు పేల్చినట్లయింది. ఆమెలోంచి ఓ అసహ్య భావం. ఏహ్యత.

ఈ పేకమేడలూ, స్వర్ణహర్మ్యాలూ కల్మష పూరితా లన్నమాట. పాపపంకిలా లన్నమాట.

విజయ గిరుక్కున వెనక్కు తిరిగి వచ్చింది. ఆమె వదనం మ్లానపూరితమైంది.

ఎవర్ని విశ్వసించడం? ఎవరి నిజాయితీని, చిత్తశుద్ధిని నమ్మడం? ఎవరిది నిర్మల స్వభావం? ఈ ప్రశ్నలతో ఆమె తల్లడిల్లి పోయింది.

ఆమె రాక కొరకు ఎదురు చూస్తున్న విరంజన్ ఆమె ఒంటరిగా, నిస్సత్తువగా రావడం చూసి కుతూహలంగా ఆగిపొయ్యాడు.

విజయ ఆకారం చూడగానే అతని కేదో అనుమానం, సందేహం. అక్కసు. అవాలోచిత మనోగత నిందారోపణ.

"ఏది డబ్బు?" ముక్కుగోళాల్లోంచి వేడి శగలు.

"లేదు."

"అంటే !?"

"డబ్బు విషయం నాకు తెలియదు. మీ కివ్వటానికి నాదయిన సొమ్ము నయాపైస కూడా లేదు. నాన్నగారి యిష్టం. మీ యిష్టం." అది ఆమె చెప్పగలిగిన జవాబు.

"అంటే ఆయన లేదని చెప్పారన్నమాట?"

విజయ తల అడ్డంగా తిప్పింది. "లేదు ఆయ నేమీ చెప్పలేదు. విరంజన్! దయచేసి నన్ను ఆర్థిక వ్యవహారాల్లోకి ఈడ్చకుండా వుండలేరా?" అది విజయ అభ్యర్థన.

విరంజన్ ముందున్న టేబుల్ మీది కప్పులు, సాసర్లు టప్ టప్ మని పగిలి పోయాయి. అతనిలో నిలువెల్ల అగ్ని జ్వాలలు. దురాగ్రహం. విజయ తనకు తానై వెళ్ళి వచ్చి కాదని జవాబు చెప్తున్నదని క్రోధం.

"చూస్తాను ఎలా రాదో?"

"మీకు డబ్బే కావాలా? ఒకర్ని మనం యాచించడం ఎందుకు? మామగారి వద్ద......."

విరంజన్ కోపమనస్కుడై వెళ్ళిపొయ్యాడు "ఈ సలహాలు నీవేం ఇవ్వనవసరం లేదు" అంటూ.

విజయ గాఢంగా నిట్టూర్చింది. అప్పటికి ఆమె నిండు చూలాలు. ఆమె హృదయం గాయపడుతుందనిగానీ, మానసికంగా వ్యథ చెందుతుందని గానీ విరంజన్‌కు అనిపించలేదు.

# 23

రోజుకు ఇన్నిన్ని కప్పులూ, సాసర్లూ, ముక్కలూ, చెక్కలూ కావడం గమనించిన రామలక్ష్మమ్మ ఎంతో విచారించింది.

"ఏవేఁరామీ! నువ్వు అంట్లు తోమినప్పుడల్లా ఇన్నిన్ని కప్పులూ, సాసర్లూ పగిలి వక్కలయితే నెలకు ఎన్ని డజన్లు అవుతాయంటావు?" అంది అమాయకంగానూ ఆశ్చర్యంగానూ తీరికగా గడపవద్ద పీట వాల్చుకొని కూర్చుంటూ.

వంటయిల్లు. దానికి ప్రక్కనే డైనింగుహాలు. దానికి తరువాత వరండా. దానికి ప్రక్కనే అతిథులగది.

"అదేమి టమ్మగారూ? నేను కప్పులూ, సాసర్లూ పగులగొట్టేనా?" రామి నోరు తెరిచింది.

రామలక్ష్మమ్మ గారు నోరు నొక్కుకుంది. "ఇంకా అలా చూస్తావేమే రామీ? కాఫీట్రేలోని కప్పులూ, సాసర్లూ ఒక్కటున్నా మిగలకుండా నిన్న పగిలి పోయాయా? ఇవ్వాళ మళ్ళీ పగిలిన కప్పులూ, సాసర్లూ నీ ముందు గుట్టలు పడే వున్నాయా? ఇలా చెక్కలు కావడం ఈ నెలలో అప్పుడే అయిదవసారో ఆరవసారో గదా?"

"ఇవి నేను పగుల గొట్టడం కాదమ్మా! వాటిని విజయమ్మగారు చినబాబుగారి గదిలోంచి తెచ్చేరు."

"ఏవిటీ!?" రామలక్ష్మమ్మ గారు నివ్వెరపోయింది. "ఈ కప్పులూ సాసర్లూ విరంజన్ బాబుగారి గదిలోనివా? జయమ్మ అక్కడే వుందా?"

"ఉన్నారు"

రామలక్ష్మమ్మగారు గుప్త సందేహంతోనూ, మానసిక ఆందోళనతోనూ అనుమానంగా చూచింది.

ఇంతలో విజయ చిన్న ప్లాస్టిక్ కప్పు పుచ్చుకుని "రామీ" వేడి నీళ్ళున్నాయా అంటూ వచ్చింది.

"లేవమ్మా. మళ్ళీ వెలిగించ పనసించే" అంది రామి చేతులు తుడుచుకుని త్వర త్వరగా లోనికి రాబోతూ.

"నే పెడతాన్లే. నే పెడతాన్లే! నీపని నీవు చూసుకో" అంటూ విజయ లోనికి వెళ్ళింది.

రామలక్ష్మమ్మ గారు విజయ ననుసరించింది ఆదుర్దాగా.

విజయ త్వర త్వరగా మీట నొక్కి హీటరు వెలిగించుతున్నది.

"విజయా?"

"ఏవమ్మా"

"కప్పులూ సాసర్లూ, ఇలా పగిలి పోయాయేమే విజయా?"

విజయ అలంకు పడింది. "ట్రే చెయ్యి జారి పడింది.

మరేం లేదు" అంది సాధారణంగా.

"రోజూ కాఫీ నువ్వే తీసుకుని వెడుతున్నావా? నాయరు ఏమయ్యాడు?"

"ఉన్నాడు. కానీ నేనే పట్టుకు వెడుతున్నాను." కొంచెంసేపు మౌనం వహించింది.

రామలక్ష్మమ్మ గారి హృదయంలో ఏదో అనుమానం! శంక! విజయను ప్రశ్నించడానికి సందేహం!

"విరంజన్ నీతో సఖ్యతగా వుండడం లేదామ్మా?" అంది నెమ్మదిగా జంకుగానే.

విజయ ఉలిక్కి పడింది. ప్రయత్న పూర్వకంగా పెదవుల మీదికి చిఱునవ్వు తెచ్చుకుంది. "లేకేమమ్మా? నీకలా ఎందు కనిపించింది?" అంది ముఖం తిప్పుకుంటూ.

"అయితే .... ఈ కప్పులూ సాసర్లూ?"

"చెయ్యిజారి పడ్డాయని చెప్పాను - అందుకు అనుమానం ఏవిఁటి?" విజయ తలవంచుకుంది.

"రోజూ రోజూ చెయ్యిజారి పడుతుందా?" అని రామలక్ష్మమ్మగారు విస్తుపోయేంతలో విజయ అక్కడి నుండి వెళ్ళి పోయింది.

కాఫీ కప్పు పగిలినా, టిఫిన్ ప్లేటు ముక్కలయినా ఆమె మనసు విల విల లాడిపోయేది. గదిలో ప్రతి అంగుళం మేరా తివాచీ పరచివుంచే రోజూ చెయ్యి జారి పడటం

ఏమిటో, కప్పులూ, సాసర్లూ పగలటం ఏమిటో ఆమెకు అర్థం కాలేదు.

ఆ సాయంత్రం విజయ మెడ బోసిగా వుండటం రామ లక్ష్మమ్మ గారు చూసి ఆశ్చర్యపడింది.

"అదేమిటి విజయా? వట్టి మనిషివి కూడా కాదు. బోసి మెడతో వుంటావా? నగలన్నీ ఏమయ్యాయి?" అంది రామలక్ష్మమ్మగారు మందలింపుగా.

విజయ నిర్జీవంగా నవ్వుకుంది. అనిర్వచనీయమైన ఆవేదన!

"అంత బరువు నేనెక్కడ మోయగలనమ్మా? వాటినన్నింటినీ దాచి వేసేను. మెడలో ఒక గొలుసు వుందిగా చాలు."

రామలక్ష్మమ్మ గారు ఇంకేమీ మాట్లాడలేక పోయింది.

విజయ మెడలో సన్నని మిలమిలా మెరిసే గొలుసు. వేలికి ఒకే ఒక ఉంగరం!

విజయలో కొత్తగా వస్తున్న మార్పేమిటి? అని ఆలోచించేంత తీరిక విశ్వనాథం గారికి లేదు.

నిరంజన్ ముఖం తప్పించుకుని ఎందుకు తిరుగుతున్నా డన్న అనుమానం ఆయనకు కలగలేదు.

రోజులు మామూలుగానే గడుస్తున్నాయి అను కున్నారు ఆయన.

కానీ రెండు రోజుల తరువాత అక్కడికి వచ్చిన మదిర

వాతావరణంలో ఏదో గొప్ప మార్పు వచ్చిందని పసిగట్టింది. అదేమిటో ఆమెకు వెంటనే అర్థం కాలేదు.

విరంజన్ ముఖం చిరచిర లాడుతూ క్రోధావేశాలను కక్కుతున్నది.

విజయ ముఖంలో తెచ్చి పెట్టుకున్న నవ్వు. వ్యక్తిలో నిరాడంబరత. విశ్వనాథం గారిలో యథాప్రకారంగానే చిఱు నవ్వులు. హుందాతనం.

మదిర రాగానే విరంజన్ ముఖం వికసించింది. తన అవమానాన్ని కొంత మర్చిపోయాడు.

విజయభారతికి కొంతభారం దించినట్లయింది. మదిర రాక కొంత శూన్యత్వాన్ని నిశ్శేషం చేసింది.

"కూర్చో అక్కా ఇప్పుడే కాఫీ తెస్తాను," అని మదిరను విరంజన్ వద్ద కూర్చోపెట్టి తాను లోనికి వెళ్ళింది త్వర త్వరగా.

లోన గదిలో విరంజన్, మదిర నవ్వులు, ఎకసక్కాలు.

# 24

ఏ రచనలోనూ విలన్‌ను సృష్టించరాదనీ, వాంప్‌లను ప్రవేశ పెట్టరాదనీ, ఏ పాత్రచేతా కన్నీరు పెట్టించకూడదనీ జీవితం పట్ల ధైర్యసాహసాలూ, శక్తి సంపత్తులూ నూరిపోయాలనీ, అధైర్యాన్ని, పిరికితనాన్నీ తను సృష్టించిన పాత్రలకు దూరంగా వుంచాలనీ, జీవితంపై ఆశావాదం జనింప జేయాలనీ ప్రతి రచయితకూ, ముఖ్యంగా రచయిత్రికీ వుంటుంది. జీవితాన్ని నందనవనం చేయాలనీ, ప్రతి వ్యక్తిజీవికా కోరికల తమకంతో పులకించి ఆశల చివుళ్ళు చిగుర్చుకుని ఆనందాల నవ్వుల పువ్వులు విరిసి అనలు వేసి కొనలు సాగాలని ప్రతి రచయితా రచయిత్రీ ఆశిస్తారు.

కానీ ఇది దుష్ట ప్రపంచం. నికృష్ట వాస్తవికం. స్వార్థపర వ్యక్తిత్వం. ద్వేషపూరిత స్వభావం. అసూయా పూరిత పరిసరం. అహంభావపు నగ్నత్వం. కృతఘ్నతా పూరిత మానవత్వం.

నందన వనంలా విలసిల్ల వలసిన జీవితపు మలుపులలో సౌహార్ద ఛాయపు తరుచ్ఛాయలలో అనురాగపు సుధారస ధారల తమికి, పుట్టలు పెరగడమూ, అందులోంచి విష

పన్నగాలు తల ఎత్తడమూ కద్దు. తమ విషకీలలతో పరిస రాలను కలుషితం చేయడమూ కద్దు.

మదిర రాక విజయకు ఎంతో ఆనందాన్ని కలిగించింది. హృదయ భారంతో క్రుంగిపోతున్న ఇంటిలో నవ్వులను నింపిందికదా అని సంతోష పడింది. ఆ ఆనంద సంభ్రమాల తోనే వికసితవదనయై శ్రే పుచ్చుకుని నెమ్మదిగా నడచి వస్తున్నది.

కానీ విరంజన్ మాటలు ఆమె కాళ్ళకు శృంఖలాలు వేసేయి. మదిర ప్రశ్నిస్తున్నది. విరంజన్ జవాబు చెపుతు న్నాడు. ఇద్దరూ సన్నగా నవ్వుకుంటున్నారు.

మదిర చిన్నగా హెచ్చరిక

విరంజన్ నిర్లక్ష్యంగా దాని త్రోసివేత.

విజయ నిర్వెర బోయింది. ఆమెలో మానవత్వం మీద మిగిలి వున్న గౌరవం ఛిన్నాభిన్నమైంది.

తమ అక్కగా భావించిన ఈ వ్యక్తేనా మదిర ?

మనిషి బాధపడతాడు. కాని ఎన్నిసార్లు బాధపడు తాడు? చస్తాడు. కానీ ఎన్నిసార్లు చావగలడు? తన్ను తాను విశ్వసించలేని విషయాలను ఒకటి, రెండు సార్లు విని నిర్ఘాంతపోయి ఆ తరువాత ఉదాసీనంగా మౌనం వహించు తాడు. మరింత ధైర్యం కలిగిన వ్యక్తి నిర్లక్ష్యంగా చిఱు నవ్వు నవ్వుతాడు. ప్రతీకారస్వభావి కక్ష సాధించుతాడు.

విజయ మాత్రం నిశ్చేష్టయై నిలచిపోయింది.

మదిర నవ్వుకుంటూ బయటికి వచ్చింది. వెనుక విరంజన్ తీయని పిలుపు. ఎదురుగా ట్రే పట్టుకుని కండ్లు మూసుకుని గోడకు చేరగిలబడిన విజయ.

మదిర భయపడింది. విజయ అక్కడే వున్నదని ఆమె భావించలేదు.

"విజయా!" అంది గొనిగినట్లుగా.

విజయలో చలనం శూన్యం. మదిర నెమ్మదిగా ముందుకు వచ్చి విజయను కదిలించింది. కదలిక శూన్యం. విజయ రాతివిగ్రహంలా ట్రే చేతుల్లో పట్టుకొని కొయ్యబారి పోయింది.

"విరంజన్!" కంగారుగా పిలిచింది మదిర.

ఇద్దరూ ఆమెను పట్టి లోనికి చేర్చారు. ముఖం మీద నీళ్ళు చల్లారు. ఇద్దరిలో కంగారు.

విజయ అలా ఎందుకయిందో! తమ సంభాషణ విన్నదేమో!!

మదిర త్వరత్వరగా బయటికి పోసాగింది. విరంజన్ ఆమెను వెనక్కు పిలిచేడు. "నీవు ఎవ్వరినీ పిలవ నవసరం లేదు" అన్నాడు కర్కశంగా.

కాసేపటికి విజయకు మెలకువ వచ్చింది. ఆమెలో ఏదో స్థిర సంకల్పం. పొర విచ్చిపోయిన జ్ఞానోదయం.

మదిర, విరంజన్ ఒకరి ప్రక్కనే ఒకరు నిల్చుని చూస్తున్నారు. "ఏమైంది విజయా? మమ్మతో చెబుదాం

అనుకున్నాను. అన్న వద్దని ఆపుచేసేరు."

విజయ బాధాపూరితంగా నవ్వింది. సూటిగా మదిర కండ్లలోకి చూచింది. ఆమె ప్రక్కనే విరంజన్.

"ఏమైంది విజయా?" మదిర మళ్ళీ అదే ప్రశ్న.

"ఇప్పుడెలా వుంది?" విరంజన్ కఠిన స్వరం.

"ఏమీ కాలేదు. అక్కడికి వచ్చేప్పటికి కండ్లు తిరిగాయి. గోడకు వాలిపోయాను. అపస్మారకత. నాలాంటి వారి కిది మామూలేగదా?" అంది విజయ లేచికూర్చుంటూ.

విజయ చూలాలు అన్న సంగతి జ్ఞప్తికి వచ్చి మదిర స్వస్థురాలయింది. మామూలు కన్న అధికంగా కలుపు గోలుగా తిరిగింది.

విరంజన్ నిప్పులు కక్కుతున్నాడు. ఎత్తి పొడుస్తు న్నాడు. అతనికి కావలసింది డబ్బు! అదే దొరకడం లేదు దొరకక పోవడం కాదు. శాస్త్రిగారు ఎంత మొత్తానికైనా చెక్ వ్రాసి సంతకం చేయించి ఇవ్వడానికి సిద్ధంగానే వున్నారు. అలా చెక్ అవసరం లేదు. క్యాష్ కావాలని చెప్పడం విరంజన్‌కు నామర్దా, అప్రతిష్ఠ.

ఆ మొత్తం విజయ తెస్తే!

విజయ తేదు.

"మీ రేమైనా చేయండి. ఈ డబ్బు విషయాలలో మాత్రం నన్ను ఇరికించవద్దు" అని విజయ స్పష్టంగానే చెప్పింది.

ఈ ఉక్కు కవచాన్ని ఛేదించడం ఎలాగో తెలియక నిరంజన్ తికమకపడుతున్నాడు.

మదిరకు విసుగు కలిగింది. ఈ వ్యవహారం ఇలా తెగకుండా కొనసాగడం తిరిగివేదన కలిగించింది.

"నిరంజన్! వైజాగ్ వెడదాం" అంది ఆశ పెడుతూ.

"నీవు వెళ్ళు. ఈ వ్యవహారం ఏదో తేల్చకుండా నేను రాను" అన్నాడు నిరంజన్. కానీ కుతూహలంగా పడక టింట్లో కూర్చుంటే ఈ వ్యవహారం ఎలా పరిష్కారం అవు తుందన్న జ్ఞానం అతనికి లేదు. విశ్వనాథం గారిని నే నెందుకు అభ్యర్థించాలి? విజయ వెళ్ళి యిన్వార ఏం చేస్తుంది? అన్న అహంకారం. ఇదివరకెన్నిసార్లు అలా పెద్ద మొత్తాల్లో డబ్బు ఇచ్చింది. ఇప్పు డెందు కివ్వదన్నదే పెద్ద దుగ్ధ.

మదిర తిరిగి వెళ్ళి పోవడానికే నిశ్చయించుకుంది. అదే చిత్రం! ఇంతవరకూ మదిర నిరంజన్ ఎప్పుడు వైజాగ్ నుండి వచ్చినా కలసి వచ్చేవారు. కలసి తిరిగి వెళ్ళేవారు. ఈసారి నిరంజన్ ముందు వచ్చాడు. మదిర ఆ వెనుక వచ్చింది. ముందుగ వెడుతున్నది.

మదిర ఇదివరలో వచ్చినప్పుడల్లా అహంకారపు పొరలు స్వాతిశయపు తెరలు మరింతగా పేరుకున్నట్లు కని పించేవి. ఈ సారి విజయ అపస్మారకం అయిన నాటినుండి ఆమె కాటాలని కలుపుగోలుగా వుంటున్నది. పేను పేరునా నరుసలతో అందరికీ 'వెడుతున్నా' అని చెప్పింది.

ఈ 'అప్పగింతలు' జరుగుతున్నంత సేపూ విజయ విస్తుపోయి చూసింది.

"వెడుతున్నా విజయా? నిరంజన్ అన్నతో చెప్పి వస్తానాగు." అంటూ లోనికి పోవసాగింది మదిర. విజయ అనుసరించింది. నిరంజన్ గదిలో లేడు. తన్ను వెన్నంటి వచ్చిన విజయను చూడటానికి మదిర మొదటి సారిగా జంకు పడింది. —

విజయలో అణుచుకోలేని బాధ. ఆమె ముఖంలో వేదన. తన మనసుకు కష్టం కలిగి కాదు; మానవత్వం విచ్ఛిన్నమై అర్థరహితంగా మట్టిలో కలసి పోతున్నందుకు వావి వరుసలకు విలువ లేకుండా పోతున్నందుకు.

"అక్కా!" ఎంతో స్థిర చిత్తంతోనే పిలిచింది.

మదిర విభ్రమతో నిలిచి పోయింది.

"మనిద్దరం ఒకే తల్లి కడుపున పుట్టలేదు. కానీ అక్కా చెల్లెళ్ళకన్న మిన్నగా వుంటున్నాం." విజయ తొట్రుపాటు లేకుండానే మాట్లాడుతున్నది.

మదిర ఒక్క క్షణం నివ్వెరపోయింది. విజయ ప్రసంగం దేనికి ఉపక్రమణికో ఆమెకు అర్థం కాలేదు. మనసులో ఏదో ఒక శంక!

"అవును" హీనస్వరంతో అంది.

"స్త్రీ తను ఆరాధించిన వారితో హృదయాన్ని పంచుకుంటుంది. నమ్మిన వారితో జీవితాన్ని పెంచవేసు

కుంటుంది. కానీ పసుపు, కుంకుమాలలో భాగం పెట్టడాన్ని ఊహించ గలదా ?''

మదిర అదరి పడింది. ఆమె ముఖం జేపురించింది. కందగడ్డయింది. ముక్కు గోళాలు పిచ్చుకున్నాయి.

"విజయా ! ఏమిటి నువ్వంటున్నది ?" అంది. ఆమెలో క్రోధంతో కూడిన కోపం. తప్పించుకొన జూచే బూకరింపు.

విజయ నవ్వుకుంది. "నే నంటున్నది కాదక్కా ! నీవు ఊహించుకుంటున్నది ఏమిటి ? నీవు నాకు అక్కను. నాకు తెలియని పరిస్థితులలో నీకేదైన అన్యాయం జరిగితే నాకు మాట మాత్రం చెప్పవద్దా ?" విజయలో స్థిరసంకల్పం.

తను గుప్పెటలో పట్టిన గుట్టు రట్టవుతున్నదని మదిరకు క్రోధం. ఊహించని ఈ అశనిపాతం ఏమిటి ? తల ఎత్తుకోవడం ఎలా ?

"మీ ఇద్దరికీ మనసులు కలిస్తే మీరిద్దరే ఒకటిగా వుండండి. కానీ అందుకు మనం ఆత్మవంచన చేసుకోవడం. వావి వరుసల్ని అపహాస్యం చేయడం..."

మదిర ఇంక నిలవలేక పోయింది. "నే నెవరికీ అన్యాయం చేయడం లేదు'' అని ముక్కు విరిచి రివ్వున వెళ్ళి పోయింది.

ఎదురుగా నిరంజన్ ఆగమనం. మదిర క్రోధంతో అలా ఎందుకు వెళ్ళి పోయిందో అతనికి అర్థం కాలేదు. అతనిలో అక్కసు.

"విజయా ! ఏమిటి ? ఏమయింది ?"

విజయ మాట్లాడలేదు. ఆమెలో ఏ ఉద్వేగ్నతా ప్రదర్శితం కాలేదు. తను త్యాగం చేయదలచుకున్నా కూడా ప్రతిఘాతాలే ఎందుకు ఎదురవుతాయో అని యోచిస్తున్నది.

"చెప్పవేం ?" నిరంజన్ పిడికిలి బిగించి గర్జించాడు.

విజయ నిట్టూర్చింది. "నిరంజన్! మదిరా నేనూ అక్కా చెల్లెళ్ళలాంటి వాళ్ళం. మా ఇద్దరికీ మధ్య దాగుడు మూతలాడి నన్నిలా హింసించడం మీకేం న్యాయం ? స్త్రీ ఏదైనా పంచుకో గలదు. కానీ మాంగల్యం పంచుకో వడం ఎలా ?"

నిరంజన్ కొయ్యబారిపోయాడు. రహస్యం ఎప్పుడో ఒకప్పుడు బయట పడక తప్పదని అతనికీ తెలుసు. ప్రేమ కలాపాలూ, కామ కలాపాలూ ఎవరయితే మాత్రం ఎంత కాలం గుప్తంగా దాచగలరు ? కానీ విజయ కింత త్వరగా ఈ విషయం తెలుస్తుందని అతను ఊహించుకోలేదు. వారం రోజుల నుండి అతనిలో అణచుకుంటున్న కోపతాపాలు ఒక్కసారి పెల్లుబికి వచ్చాయి.

నిరంజన్ అరిచాడు "అలాగేం ! అయితే సరే. ఇన్ని రోజులనుండి నీవు విశ్వనాథంగారి కూతురుగా వుంటున్నావు గాని నేను కట్టుకున్న భార్యగా కాదు. ఈ ఇంటిమీద, నీ ఒంటి మీద నాకు అధికారం లేనప్పుడు నీ మెడలో నేను కట్టిన మాంగల్యం మాత్రం ఎందుకు ?"

విజయ చెంప ఛెళ్ళుమంది. మాంగల్యం తెగి దూరంగా పడింది. విజయ నేత్రాలలో కన్నీరు.

సోఫాలు దులుపుతున్న రామన్న పరుగెత్తుకు వచ్చాడు. ఆదృశ్యం చూసి స్తంభీభూతుడయ్యాడు. విజయ కన్నీరు ఆపుకుంటూ, చెంప దాచుకుంటున్నది. నిరంజన్ ఆగ్రహం కక్కుతున్నాడు.

"నిరంజన్ బాబూ?" అతనిలో ఆగ్రహం. అతను పనివాడు. నిరంజన్ ఆ ఇంటి అల్లుడు. ఎవరయితే మాత్రం విజయ మీద చేయి చేసుకోవడమా? అతనిలో పెచ్చి ఆగ్రహం. త్వరత్వరగా గర్జించుతూ ముందుకు వచ్చాడు.

విజయ అడ్డుపడింది "తాతా నాకర్మ నన్ననుభవించనీ. ఇప్పటికి రచ్చకెక్కింది చాలు" అని ప్రాధేయపడింది.

కానీ రామన్నలోని క్రోధం అంత త్వరగా చల్లారేది కాదు. గిరుక్కున తిరిగి విశ్వనాథంగారి గదివైపు పరుగెత్తేడు. తను చెయ్యబోతున్న కార్యాకార్య విచక్షణ అతనిలో లేదు. తను ఎత్తిపెంచిన ఆ ఇంటి ఆడపడుచు విజయ చెంపదెబ్బ తిన్నదనేదే అతని దుగ్ధ.

నిరంజన్ కించిత్తు కూడా భయపడలేదు. సంకోచించలేదు.

"ఈ ఇంట్లో నామాట చెల్లినప్పుడే వస్తాను." నిరంజన్ హుంకరించి వెళ్ళిపోయాడు.

విజయ ఏమనుకుందో తెగి దూరంగా పడివున్న మాంగల్యాన్ని తీసి దాచుకుంది. శారీరకంగా బలహీనత. అక్కడే సోఫాలో కూలబడింది.

విశ్వనాథంగారు ఒక్కరే పరుగెత్తుకు వచ్చేరు.

"ఏమిటి ? ఏమిటి ?" అంటూ.

విజయలో మౌనం. ఆమె దేనికీ సమాధానం చెప్ప లేదు. "ఏం లేదు. ఏదో చిన్న మనస్తాపం" అని త్రుంచి వేసింది చేతిలోని మాంగల్యాన్ని వ్రేళ్ళతో తడువుకుంటూనే. ఆమె తల ఎత్తను కూడా లేదు.

విశ్వనాథంగారు వెళ్ళిపోయారు. విజయను ఇంకా తరచి ప్రశ్నించి భార్యా భర్తల విషయాలలో కలిగించు కోవాలని ఆయన తలంచలేదు. నిరంజన్ ఇంత పని చేసేడా అన్నదే ఆయన సందేహం!

రామన్న విజయకు ఆ తరువాత కనుపించలేదు. విశ్వనాథంగారు అతన్ని మందలించి పనిలోంచి తీసివేశారని తెలిసి విజయ నిర్విణ్ణురాలయ్యింది. ఆ కుటుంబ గౌరవాన్ని కాపాడే యత్నంలో అదో భాగం కాబోలు !

# 25

మహానవు డెంత నిజాయితీ గలవాడైనా న్యాయాన్ని నాలుగు పాదాలా నడిపించేంత సద్బుద్ధి వాడికి లేదనడం అబద్ధం కాదు. సంఘం సిద్ధాంతిణ్యాన్ని, శాంతిన్యాన్ని, పీడనను తలవంచి సహించి, మానవత్వాన్ని మొట్టికాయ వేసి కక్ష తీర్చుకున్నట్లే దైవం కూడా అహంకారాన్ని అందలమెక్కించి, అమాయకత్వాన్నీ. నిజాయితీని పాతి పెడుతుంది.

జీవించడానికి అందరికీ హక్కుంది. అంతేకాక శరీరం నిలువెల్లా విషం నింపుకున్న దుష్టులు కూడా నూరు సంవత్సరాలు ఒక్కరోజు కూడా వెల్తి లేకుండా బ్రదికి న్యాయ ధర్మాల్ని తమ నోటిలో వేసుకుని కోరలతో కలాబెలా నములుతున్నారు. కొంతమంది అమాయకులూ, దయా పూరితులూ ముందుగానే ఎందుకు చచ్చిపోతున్నారంటే సమాధానం ఇవ్వగలిగిం దెవడు?

రామలక్ష్మమ్మగారు ఆ ఇంటిలో తిని కూర్చుని పూజా పునస్కారాలు చేసుకోవడం తప్ప మరో విషయం పట్టించు

కోని వ్యక్తి. విశ్వనాథంగారు చేస్తున్న వ్యాపార విషయాలు గాని విజయభాస్కర్ స్వవిషయాలు కానీ ఆమెకు తెలియవు. ప్రతి విషయానికీ ఆశ్చర్యపడటమూ ఆ తరువాత మర్చి పోవడమే ఆమె తత్వం. ఆమె బంధువర్గాల సంగతే ఆవిడకు గుర్తు వుండదంటే విచిత్రం కాదు. ఎవరయినా ఇంటికి వచ్చినప్పుడు ఆప్యాయత వ్యక్తపరుస్తుంది. ఆదరించుతుంది. అంతే. ఆ తరువాత మర్చిపోతుంది. ఆమె అంత అమాయకు రాలు గనుకనే ఆమెను గురించి ఎవ్వరూ పట్టించుకోను కూడా పట్టించుకోరు.

ఆమె ఒకనాడు ఇంటి వెనుక భాగంలో తిరుగుతూ వుండగా చూడక గాజు పెంకుమీద కాలు వేసింది. అది పర్రున చీరుకొని పోయి రక్తం పోయింది. డాక్టరును పిలి చారు. కట్టు కట్టించారు. కానీ అది మానడానికి బదులుగా సెప్టిక్కైంది. ప్రమాదంగా పరిణమించింది.

"నువ్వు కాళ్ళకి చెప్పుల్లేకుండా వట్టి పాదాలతో ఎందుకు తిరుగుతున్నావు?" అని విశ్వనాథంగారు కసురు కున్నారు.

"రావీ, ఆ పగిలిన సాసర్లూ, కప్పులూ బయట పార పోయడానికి బదులు దొడ్లోనే పోశావా?" అని మంద లించారు.

"ఏదైతేనేం, ముంచుకు రావడానికి గాజు పెంకులే కావాలా? కావలసినప్పుడు ఎలానుకాక తప్పదు" అంది

రామలక్ష్మమ్మగారు.

ఆ తరువాత నాలుగు రోజులకు ఆమె కన్నుమూసింది. విజయ కది మరొక ఆఘాతం. ఇంటిలో ఇక ఆమె ఒక్కతే వ్యక్తి. హేమకుంతల ఎప్పుడైనా తోడుగా వుంటుంది.

బంధువులు వచ్చేరు. పరామర్శించేరు. విజయను ఓదార్చారు. విశ్వనాథంగారిని పలుకరించారు. విశ్వాసరావుగారు ఆ పదిహేను ఇరవై రోజులూ అక్కడే వున్నారు. మధుసమ్మ వచ్చిన వాళ్ళందరి దగ్గరా కన్నీరు పెట్టుకుని వాపోయింది. అకాలమరణమే అయినా విశ్వనాథంగారు కర్మకాండలు భారీగానే చేశారు. విమలానంద్ రాలేదు. శ్యామసుందరి అనాహూతురాలుగానే వచ్చి విజయను ఓదార్చింది.

మదిర వార్తల్లో లేదని తెలిసింది.

విశ్వాసరావు తల కొట్టినట్లయింది. అంత ఉపిపలో తన భార్య నిండు నెలలతో వుండగా కొడుకు మానసంపుకు తల ఒంచుకున్నారు.

విశ్వనాధంగారు ఏదో అనుమానంగా "విజయ వంక చూశారు. ఆమె రాతి బొమ్మలా తలవంచుకుని కూర్చుంది తప్ప మాట్లాడ లేదు.

# 26

విజయ ప్రసవ సమయానికి మధురమ్మ అక్కడే వుంది. ఆమే పెద్ద దిక్కు. హేమకుంతల ఆమెను నవ్వించుతూ ధైర్య వచనాలు పలుకుతూనే వుంది.

విశ్వాసరావుగారు ఎప్పటి వార్త లప్పుడు తెలుసుకుంటూనే వున్నారు. ఆయన తిరుపతి స్వామికి మొక్కుకున్నట్లే మగపిల్లవాడు పుట్టేడు. అయితే విజయకు ఆపరేషన్ చెయ్యవలసి వచ్చింది కానీ ఆపద గడచింది.

కానీ విరంజన్ ఏడీ? మదిర ఎక్కడ ?

విశ్వనాథంగారు తంతి ఇచ్చారు. ఇద్దరూ వేసవి సెలవులకు డిపార్ట్‌మెంటల్ టూర్ వెళ్ళారని జవాబు వచ్చింది. విశ్వనాథంగారు మౌనంగా వూరుకున్నారు.

ఒక నెల, రెండు నెలలు, మూడు నెలలు. విశ్వనాథంగారింక ఓర్పు వహించలేక పోయారు.

"విజయా! అస లేం జరిగింది?" అన్నారు కఠినస్వరంతో.

"ఏమిటది ?" అంది విజయ విస్మితురాలై.

"విరంజన్ ఎందుకు రావడం లేదు? మీ యిద్దరి మధ్యా కలిగిన మనస్తాపం ఏమిటసలు ?" విశ్వనాథంగారు మందలించిన స్వరంతో అన్నారు తప్పంతా నీదే అన్నట్లుగా.

విజయ ఖిన్నురాలయింది. ఆమె ఏం సమాధానం చెబుతుంది? తల వంచుకుంది.

"చెప్పవేం? ఈ ఇంటి ముఖం కూడా చూడనంతటి మాటపట్టింపు ఏవిఁటి?"

విజయ లేచి వచ్చింది. ఆమె ఒడిలో పసిగందు దేవీచరణ్. వదనంలో ఆందోళనా రాహిత్యం. గబగబా లోనికి వెళ్ళి బీరువా తెరిచి ఏదో వస్తువు తెచ్చింది.

"మాట పట్టింపు కాదు నాన్నా ఆయనకు వచ్చింది. మనసు పట్టింపు. మీరు విద్యావంతుడనీ, సంస్కారి అనీ అనురాగపూరితుడనీ చెప్పిన విరంజన్, భార్యమెడలోంచి త్రెంచి పోసిన మాంగల్యం ఇదుగో! ఆయనకు కావలసింది మీ సంపద కానీ నేను కాదు."

విశ్వనాథంగారు త్రాన్పడి పోయారు. "ఏవిఁటీ!" అన్నారు దిగ్భ్రమతో.

"అంతేకాదు మదిరా ఆయనా ప్రేమించుకున్నారు. ఒకరొ్నకరు ఇష్టపడుతున్నారు. మధ్యలో నేనేం చెయ్యను. సతీపతుల సంబంధం కావాలని ప్రాకులాడితే వచ్చేది కాదు గదా?" అంది విజయ దృఢంగా. ఆమెలో జంకులేదు. తను చెబుతున్నది తన తండ్రితోనని ఒకింత ఒదిగి వుండాలనే భావం కూడా ఆమెకు లేదు.

విశ్వనాథంగారు తన చెవులను తానే నమ్మలేక పోయారు. విరంజన్ చేసిన అఘాయిత్యానికి కాదు, విజయ

అంత ధైర్యంగా తలఎత్తి మాట్లాడుతున్నందుకు. మదిర వివాహితుడయిన విఠరాజ్‌ను ప్రేమించి ఇష్టపడుతున్నదని తెలిసినందుకు. రెండు నిమిషాలు ఆయన మాట్లాడ లేక పోయారు.

"మదిరా! ఇలా చేసిందా?"

"అవును, మదిరక్క. వాళ్ళిద్దరూ చదువుకున్న వాళ్ళు. సంస్కారులు. వాళ్ళను హెచ్చరించడానికి. నచ్చ చెప్పడానికి నాకేమి కావాలంతు నాన్నా" అని విజయ వెళ్ళిపో సాగింది.

విశ్వనాథంగారు వెనక్కు పిలిచారు. "విజయా, ఎన్ని అడ్డంకులు వచ్చినా వివాహం, దాంపత్యానికి మూలం కాక పోదు. అందుకని మనస్తాపంతో గుండె రాయి చేసు కుంటావా? కుటుంబ ప్రతిష్ఠ, అంతస్తు ఏం కాను?"

విజయ ఆయనవైపు చురుక్కుమని చూసింది. రెండు అడుగులు వెనక్కు మళ్ళింది. "కుటుంబ గౌరవం? నేను మీ అభీష్టానికి వ్యతిరేకం ఎప్పుడు చెప్పేను గనుక ఇప్పుడు చెప్ప గలను నాన్నా. గౌరవ ప్రతిష్ఠలు ఇనుమడించడానికి మీ ఇష్టం వచ్చిన పని చేయండి" అంది విజయ దేవీచరణ్‌ను ఎత్తుకుని గిరుక్కున వెనక్కు తిరిగి వెడుతూ.

# 27

విశ్వనాథంగారు మధురమ్మ దగ్గరకు వెళ్ళేరు.

మదిర అప్పటికే ఇంటికి వచ్చి వుంది. విశ్వనాథంగారు స్వయంగా తన ఇంటికి రావటం చూచి మధురమ్మ ఆశ్చర్య పడింది. అంత పెద్ద కారణం ఏమిటో ఆమెకు అర్థంకాలేదు. విశ్వనాథంగారు ఎప్పుడూ తనకు కబురుచేస్తారుగాని ఇంటికి రారు.

అయినా ఆనందంగానే ఆదరించింది. "మీరు ఇక్కడికి వచ్చి ఎన్ని సంవత్సరాలైందో" అంది కండ్లు ఆర్ద్రం కాగా.

"మదిర నిన్న ఇంటికి వచ్చింది. ఇంతకు ముందే విజ యను చూసి రమ్మని చెప్తున్నాను" అంది మళ్ళీ తనే.

విశ్వనాథంగారు తాపీగా కూర్చున్నారు. కాఫీ తీసుకున్నారు. ఆ కబుర్లూ ఈ కబుర్లూ అడిగేరు. అంతవరకూ మదిర ఆయన ఎదుట పడలేదు. విశ్వనాథంగారు పిలువనూ లేదు. ఈ వింత ఏమిటో మధురమ్మ చూస్తున్నది.

"ఏం మీ యిద్దరికీ మాటలు లేవా యేం అన్నా?" మధురమ్మ పరిహాసం చేసింది.

విశ్వనాథంగారు బరువుగా నవ్వేరు. "ఉన్నాయి కానీ, అదే త్రుంచి వేసుకుంటున్నది" అన్నారు ఉపోద్ఘాతంగా.

"అంటే!"

విశ్వనాథంగారు సర్వ విషయాలూ చెప్పారు. విడమర్చి చెప్పేరు. మధురమ్మ ముఖం నల్లపడగా క్రుంగిపోతూ విన్నది.

"చూశావా నీ కూతురు కూడా విరంజన్ నే ప్రేమించు తున్నది" అన్నారు విశ్వనాథంగారు.

మధురమ్మ ఆ మాటతో రెచ్చిపోయింది. ఆమెలో ఏదో అజ్ఞాత దిశనుండి అణుచుకుంటున్న క్రోధం పెల్లుబికింది.

"అవును నా కూతురే" అంది. ముఖం గంటు పెట్టుకుంది. పొంగుతున్న దుఃఖం.

"మధురా!"

"ఏం ఇప్పుడు నన్ను అనీ, ఎత్తి పొడిచీ ఏం లాభం? నే నెన్ని సార్లు హెచ్చరించినా వినిపించుకున్నారా?" అన్నది. ఆ మాటలలో అసహాయత, ఖిన్నత్వం, తనకు ఎవ్వరూ లేరనే దీనభావం.

"పోనీ నే నంత బాధపడవలసిన అవసరం లేదు. నావిజయ........."

మధురమ్మ ఇంక తనను తన స్వాధీనంలో ఉంచుకొనలేక పోయింది,

"విజయ ఒక్కతే మీ కూతురు. అందుకు మీకు బాధ. మదిర నా కూతురు అందుకని నిర్విచారం"

"మధురా" విశ్వనాథంగారు ఆశ్చర్యపోయారు. ఆమె ఇంత ఆరోపణా గర్భితంగా, నిందాపూరితంగా జవాబిస్తుందని ఆయన ఊహించలేదు.

"నీవు నా మాటలు విశ్వసించడం లేదా?"

"విశ్వసించాను. విశ్వసించే ఈ ఉపద్రవం తెచ్చుకున్నాను. అసహాయంగా నిలచిపోయాను. మీ రింకేం చెప్పనవసరం లేదు. మదిరను నేను మంపలిస్తాను. మీరింక ఈ గడప త్రొక్కకండన్నయ్యా. నేనూ......"

"మధురా ?" ఆశ్చర్యపోయారు విశ్వనాథంగారు.

కానీ ఈ పర్యాయం మదిర ముందుకు వచ్చింది "ఏమిటి బాబాయ్?" అంటూ.

విశ్వనాథంగారు అదిరిపడి చూశారు. తన అహానికి, స్వాతిశయానికి ప్రతిష్ఠకు వరుసగా తగులుతున్న ఈ ఆఘాతాలేమిటో ఆయనకు అంతుపట్టడం లేదు. మాట్లాడలేక పోయారు.

"ప్రేమించడం తప్పా?" అంది నిగ్గదీస్తున్నట్లుగా.

"ప్రేమించడం తప్పు కాదు. పెండ్లి అయిన వారిని ప్రేమించడం సమర్థనీయం కాదు గదా?"

"అయితే నేను విరంజన్‌ను వివాహం కాకముందరే ప్రేమించాను. వివాహం అయిన తరువాత విరంజనే నన్ను

ప్రేమించేడు. ఏం చేయమంటారు?"

విశ్వనాథంగారు విస్తుపోయారు. గొంతు సవరించుకున్నారు.

"అందుకు సాక్ష్యం కావాలా? కావలసినన్ని ఉత్తరాలున్నాయి." మదిర లోనికి వెళ్ళి ఒక కట్ట ఉత్తరాలు తెచ్చి విశ్వనాథంగారి ముందు పడేసింది.

"వీటిలో ఏ ఒక్కదానికీ నేను ప్రోద్బలం చేయలేదు. ఏ ఒక్కదానికీ సమాధానం కూడా వ్రాయలేదు."

"అయితే నాతో మాట మాత్రం కూడా చెప్పలేదెందుకని ?" అన్నారు విశ్వనాథంగారు నేరారోపణగా.

మధురమ్మ గుడ్లప్పగించి చూస్తూ వారి సంభాషణ వింటున్నది.

"నేనేనా మాట మాత్రం అనవలసింది ? విజయ వివాహం నిశ్చయం చేయడానికి ముందర మీరు వాల్తేరు వచ్చారు. విరంజన్‌ను కలుసుకున్నారు. నాతో మాట మాత్రం అయినా అన్నారా ? అప్పటికి విరంజన్‌కు నాకు పరిచయం వున్నదన్న విషయం మీకు తెలియదా ? ఫలాని రోజున వివాహం అని ఇచ్చినవైరు తప్ప పెండ్లికొడుకెవరో కూడా నాకు ముందుగా తెలియనిచ్చారా.... ?

"అయితే నీ చెల్లికి నీవు ద్రోహం తలపెడతావా ?" విశ్వనాథంగారు చిట్టచివరి అస్త్రాన్ని ప్రయోగించారు.

మదిర బుస్సుమని బుసలు కొట్టింది. "ఎవరిది మోసం?

విజయను విరంజన్‌కు లంచంపెట్ట జూచారు. విరంజన్ ఆస్తి కాళపడ్డాడు. అతన్ని కూడా మీ అక్కౌంట్లలో ఇరికించుకో జూచారు. అతనికి కనువిప్పయింది. నన్ను ప్రాధేయపడ్డాడు. నే నెందుకు త్యాగం చేయాలి? మేం ఇద్దరం వివాహం చేసుకోబోతున్నాం" అంది కుండ బ్రద్దలు కొట్టినట్లు.

"మదిరా?" అని కోపంగా అరిచారు విశ్వనాథంగారు.

ఈ సారి మధురమ్మ ముందుకు వచ్చింది.

"ఇక చాలన్నయ్యా! అన్ని విషయాలూ తేటతెల్లం గానే తెలిసి వచ్చాయి. విజయను విరంజన్‌కే ఎందు కిచ్చారో కూడా తెలిసింది. ఇంక ఈ చర్చ చాలు. కాలు జారిన స్త్రీ ఆ కాలు విరగకుండానూ, బెణకకుండానూ వుండాలనే శతధా ప్రయత్నించుతుంది. ఇంతవరకూ మదిరను మీ కన్నకూతురిలా చూసుకున్నందుకు కృతజ్ఞత. ఇంక వెళ్ళండి" అంది కఠిన స్వరంతో.

విశ్వనాథంగారి శరీరం జలదరించింది. ఆయన గుండెలు కలుక్కు మన్నాయి. ఖిన్నవదనంతో అలాగే ఇంటికి తిరిగి వచ్చారు. ఆయన జీవాల్ని క్రుంగదీసిన ప్రథమ పరాజయం ఇదే. మదిర, విరంజన్ వివాహం చేసుకుంటే? తన కాగితాల నన్నింటినీ ఒకసారి సరిచూచుకున్నారు.

వదనంలో కళ తప్పింది. రక్త ప్రసరణలో పోటు హెచ్చింది. గుండెలు క్షణ క్షణానికి కలుక్కుమంటున్నాయి. ఉండి ఉండి రక్తం పడసాగింది. డాక్టరు వచ్చేడు.

ఇంతలోనే ఇలా ఎందుకు ముంచుకు వచ్చిందో అని డాక్టరు ఆశ్చర్యపడ్డాడు.

నరాల ఉద్రిక్తత, రక్తపోటు, నోటినుంచి రక్తం పడడం, ముఖం కళతప్పడం, శరీరం చెమట్లు కమ్మటం అనేక లక్షణాలు ఒక్కసారి ముంచుకు వచ్చి డాక్టరునే కంగారు పెట్టేయి.

అందరికీ కబుర్లు పెట్టేరు. ఎవ్వరూ రాకుండానే, ఎవరికీ ఏమీ చెప్పకుండానే విశ్వనాథంగారు కడసారి నిశ్వసించేరు. కడకు విజయభారతి వంక కన్నెత్తి చూడటానికి కూడా ఆయనకు ధైర్యం చాలలేదు.

తను నిర్మించిన పాలరాతిభవనం వైపుకు అలానే నిలువు గుడ్లువేశారు.

ఈ కబురు తెలిసే సమయానికి విశ్వాసరావుగారు వినాయకరావుతో చదరంగం ఆడుకుంటున్నారు. ఆయన జంతువులు, బంట్లు ఒక్కొక్కటీ నిశ్శేషం కాసాగాయి. ఆయన కళ్ళల్లో వినాయకరావు జంతువులను, మంత్రి పావును తినడానికి తెగించి బలగంలో ప్రవేశించుతున్నారు.

వినాయకరావు పకపకా నవ్వేడు.

"విశ్వాసరావుగారూ మీరు నా బలగాన్నంతా నిశ్శేషం చేయండి. అయినా మీ ఆట కట్టించడానికి నాకు రెండు బంటు పావులు చాలు" అన్నాడు.

"అదెలా" అన్నారు విశ్వాసరావుగారు.

"అది అంతే కొత్త అట !" అన్నాడు వినాయకరావు.

సరిగా అదే సమయానికి విశ్వనాథంగారి మరణవార్త అందింది. తన సినిమా థియేటర్లు, పెట్టుబడి గాలికెగిరి పోయి నట్లుగా గగ్గోలు పడ్డారు. వినాయకరావు వంక చూచారు.

"వెళ్ళండి. ఇప్పుడిక మీరు లేకుండా ఎలా?" అన్నాడు వినాయకరావు నవ్వుతూ.

విశ్వాసరావు వెళ్ళేడు. ఆయనకు సర్వమూ నిమిషాలమీద తెలిసిపోయింది. విరంజన్ మీద దురాగ్రహం. తన మీద తనకే అక్కసు. కొడుకు వ్యవహారం అంతా తల్లక్రిందులు చేసేడని దుగ్ధ.

కానీ వాస్తవ పరిస్థితి వెల్లడైంది. ఆయన మెదడు తుపాకి మందులా భగ్గుమంది. వ్యక్తి నిలువునా కొమ్ము తూటాలా మండిపడ్డాడు.

# 28

కులీన కుటుంబాలలో మనశ్శాంతి లేక చస్తారంటే చస్తారు. అసలా జీవనమే ఒక సున్నపు బట్టీ లాంటిది. అంత రంగికంగా అగ్ని కుమిలి, కుమిలి రగిలి జీవాన్ని హరిస్తుంది. ఆ కులీనత్వాని కున్న కృత్రిమ పరువు, ప్రతిష్ఠ ఆ అగ్ని

చుట్టూరా గోడగా నిలిచి అభేద్యమని భ్రమింప జేసే ఆకారం ఏర్పడుతుంది.

దేన్నీ ఛేదించలేక, ఎన్నో వ్యక్తిత్వాలు మంచిని మరచిపోయి మర్యాదను కాపాడుకోవడాని కనుకుంటూనే గడ్డి తింటాయి. అజీర్తి చేస్తుంది. ఎప్పుడో ఒకప్పుడా అజీర్తి బయటపడి పొట్ట చెక్కలై ఆ తిన్న గడ్డి బయటపడుతుంది. పరువు, ప్రతిష్ఠలే పునాదులుగా నిర్మితమైందనుకున్న ఆరంత స్తుల భవనమూ అరక్షణంలో విరుచుకుని పేక మేడలవలే కూలిపోతుంది. అంతవరకూ ఆ భవనాన్ని దేదీప్యమానంగా వెలిగించిన వింత కాంతులు గుప్పున ఆరిపోయి చిక్కని చీకటిని కుప్పలు, కుప్పలుగా త్రవ్వి పోస్తాయి. అప్పటి వరకు ఏదో ఒక మూల దూలాలను వ్రేళ్ళాడుతున్న గబ్బిలాలు కూడా రెక్కలు దులపరించుకుని అదృశ్యమవుతాయి.

విశ్వనాథంగారు వ్యాపారం చేసేరంటే చేసేరు. థియేటరు మీద థియేటరు కట్టారు. లక్షలు, లక్షలు తిప్పేరు. ఆయన పలుకుబడి, ప్రతిష్ఠ గోగువూచల దివిటీలా భగ్గుమని వెలిగింది. ఆ దివిటీని పుచ్చుకున్న విజయభారతి రెండు చేతులూ రక్తపు ముద్దలై ఆమె ఓర్పును, నిజాయితీని, చిత్త శుద్ధిని, పావిత్ర్యతను పరీక్షకు పెట్టింది. దిగ్గున వెలిగి ఆరిపోయిన ఆ దివిటీ బూడిదను కాస్తా ప్రోగుచేసి ఎత్తి తలాకాస్తా పంచవలసిన భారం విజయ వహించవలసి వచ్చింది.

చెరువు ఎండి చేపలు బయట పడినట్లు విశ్వనాథంగారి

కీర్తి కాంతులు ఇంకి, నత్త గుల్లలు బయట పడ్డాయి. విశ్వనాథంగారు మరణించిన నాటికి ఆయన ఏడు థియేటర్లు నిర్వహించుతున్నారు.

అందులో రెండు విశ్వాసరావుగారి పేర వున్నాయి. ఆ థియేటర్ల మీద మేనేజరుగా ఒకరికి తెలియకుండా ఒకరి దగ్గర పుట్టించిన అప్పు ఆరు లక్షలు తేలింది. అది విని విశ్వాస రావుగారు పక్షవాతం వచ్చినట్లయి కుర్చీలో కూలబడి, కాళ్ళు చాచి తేలగుడ్లు వేశారు.

మిగతా థియేటర్లలో రెండు దేవీచరణ్ పేర వ్రాశారు. అవి నిర్మించిన స్థలాలు రామలక్ష్మమ్మగారి పేర వున్నాయి. కాబట్టి ఆ స్థలం విజయభారతికి సంక్రమిస్తుంది. ఆ స్థలంలో నిర్మితమయిన థియేటర్లు మాత్రం దేవీచరణ్‌వి — అందుకు విజయ సంరక్షకురాలు.

మిగిలిన మూడు థియేటర్లలో ఒకటి పది సంవత్స రాలు లీజుకు తీసుకున్నది. విశ్వనాథంగారి కింకా దానిమీద రెండు సంవత్సరాలు హక్కులున్నాయి. దాన్ని తిరిగి వేలం పెట్టినా లక్ష రూపాయలకు మించి రావడం కష్టం!

ఇతర రెండు థియేటర్లలో ఒకటి పక్కా థియేటరు. ఒకటి ఎందుకూ పనికిరానిది.

వీని మీద ఋణాలు కొండవీటి చేంతాడంత పొడవున తేలాయి. బ్యాంకుల్లో వాడిన ఓవర్ డ్రాఫ్టు లక్షన్నర రూపాయలు వుంది. భవనాల కట్టడానికి అర్బన్ బ్యాంకులో

నాలుగు లక్షలు అప్పుతెచ్చారు. ఎప్పుడు ఎలా గంగలో మునిగినా ఈ అప్పులు రెండూ తీర్చకుండా చిల్లిగవ్వ బయటికి పోవడానికి వీల్లేదు. అనామతుస విశ్వనాథంగారి పేర వ్రాసిన క్రెడిట్ రెండు లక్షలుంది. ఆ పైన నాలుగు లక్షలకు విశ్వనాథంగారే స్వయంగా వ్రాసిన ప్రోనోట్లు సాక్ష్యం వున్నాయి. ఆ పైన విశ్వాసరావుగారున్నారు.

విశ్వనాథంగారికి ఇంత అప్పు రెండవ కంటికి తెలియకుండా ఎలా పుట్టిందంటే ఆశ్చర్యం చెందనవసరం లేదు. ఆంధ్రదేశంలో ఓ దుష్ట ఆచారం వుంది! విచ్చలవిడిగా డబ్బు ఖర్చుపరిచి కళ్ళు జిగేలు మనిపించగల వాడికి పరిమితి లేకుండా ఋణం పుడుతుంది. వాడు చేతులెత్తేస్తే నెత్తిన నీళ్ళకుండ పెట్టుకొనే వాళ్ళు పెట్టుకుంటారు. అది వేరూ, సంగతి.

కనుకనే "నోటు వ్రాయండి" అని అడగకుండానే అప్పులిచ్చేరు. స్టేట్ బ్యాంకులో డబ్బు డిపాజిట్ చేయడం కన్న ఆయన వద్ద కుదవబెట్టడమే మెరుగనుకుని ఆయన అడగకుండానే డబ్బు తెచ్చేరు.

డబ్బు తెచ్చిన వాడికల్లా విశ్వనాథంగారు నోటువ్రాసి పడేసేరు. వడ్డీ ముందుగానే ముఖాన కొట్టేరు. వచ్చిన ప్రతి వ్యక్తికీ ముప్పూటలా సంతర్పణ చేసేరు. జమా ఖర్చులు అవసరం లేని నిత్యాగ్నిహోత్రం నడచింది. ఫలితంగా పేరూ ప్రతిష్ఠ, ఋణం కూడా ఎవరెస్టు శిఖరంలా పెరిగాయి.

బ్యాంక్ ఏజెంట్లు లబలబలాడుతూ పరుగెత్తుకొని వచ్చేరు. ఋణదాతలు బారులు తీరి నిల్చున్నారు. ఒకదాని వెనుక ఒకటి విషపూరిత ద్వేషాగ్ని బాణాల్లా కోర్టు నోటీసులు జారీ అయ్యాయి. విశ్వాసరావుగారు ఆల్సేషియన్ కుక్కలా తన థియేటర్ల చుట్టూరా పిచ్చిగా తిరిగి ఆగ్రహ పరవశు డయ్యాడు.

విజయ అవమానంతో కుంగిపోయింది. హృదయం శూలాలతో గుచ్చినట్లయింది.

సిగ్గుతో కుంచించుకుని పోతూనే ఇనప్పెట్టె తెరిచింది. అందులో అంతా శూన్యం! రామలక్ష్మమ్మగారి బంగారపు నగలు రెండు పందల యాభయి నవర్సులు వుండాలి. అదంతా ఎప్పుడు హుళక్కి అయిందో! పెట్టె అంతా గాలించినా అందులో చిన్న మెత్తు బంగారపు వస్తువు కూడా కంటపడ లేదు. కాగా అన్నింటికన్న క్రింది అరలో మధురమ్మగారి యౌవ్వనం నాటి ఫోటో మాత్రం వుంది. విజయ నిర్విణ్ణురా లయింది. ఆమె తల బాదుకున్నా ఆ ఫోటోకు అర్థం తెలిసి రాలేదు.

"ఋణం నిశ్శేషం చేయకుండా ఒక్క పైసా కూడా మిగుల్చుకోను. మీ రెవ్వరూ భీతిచెంద నవసరం లేదు. ఉన్నది తలాకాస్తా తీసుకోండి. ఇందులో ఏ ఒక్కరికీ అన్యాయం జరగడానికి నే నొప్పుకోను" అంది విజయ కృతనిశ్చయంతోనే.

ఇది విని విశ్వాసరావుగారు, విరంజన్ శరవేగంగా వచ్చి పడ్డారు.

విశ్వాసరావుగారు కుపితులయ్యారు. తనకు జరిగిన మోసానికి, ఘోర పరాభవానికి అతని గుండెలు కుతకుతా ఉడికిపోయ్యాయి.

"ఇందులో రెండు థియేటర్లు దేవీచరణ్ పేర వున్నాయి. వాడికి నీవు సంరక్షకురాలివి. అసలు అవి నిర్మించిన స్థలాలు నీవి. వాటిమీదికి వ్యాజ్యానికి రావడానికి ఎవ్వరికీ హక్కు లేదు. ఇందులో చీపురు పుల్లకూడా కదలడానికి వీల్లేదు" అన్నారు విశ్వాసరావుగారు.

విజయ తల వంచుకుంది. కానీ ధైర్యం చెడలేదు. పాప పర్వతంలాంటి మేరు పర్వతాన్ని శిరసావహించడానికి ఆమె నిరాకరించింది.

"మా నాన్న సంపాదించిన భాగ్యంతో పాటు, ఋణానికి కూడా వారసురాల్ని నేనే. ఈ పాపభారం కించిత్తు కూడా మిగల్చను" అంది నిష్కర్షగా.

"దీన్నంతా బంగారమని నమ్మి లక్షలు చేరవేసేను. చివరికి నా స్వంత థియేటర్ల మీద ఆరు లక్షల అప్పు తేలింది" అని విశ్వాసరావుగారు కుమిలిపోయారు.

"నేనూ అది బంగారమనే నమ్మేను. కానీ ఇప్పు డది ఇత్తడయింది. స్వార్థం మంచిదే గాని, విశ్వాస ద్రోహం అంతకన్నా చెడ్డది" అంది విజయ జంకులేకుండా.

విశ్వాసరావుగారీ మాటవిని గుండెలు బాదుకున్నారు. భయపెట్టేరు. బెదిరించేరు. "ఈ వ్యవహారం అంతు తేల్చుకోక పోతే నేను విశ్వాసరావునే కాదు" అని హుంకరించేరు. విరంజన్‌ను రెచ్చగొట్టి ఎగద్రోలారు.

విరంజన్ "నీవు నా భార్యవే కాదు" అని విజయ మెడలోని మాంగల్యాన్ని పుటుక్కున త్రెంచి తుపుక్కున ఉమిసి వెళ్ళిపోయాడన్న విషయం విశ్వాసరావుగారికి గుర్తు రాలేదు.

మదిర ఇప్పటికీ విరంజన్‌కు పెళ్ళికాని పెళ్ళాంలా చెలామణీ అవుతూందన్న విషయం స్మృతిలో లేదు.

దేవీచరణ్ పుట్టిన తరువాత విరంజన్ ఒకసారి అయినా 'బాబూ' అని పిలవలేదన్న విషయం ఆయన తలంచలేదు.

"విరంజన్ దేవీచరణ్ నీ కొడుకు. వాడి ఆస్తి ఒక్క చిల్లిగవ్వ కూడా పోనివ్వకు" అని ప్రోద్బలం చేసేడు.

విరంజన్ రంకెలేస్తూ వచ్చేడు. "దేవీచరణ్ వారసత్వపు ఆస్తిమీద నీ పెత్తనం ఏమిటో చూస్తాను" అన్నాడు బెదిరింపుగా.

విజయకు ఉవ్వెత్తున దుఃఖం పొర్లివచ్చింది. ఆమె నీలి కన్నులే నీలిమేఘాలయి వర్షించేయి.

"మీ రెలా చేసినా తలవంచాను. నన్ను మీరేమైనా చేయండి. కానీ దేవీచరణ్ భవిష్యత్తును పాడుచేయవద్దు. వాడి జీవితం కుక్క చింపిన విస్తరి కావడం నా కిష్టంలేదు" అని

వలవలా దీనంగా దుఃఖించింది విజయ.

విరంజన్ హుంకరించాడు. "హు! నే చెప్పినట్లల్లా చేసేవేం? అయితే దేవీచరణ్ పేరనున్న ఆస్తి వేరుగా పెట్టి మిగిలినది ఋణదాతలకు పంచు" అన్నాడు నిర్దాక్షిణ్యంగా.

విజయ అంత దుఃఖభారం దులిపివేసుకుని నల్లత్రాచులా లేచింది. "ఆ పని మాత్రం నా వల్లకాదు. పెంపొందిన జీవితాన్ని పెద్దలు పాపపంకిలం చేసుకున్నారు. అవయవాలను, ఆలోచనలను ప్రోదిచేసుకుంటున్న వయసులో వాడినయినా జీవితాన్ని పవిత్రంగా ప్రారంభించనివ్వండి" అంది స్పష్టంగా.

విరంజన్ ఒక్క మూలుగు మూలిగాడు వికృతంగా. "అసలు నా కొడుకు మీద నీ పెత్తనం ఏమిటి— చూస్తాను?" అన్నాడు.

విజయలో సహనం చచ్చిపోయింది. ఆమె నీలి కన్నులలో కన్నీరింకి కండ్లు ఎర్రనయ్యాయి.

"దేవీచరణ్ మీ కొడుకా?" అంది అగ్నిపర్వతం ప్రజ్వలించినట్లుగా.

విరంజన్ భ్రమాస్పడి కొయ్యబారిపోయాడు. విజయలో ఆగ్రహావరవశత్వాన్ని చూడటం అదే ప్రథమం! కానీ అది పాపపంకిల హృదయం. దానికి పశ్చాత్తాప భావం లీలామాత్రంగా ఏర్పడినా తామరాకు మీద నీటిబొట్టు వలే అది జారిపోతుంది.

"కాక?" అన్నాడు దుశ్శాసనుడిలా.

విజయ గట్టిగా నవ్వింది వికృతంగా. లేచి నిల్చుంది. "బంధాలు అనుబంధాలు, అంతరాత్మలు వున్నవారికి. అనురాగానికి ఆర్థికసంపదే కారణంకాదు విరంజన్ ? నీవా తండ్రివి? పసిబిడ్డను పెంచి, పోషించి జీవన వికాసానికి కారకుడయ్యే వాడు తండ్రి ! ఇంతవరకు నీ కా సంగతి జ్ఞప్తిలోనే లేదే? నీ వెన్నటికీ తండ్రివి కాజాలవు...." విజయ గుండెలు కలుక్కుమన్నాయి. గుండెల్ని చేతితో పట్టుకుని నేలమీద వెల్లకిలా పడింది. బాధ తెరలుగా, అలలుఅలలుగా ఆమెను కదిలించింది.

మానవుడిలో కరుణ వుంటే ఏదో ఒక క్షణంలో అది అతని కాఠిన్యాన్ని చీల్చుకుని బయటపడుతుంది. విరంజన్ మాత్రం కటికవాడిలా విజయను ప్రక్కకు నెట్టివేసి "అదే కోర్టులో తేల్చుతాను" అని వెళ్ళిపోయాడు. అది శిలా హృదయం ! గులాబీల స్పర్శకు, నిట్టూర్పుల వేడికి, బాధలోని తపనకు, దానిలో చలనలక్షణా లేవీ ప్రదర్శితం కావు.

# 29

విరంజన్ క్షణాలమీద విజయ పైన దావా తెచ్చేడు. పదిలక్షల రూపాయల ఆస్తిని, ఒక స్త్రీ ఆదర్శం కోసరం కరుణతో వదులుకోవడానికి అతను ఇష్టపడలేదు.

"దేవీచరణ్ నా స్వంత కొడుకు. రెండు సినిమా

థియేటర్లు అతని ఆస్తి! ఆ స్థిరాస్తిని విజయభారతి ఆదర్శాల కోసమని అన్యాక్రాంతం చేయబోతున్నది!! కాబట్టి తన కొడుకును తన కప్పగించి ఆ ఆస్తి మీద సంరక్షణ భారం తన కప్పగించాలి!!!" ఇది విరంజన్ కోర్టులో పడవేసిన దావా.

విశ్వాసరావు ప్రతీకార భావంతో క్రుద్ధుడయి మీసం దువ్వేడు. "చూస్తాను ఈ ఆస్తి ఎక్కడికి పోతుందో?" అన్నాడు.

ముం దీ ఆస్తి చేజిక్కించుకో! మదిరే కాదు. మదిర లాంటి మదగత్తెలు నీ ముందు బారులుతీరి నిలుస్తారు. ఇంత నమ్మకద్రోహమా! తిక్క టక్కున కుదిర్చేవు" అన్నారు విశ్వాసరావుగారు.

విజయ కుమిలిపోయింది. తను న్యాయస్థానం బోనులో నిల్చుని వాదించాలా? మనిషి నిలువునా నీరయిపోయింది. ఆమెలోని సంస్కారం మొట్టికాయ తింది.

అవమానాన్ని, సిగ్గును, లజ్జను, విడిచి విరంజన్‌ను వేడుకుంది. ప్రాథేయ పడింది. పాదాలు పట్టుకుంది.

"మంచిగానో, చెడ్డగానో మనబాంధవ్యాని కీ బిడ్డ స్మృతిగా నిలిచి వున్నాడు. వాడిని మాతృవిహీనుడ్ని చేయాలంటే అలాగే చేయండి. అందుకు అంతరాత్మలు, ఆంతర్యాలూ లేనట్లు న్యాయస్థానా లెందుకు?" అంది దేవిని విరంజన్ కప్పగించ ఉద్దేశించి.

విరంజన్ కస్సుమని లేచి, తారాజువ్వలా నిప్పులు

రాల్చి చీదరించుకున్నాడు. అతనిలో దుస్సాహస దురాశ చిమ్మికుని ఎగసి వచ్చింది.

"అయితే దేవీ చరణ్ సంరక్షణ సంగతేమిటి?" అన్నాడు నిరంజన్.

"ఆస్తి సంగతి ముందుచెప్పు" అన్నారు విశ్వాసరావు గారు.

విజయ ఆశ కూలిపోయింది. "ఈ విషయంలో నేను చెప్పగలిగింది ఏమీలేదు. విశ్వనాధంగారు అందర్నీ మోస గించేరు. అందరికీ నమ్మకద్రోహమే చేసేరు. అందరినీ నష్ట పరిచేరు. అందరికీ జీవితాలకు ఉరిత్రాళ్లు సిద్ధపరిచారు. ఇందులో బాంధవ్యాలూ, సాన్నిహిత్యాలూ లేవు. నేనెవరికీ నమ్మక ద్రోహం కలిగించను. ఆత్మ వినాశం కన్న ఆత్మ వంచన చెడ్డది." విజయ దేవీచరణ్‌ను ఎత్తుకుని వెనుదిరిగి చూడ కుండా వచ్చేసింది.

విశ్వాసరావుగారు పండ్లు పటపటా కొరికారు. ద్వేషం లావాలా కుతకుతా ఉడికింది.

న్యాయస్థానంలో విచారణ ప్రారంభమయింది.

తన కొడుకు దేవీచరణ్‌కు జరుగుతున్న అన్యాయా నికి నిరంజన్ కోర్టులో వలవలా విలపించాడు.

"అసలు నిజంగా దేవీచరణ్ మీద నీ కింత ప్రేమ వుందా? నీవు దేవీచరణ్‌ను ఎప్పుడైనా ఎత్తి ముద్దాడేవా?" అన్నాడు ప్లీడరు.

"వాడు లేకుంటే నాకు జీవితమే లేదు. నాకు వాడు ఒక్కగాని ఒక్క కొడుకు" అని బొంకేడు.

"నీవు విజయ మెడలోని మాంగల్యాన్ని త్రెంచి దూరంగా పారవేసిన విషయం నిజంకాదా ?" అని ప్రశ్నించాడు ప్లీడరు.

"కుండ ఓడు పోయిన తరువాత పగులగొట్ట వలసిన అవసర మేమిటి ?" అని కండ్లతోనే ఆ ప్రశ్నను వారించింది విజయ.

"మదిర నీకు పెళ్ళికాకుండానే పెళ్ళాంలాగా చలామణి అవుతున్న విషయం కాదనగలవా ?" అని ప్రశ్నించేడు విజయ తరపు వకీలు.

"కానే కాదు. ఆమె నా సోదరిలాంటిది" అన్నాడు నిరంజన్ నిస్సందేహంగా.

కొండంత అబద్ధ మాడుతున్న దుష్ట మానవుణ్ని చూచి వకీలు కూడా నిర్విణ్ణు డయ్యాడు. న్యాయస్థానంలోని యావత్తు ప్రజానీకం నిర్ఘాంతపోయింది.

తన మనుమడి కన్యాయం జరుగుతుందని విశ్వాసరావు ముక్కు చీదుతూ న్యాయస్థానంలో దొంగ ఏడుపులన్నీ ఏడిచేడు.

"ఇప్పటికీ మీ ఇంటిలోనే వున్న మదిర మీ కేమవుతుంది ?" అన్నాడు వకీలు.

"ఆమె నా స్వంత కూతురు లాంటిది. ఆమెకు నేనే

చదువు చెప్పించాను" అన్నాడు స్థిరంగా నిల్చుని.

జడ్జీ కూడా ముఖం తిప్పుకున్నాడు. విజయ వంచిన తల ఎత్తకుండా అలాగే నిలిచివుంది.

విజయ చెప్పదలచుకుంది చెప్పింది.

''దేవీచరణ్ విరంజన్‌గారి కొడుకే. విశ్వనాథంగారి ఆస్తులు, అప్పులు ఇవి. న్యాయశాస్త్రం నిర్దేశించిన రీతిగా తీర్పు చెప్పండి" అంది న్యాయాధికారి నుద్దేశించి.

విచారణ సమాప్తమైంది. జడ్జీ తీర్పు ఇచ్చేరు.

"దేవీచరణ్ పసివాడు. అయినా అతను విరంజన్ పుత్రుడు. కనుక అతని సంరక్షణ భారం విరంజన్‌కే చెందుతుంది. ఆస్తి విషయంలో న్యాయస్థానం చెప్పగలిగింది ఏమీ లేదు. విశ్వనాథంగారి వ్రాత కోతలను మార్పుచేసేందుకు ఎవ్వరికీ హక్కు లేదు. ఈ విషయంలో విజయభారతికి పూర్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యా లున్నాయి.

విరంజన్ ముడుచుకుని పోయాడు. విశ్వాసరావుగారి ముఖంలో ఎర్రని రక్తం గూడు కట్టింది. తనది అవుతుం దనుకున్న ఆస్తి యావత్తూ అప్పుల క్రింద అదృశ్య మవుతుందని ఆయన భావించలేదు. అయినా అయింది.

ఆయన ఒక ఛీంకారం చేసేరు. "ఈ ఆస్తి మైనరయిన దేవీచరణ్‌ది. దేవీ మేజరయిన తరువాత ఈ ఆస్తి క్రయం చేసుకున్న వాడి అంతు తేల్చుతాను" అన్నారు.

విజయ ఛీత్కరించింది. అభయమిచ్చింది, "వాడు

పెరిగి పెద్దవాడయిన తరువాత వాడి కీ మాత్రం సమాధానం చెప్పుకో లేకపోతే వాడు నా కొడుకూ కాదు, నేను వాడి తల్లినీ కాదు" అంది విజయ కోర్టులో నుంచి బయటికి వస్తూ. ఆమెలో ఏదో వెర్రి ఆవేశం. అపూర్వసాహసం. న్యాయ జిజ్ఞాస.

అప్పటికి సూర్యాస్తమయ సమయమైంది. ఆకాశాన ఎర్రని మబ్బులు, వెలవెల పోతున్న చుక్కలు. ఆలస్యంగా గుప్పుమని అప్పుడే అక్కడక్కడా వెలుగుతున్న విద్యుద్దీపాలు.

విజయ కోర్టునుండి ఇంటికి వచ్చింది. హేమకుంతల ఆమె ననుసరించింది. సహాయం చేసింది. సానుభూతి పలికింది.

కానీ విజయలో ఆ అవసరం అంతగా వ్యక్తం కాలేదు. ఆమెలో కుతకుతా ఉడుకుతున్న యోచన ఒకటే! పాప పర్వతం పెరిగినట్లు పెంచి కట్టిన విశ్వనాథంగారి ఆరంతస్తుల భవనాన్ని పునాదులతో సహా త్రవ్వి నామరూపాల్లేకుండా చేయాలి.

ఉదయమైంది. ఋణదాతలు బారులు తీరి నిల్చి వున్నారు. విజయ పరిస్థితి అంతా విడమర్చి చెప్పింది. "మొత్తం ఏడు సినీమా థియేటర్లు. ఇందులో రెండు విశ్వాసరావుగారు స్వంతగా కొనుక్కున్నవి. వాటిమీద ప్రత్యేకంగా అప్పులు వున్నాయి. మిగిలినవి విశ్వనాథంగారు అప్పుల పేక మేడల మీద కూర్చిన సంపద. అయిదు సినీమా థియేటర్లు

ఒక యిల్లు. వీటిని వేలం పెట్టవలసిన అవసరంగానీ, మిగల్చ వలసిన అవసరం గానీ లేదు. మీరు న్యాయమని భావించిన వెల కట్టి ఋణాలు చెల్లు వేసుకోండి" అంది.

ఋణదాతలు ఆమె ధర్మబుద్ధికి ఆశ్చర్యపోయారు. న్యాయంగానే వెల కట్టారు: పంపకాలు చేసుకున్నారు. అందరి బాకీలు పువ్వులలో పెట్టి ఇచ్చి నట్లయింది. విశ్వనాథం గారి బాకీ క్రింద కొంత మొత్తం డ్రాఫ్టుద్వారా పంపబడింది.

అందులో ఓ ఋణదాతకు జాలికలిగింది. కరుణ పర్పడింది. హృదయం తరుగుకొని పోయింది.

సర్వ సంపదలు, సౌభాగ్యాలను అనుభవించిన ఆడ కూతురు తన ఆస్తినంతనూ బయటపెట్టి, తను ఓ గోడ నీడను నిలబడి 'ఎవరి కెంత రావాలో పంచుకోండి' అనడంతోనే నిర్దాక్షిణ్యంగా ఆమెకు చిల్లి గవ్వ లేకుండా పంచివేసుకొని ఆమెను అనాధను చేయడమా ?

ఆమె చిత్త శుద్ధికి, త్యాగనిరతికి, న్యాయవర్తనకు ప్రతిఫలం నిరాశ్రయ కావడమేనా ? కాదనిపించింది.

"ఎంత కాదన్నా స్త్రీ ! ఈ పాపంలో కానీ, మోసంలో కానీ, నమ్మక ద్రోహంలో కానీ ఆమెకు కించిత్తు కూడా భాగంలేదు. కనుక ఈ ఇంటిని ఆమెకు వదలి వేద్దాం" అన్నాడు అతను. అందరి మనసులు ద్రవించాయి. సానుభూతి కలిగింది. ఒప్పుకున్నారు.

"విజయ భారతీ! మా డబ్బు నయ్యాపైసలతో సహా

మాకు ముట్టిందా? లేదా? అన్న విషయం మమ్మల్ని బాధించడం లేదు. మాకు మోసం జరగనందుకు ఎంతో కృతజ్ఞులం. చివరకు విశ్వాసరావుగారి కుట్రలు మీరే భగ్నం చేసేరు. మేం చేస్తున్నది ధర్మం కాదు. ఈ ఇల్లు మట్టుకు మీరే అట్టి పెట్టుకోండి. పసివాడికి, మీకు ఆశ్రయం వుంటుంది" అన్నారు

"విజయ నిర్ద్వంద్వంగా నిరాకరించింది. ధర్మం అనినే నను. కానీ ఇది మీ ఉదారతనే సూచిస్తుంది. నిష్కపటంగా జీవించదలుచుకుంటే మీలాటి సహృదయులు ఎవ్వరో ఒకరు సహాయ, సానుభూతులు చూపెట్టకపోరు. మా పరువు ప్రతిష్ఠలకు పాలరాతి సమాధిలా నిలచివున్న ఈ ఇంటిలో నేను ఒక్కరోజు కూడా వుండను. మీ కది తీసుకోవడం ఇష్టం లేకపోతే దేనికయినా ధర్మ సంస్థకు వ్రాసి పారేయండి" అంది తొణకకుండా.

ఋణదాతలు సిగ్గు పడ్డారు. వారికి కొంచెం బాధగానే వున్నా పంపకాలు పూర్తయ్యాయి.

ఇవన్నీ తెమిలేప్పటికి మధ్యాహ్నమయింది. హేమ కుంతల టిఫిను, కాఫీ తెచ్చి పెట్టింది. ఆమె స్నేహశీలత విజయను కరగించి, తిరిగి ఆమెలో దైన్యం నింపింది. శరీరం అంతా డస్సి పోయినట్లయింది.

"ఎందుకు హేమా ఇవన్నీ? నామీద ఇంకా అభిమానం మిగిలివున్నది నీ కొక్కర్తెకే!" అంది

"కాదక్కా"! మంచి వారి మీద అభిమానం ఎవ్వరికీ ఎన్నటికీ పోదు. నీ వేదో దీక్షతో ఈ యజ్ఞం సాగించుతున్నావ్! పాప భారాన్ని దగ్ధంచేసి ఆత్మ ప్రక్షాళనం చేసుకుంటున్నావ్. కానీ దేవీ ఎందుకు బాధపడాలి. వాడికి కాస్తంత ఏదైనా తినిపించి తీసుకొస్తాను"

హేమ దేవీచరణ్ దగ్గరకు వెళ్ళి చేతులు చాచింది. వాడు అమాయకంగా, నిస్సంశయంగా ఆమె హస్తాలలోకి వచ్చాడు. ఎట్టి పరిస్థితిలోనూ గావురుమని ఏడ్వటం, మారాం చెయ్యడం వాడికి తెలియవు. ఎవ్వరు చేతులు చాచినా వాడికి అనుమానం కలగదు. ఎంత దుఃఖ మానస క్షణాల్లో నయినా కండ్లల్లో ప్రాణాలు పెట్టుకుని తదేకంగా అలాగే చూస్తాడు. అతని ప్రకృతికి హేమకుంతల జాలి పడింది. "రా బాబూ!" అంటూ ఎత్తుకుని గుండెలకు హత్తుకుని బయటికి వెళ్ళ సాగింది.

ఎదురుగా ప్రభుత్వ వకీలు, ప్రభుత్వ అధికారి, మరి ఇద్దరు జవాన్లు! హేమకుంతల నిలిచి పోయింది. ఆమె ముఖం వెలవెలా పోయింది. దిగాలుగా కండ్ల నీరు కండ్ల కుక్కు కుంది దేవీని గుండెలకు అదుముకుంటూ

విజయ కుప్పలాగా కూలిపోయింది. దేవీచరణ్ అదేమిటో అర్థం కానట్లుగా కనురెప్ప వేయకుండా చూస్తున్నాడు.

"ఒకోసారి మన ఆదర్శాలకు, అభిప్రాయాలకు, ఉద్యోగ

విధులకు, బాధ్యతలకు సమన్వయం కుదరదమ్మా! దేవీ చరణ్‌ను విరంజన్‌కు అప్పగించవలసిందని కోర్టు వారు ఉత్తరువు చేసేరు. పంపక తప్పదు" అన్నాడు ప్రభుత్వ వకీలు తలవంచుకుని.

విజయ, దేవీని దగ్గరకు తీసుకుంది. ముద్దాడింది. గుండెలకు హత్తుకుంది. హేమ తెచ్చిన కాఫీ త్రాగించింది. కండ్లార ఒక్కసారి అతన్ని చూసుకుంది. బరువుగా నిట్టూర్చింది.

"వెళ్ళు నాన్నా, వెళ్ళు. ఎక్కడున్నా మనిషిగానే బ్రదుకు. నీవు దేవీచరణ్‌వేనని గుర్తుంచుకో! ఏ ఇతర వ్యక్తిత్వాన్ని తెచ్చి పెట్టుకోకు" అని ముఖం తిప్పుకుంది విజయ.

దేవీచరణ్‌కు అందులో ఒక్క ముక్కకూడా అర్థం కాలేదు. హేమకుంతల ఒడిలో ఎంత పొందికగా ఇమిడి పోయాడో ప్రభుత్వ వకీలు భుజాలమీద గూడ అంతే పొంది కగా ఇమిడి పోయాడు.

విజయ కంటివెలుగైన దీపికశిక ఆరిపోయి, భవి తవ్యం అంధకార బంధురం అయింది. విరిగి భూ పతనం కాబోతున్న విశ్వనాథంగారి భవంతిలో విజయభారతి బిక్కుబిక్కు మంటూ మిగిలింది. ప్రక్కనే గోడమీద దేవీచరణ్ తప్పటడుగులు వేస్తూ కదిలినట్లు నీడలు కదిలాయి.

ఆమెకు తోడుగా, అసహాయంగా హేమకుంతల. ఏం చెయ్యాలో ఆమెకు తోచదు. ఏమీ చెయ్యలేదు. దుఃఖంలో భాగం పంచుకోగలదు. అంతే!

# 30

సాయంత్రం ఆరు గంటలయింది. విజయ మాట పలుకు లేకుండా కండ్లు మూసుకుని పడుకుని వుంది. ఆమెకు ఏదైనా తినుబండారం తేవడానికి హేమ కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళింది. కానీ ఇలా కాలక్షేపం ఎన్నాళ్ళనే అభిప్రాయం వారికి లేదు. వారిలో ఏదో శూన్యత్వం. గుండెలు రాయి చేసుకున్న నిర్విచారం.

ఏడున్నర గంటలయింది.

"కలువా" అని తియ్యగా సానుభూతిగా పలికింది ఓ కంఠం.

విజయ దిగ్గున లేచి కూర్చుంది. తల తిప్పింది.

ఎదురుగా విమలానంద్. విజయ వలవలా ఏడ్చింది. తల నేలకేసి బాదుకున్నది.

"కలువా ఏవిఁటీ పిరికితనం ?" అని హెచ్చరించేడు ఆనంద్.

విజయ ఇంకా కుళ్ళి పోయింది. "ఇంకా న న్నా పేరుతోనే పిలుస్తున్నారా విమలానంద్ బాబు? మిమ్మల్ని అవమానం చేసేను. నిర్దాక్షిణ్యంగా మీ హృదయాన్ని గాయ పర్చి అయినా సరే నా మాంగల్యం నిలుపుకుందామని ప్రయత్నించేను. పెద్దరికం అప్రతిష్ఠ పాలు చేసింది. కావాలని కోరుకున్న వ్యక్తిత్వం కూలద్రోసింది.

విమలానంద్ దేనికీ సమాధానం చెప్పలేదు. ఏ సమా ధానం చెప్పినా విజయ హృదయం మరింత క్షోభిస్తుందని అతనికి తెలుసు.

"విచారించకు కలువా, రా వెడదాం?" అన్నాడు.

"ఎక్కడికి ఆనంద్ బాబు ?"

విమలానంద్ దిగాలుగా నవ్వేడు. "కలువా ఐశ్వర్యం మానవుని శిరస్సున ఇనుపమేకు కొడుతుంది. సంపద వ్యక్తి త్వానికి శిలావిగ్రహం వేస్తుంది........"

"ఆ శిలా విగ్రహం కూడా వేయి శకలాలయింది ఆనంద్ బాబు అంది విజయ.

ఇంతలో శ్యామసుందరి ప్రత్యక్షమయింది. ఆమె ఏమీ ప్రశ్నించలేదు. ఏమనీ ఓదార్చలేదు. అసలు విజయకు ఏదో ఘోర విపత్తు సంభవించిందని వాపోలేదు.

"రా చెల్లీ!" అంది ఆప్యాయంగా.

"నా మీద ఇంక ఏ బాధ్యతలూ, బరువులూ లేవక్కా. వచ్చి మాత్రం ఇంకేం చేయను? నన్నిలా వుండనీ" అంది.

"జీవితం ఒకొకప్పుడు పాలు విరిగినట్లు విరుగుతూనే వుంటుంది విజీ! అంతమాత్రంచేత మానవత్వాన్ని ఉపేక్షించ కూడదు. లేచిరా! దేవీచరణ్ ఏడీ?" అంది శ్యామసుందరి.

"భగవంతుడు దయామయుడు. ఆ భారం కూడా నా మీదనుంచి మళ్ళించేడు. ఇంక నా అస్తిత్వానికి కారణం, సాఫల్యం ఏమి వుంటాయి?"

"అయితే ఇక్కడ వుండి మాత్రం నీవు చేయదలచు కున్నది ఏవిటి?"

"విధి వ్రాత కోసం ఎదురు చూడటం. ఇంకా కాళ్ళూ చేతులు వున్నాయిగా అక్కా!"

శ్యామసుందరి చిన్నబుచ్చుకుంది.

"నా మీద నీకు రవంత కూడా అభిమానం లేదా కలువా? అన్నాడు ఆనంద్.

"ఉంది బాబు. అభిమానాన్ని అపాత్రదానం చేసేను. అదృష్టం నన్ను వరించలేదని అలమటిస్తున్నాను. ఏ ముఖం పెట్టుకుని మీకు భారం కాగలను.

"ఇంకా ఇక్కడేవైనా సామాన్లు?"

"ఏమీ లేవు అమ్మకానికీ పనికి వచ్చేది పూచికపుల్ల కూడా లేదు. విశ్వాసరావుగారి దింకా అప్పు మిగిలే వుంది."

విమలానంద్ యోచించుకున్నాడు. "ఎక్కడిదో ఈ సంస్కారం? తన జీవితాన్నే హత్య చేసిన మదిరను విజయ

క్షమించింది. తనకు పూర్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాల నిచ్చి తన విచ్చలవిడితనాన్ని ఉపేక్షించిన విజయను విరంజన్ తృణీకరించేడు.

తనకు ఆస్తి దక్కనీయనందుకు కోర్టుకు ఈడ్చి అవమానం చేసి పరాభవించిన విశ్వాసరావుగారి అప్పు ఇంకా నాలుగు వేలు మిగిలివుందని విజయ నొచ్చుకుని బాధపడి పోతున్నది.

విమలానంద్ వత్తిడి చేసేడు. "కలువా! నీకు నామీద అభిమానం వున్నదో లేదో నాకు తెలియదు. కానీ నీ విలా అనాధలా వుండటం ఎప్పుడూ ఒప్పుకోబోను. నీవు రాక తప్పదు. ఒట్టు పెట్ట మంటావా?" అన్నాడు.

కలువ సర్వసంగ పరిత్యాగిలానే కదిలింది. శ్యామ సుందరి, విమలానంద్ అనుసరించేరు.

దూరంగా గేటులో చిన్న కారు శబ్దం వినవచ్చింది. ముగ్గురూ తలఎత్తి చూశారు. కారు ఒక్క క్షణం ఆగి దట్టంగా దుమ్ము రేపుకుంటూ రివ్వున వెళ్ళిపోయింది.

కలువ ఏమి చూచిందో! పరుగెత్తి పోయింది. విమలానంద్, శ్యామసుందరి కంగారుగా అనుసరించేరు.

కలువ దేవీచరణ్‌ను ఎత్తుకుని పెద్ద వజ్రాల మూట దొరికినట్లుగా గుప్పు గుప్పున ముద్దు పెట్టుకుంది. ఆమె ముఖం వికసితమైంది.

దేవీచరణ్ ఆమె హస్తాలలో ఇమిడి వున్నాడు.

"వచ్చావా దేవీ! రా!" అంటూ కలువ పిచ్చిగా వాపోతున్నది.

"ఇది మరొక ఎత్తు కాబోలు ఆనంద్!" అంది శ్యామసుందరి శరవేగంగా దూసుకుని పోతున్న విరంజన్ కారు వైపు చూస్తూ.

విమలానంద్ తిరస్కరించేడు "ఏమీ లేదు, సంపద తేని సంతానం విరంజన్‌కు అవసరం లేదు."

హేమకుంతల అప్పుడే అక్కడికి వచ్చి ఆశ్చర్యంగా చూస్తున్నది. విమలానంద్ చెప్ప సాగేడు. "దేవీచరణ్ ఇదివరకు లక్షలకు అధికారి. ఆస్తి మీద సంరక్షకత్వం కోసరం విరంజన్ దావా చేసేడు. కల్లబొల్లి ఏడ్పులు ఏడిచేడు. కానీ దేవీచరణ్ నేడు నయాపైసాలేని బికారి. ఈ బాధ్యత, ఆ కన్న తండ్రికి అవసరంలేదు. అందువల్లనే దిగ విడచి పోయాడు."

"పోనీలే ఆనంద్ బాబు! అందరికీ మనలాంటి మనస్సులే వుంటాయా. దేవీచరణ్ తిరిగి వచ్చేడు. అదే పది వేలు" అంది నిరసనగా.

ముగ్గురూ బయలు దేరేరు. హేమకుంతల విజయ దగ్గరకు పరుగెత్తి వచ్చింది. ఏదో చెంగులో ముడివేసింది. "అక్కా! ఇది నిరాకరించితే నామీద ఒట్టు. దీన్ని విమలానంద్ బాబు ఇంటికి వెళ్ళేలోపు విప్పకు. నన్ను మర్చి పోవద్దు" అంది.

అందరూ నెమ్మదిగా నడవ సాగారు.

## 31

శ్యామసుందరి, కలువ, విమలానంద్, విమలానంద్ ఇంటికి చేరుకునేప్పటికి రాత్రి ఎనిమిది గంటలయింది. అప్పటికి దేవీచరణ్ శ్యామసుందరి భుజం మీదే నిద్రకు పడ్డాడు. అతనిలో అంత అమాయకత. శ్యామసుందరి అతన్ని నిద్రపుచ్చి వచ్చింది.

విజయ అప్పటికి డస్సి, కళ్ళు లోతుకుపోయి వుంది. కంఠస్వరం హీనంగా వినవస్తున్నది. కుర్చీలో చేరగిల బడి కూర్చుని వుంది.

"ఉదయం నుండీ ఏమీ ఎంగిలి పడినట్లే లేదు. కాస్త షర్బత్తు తాగుతావా చెల్లీ! ప్రాణం తేరుకుంటుంది" అంది శ్యామసుందరి.

"వద్దక్కా షర్బత్తూ వద్దు. భోజనమూ వద్దు. కాస్త కాఫీ తాగుతాను. దానికి నీవు శ్రమపడకు. నేను స్వయంగా చేసుకుంటానుగా!"

"ఇక్కడ కూడా నీకీ శ్రమెందుకు కలువా? సుందరి కాఫీ రెండు క్షణాల్లో తయారు చేస్తుంది."

"క్షమించండి ఆనంద్ బాబు. జీవితమే స్వయంకృతమై నప్పుడు జీవించడానికి మరొకరి మీద ఆధారపడడం ఎందుకు ?" విజయ సమాధానం చెబుతూనే వంట ఇంటివైపు నడిచింది.

ఆనంద్ బాబు వెంటనే వచ్చి ఆమె దారికి అడ్డుగా నిలబడ్డాడు. "కలువా! నీ అభీష్టానికి వ్యతిరేకంగా ప్రవర్తించి నీకు మనఃక్లేశం కలిగించడం నా అభిమతం కాదు. కానీ ఈ రోజు నీవు నా అతిథివి. ఈ కాస్త ఆధిక్యతైనా దక్కించుకోవడానికి నేను తగనా ?"

విజయ కలవరపడింది. "అనవసరంగా మనసు కష్ట పెట్టుకుంటున్నారు ఆనంద్ బాబు. మీ కగౌరవం తల పెట్టేంత అహంకారం నాకెక్కడిది? మీ యిష్టమే చెల్ల నివ్వండి. నాకు ఒక అరకప్పు కాఫీ చాలు అక్కా" అంది శ్యామసుందరి వైపు తిరిగి. కానీ రేపు మాత్రం నేను స్వయంగా వంటచేసుకోవడానికి మీరభ్యంతరం చెప్పకూడదు.

శ్యామసుందరి రెండు క్షణాలసేపు విజయ వంక పరి శీలనగా చూసింది కాఫీకి నీళ్ళు పెడుతూ.

"నేను నీ అక్కలాంటిదాన్ని విజయా! నాచేతి పాకం కూడా నీ కయిష్టమేనా ?"

"అంతమాటా అక్కా! మరో పది జన్మలెత్తి మాత్రం మీ మేలు మరచిపోగలనా ?"

"అయితే ఇక కారణం చెప్పు. ఇన్ని పెను తుఫాను

లకు తట్టుకొని క్రుంగి కృశించి నామావశిష్టంగా నిలిచివున్న నిన్ను కాపాడుకొన వలసిన బాధ్యత మామీద లేదా? మాకున్న ఆ అవకాశాన్ని కూడా తృణీకరించుతున్నావా?

విజయ తలవంచుకొని కన్నీరు పెట్టుకుంది. శ్యామ సుందరి, విమలానంద్ తెల్లబోయారు. విజయ అంతర్యానికి తాము కలిగించిన ఆఘాత మేమిటో వారికి తెలియక నొచ్చుకున్నారు.

శ్యామసుందరి విజయ దగ్గరే మౌనంగా కూర్చుంది. విమలానంద్ విచారంగా తన గదిలోకి వెళ్ళి పోయాడు.

విజయ కండ్లు తుడుచుకుని తనంత తానే తల ఎత్తింది.

"అదేమిటి అక్కా? ఆనంద్‌బాబు భోజనం చేయ లేదేం? అంది.

"చేస్తారులే విజయా? కాఫీ దించుతాను. ముందుగా నీవు కాఫీ తీసుకో!"

"అలా కాదక్కా! నాకోసం వారెందుకు పస్తు పడుకోవాలి? ముందాయన భోజనంచేయవలసిందే" విజయ విమలానంద్ గదివైపు వెళ్ళింది."

విమలానంద్ అధోముఖుడై దృష్టి క్రిందికి దించివేసి కూర్చుని వున్నాడు.

"మీరు భోజనం చేయలేదేం విమలానంద్ బాబు. మీరు కూడ నాకీ శిక్ష విధించుతారా? మీకు కూడా నామీద దయలేదా?" అంది.

"కలువా! నీవు ఎవరి సహాయం తీసుకోనవసరంలేదు సరే. నీవు నిస్సహాయంగా వుంటే......."

"నన్ను గురించి మీరేం క్షోభ పడకండి ఆనంద్ బాబు. ముందు మీరు భోజనానికి లేవండి."

"అలాకాదు కలువా! అసలు నీ నిశ్చయం ఏమిటో పూర్తిగా తెలియకుండా ఈ రోజు భోజనం చేయడం కుదరదు.

"ఇది బలాత్కారమా ఆనంద్ ?"

"ఇది బలవంతం కాదు కలువా. బాధ్యత. నీవు నిగ్రహం కలిగి వున్నావు సరే! దేవీచరణ్ మాటేమిటి? అతని భవిష్య జీవనాన్నంతనూ నీ పట్టుదల లోనికి, ఆశయ సాధనలోనికి కుదించి సంకుచితం చేస్తావా ?"

విజయ ఒక్క క్షణం మౌనంగా వూరుకుంది.

"అలా అతని జీవితాన్ని కుదించి భవిష్యత్తును పరిమితం చేయడానికి నీకు హక్కున్నదా ?" అన్నాడు విమలానంద్ కోపంగా.

శ్యామసుందరి "విమలానంద్ బాబు" అని గద్దించింది ఏమిటి నీ అసంగత ప్రశ్న అన్నట్లుగా.

విజయే సర్దుకుంది. "ఊరుకో అక్కా! వారు మంచి ప్రశ్నే వేసేరు. అనుబంధాలు ఎంత సన్నిహితమైన వైనా మనిషికి వుండవలసింది బాధ్యతలేగాని హక్కులు కావు. ఈ విషయాన్ని నేను మరిచే పోయాను. కానీ వినండి

ఆనంద్‌బాబు. నే నుండగా దేవీచరణ్‌కు ఫరవాలేదు. నా బాధ్యత నెరవేర్చ గలననే అనుకుంటున్నాను. అంత అదృష్టం నాకు లేక శక్తివిహీనురాల నయితే మీరిద్దరూ వుండనే వున్నారు. కనుక వాడెప్పుడూ అనాథ కాడు."

"అయితే దేవీ సంరక్షణ నేను వహించడం నీకేం అభ్యంతరం కాదు గదా?"

"కాదు కానీ ఒక షరతు. మీ సంరక్షకత్వం నాబాధ్యత తగ్గించడానికి కారాదు.

"ఆనంద్ అసంతృప్తిగానే లేచి వచ్చాడు. విమలానంద్ శ్యామసుందరి భోజనానికి కూర్చున్నారు. కలువ వారి సరసనే కూర్చుని కాఫీ తాగసాగింది.

శ్యామసుందరికి ఆహారం అయిష్టంగానే వుంది. విమలానంద్ బాబు అన్నాన్ని అటూ ఇటూ కెలికేడు.

"అదిగో! ఆనంద్ బాబు! మీ సంతృప్తి కోసం నేను కాఫీ తాగేను. కానీ మీరు అర్ధాకలితో లేస్తున్నారు."

"లేదులే కలువా! కానీ నీవిలా విచారించకుండా వుండాలి."

కలువ మెల్లగా తల వూపింది.

విమలానంద్‌కా రాత్రి సంతృప్తిగా నిద్రపట్టిన రాత్రి. విజయ గుండెమీద చేయి వేసుకుని హాయిగా నిద్రపోయిన రాత్రి.

పాపం! శ్యామసుందరే నిశిరాత్రి లేచి అశాంతితో

తపించిపోయింది. హాయిగా నిద్రిస్తున్న విమలానంద్, నేటి కైనా మనశ్శాంతి చిక్కించుకున్న విజయ! ప్రక్కనే దేవీ చరణ్!

బంతిపువ్వులాంటి వెన్నెల! బరువుగా తేలివస్తున్న సుమ సౌరభాలు!! ఆ వెనుకనే ఎముకలు కరుస్తున్న చలి!!! ప్రశాంతమైన రాత్రిలో నిశ్చల జలరాశిలో గులకరాళ్ళు పడినట్లు ప్రక్కనే ఎక్కడో కోడికూత.

ఆమె ముఖంలో ఓ నిట్టూర్పు. ఆ వెనుక ఓ కృత నిశ్చయ భావనా వీచిక. కర్తవ్య శూన్యమైన శ్యామసుందరి జీవితానికి ఆ రాత్రే ఒక కర్తవ్యం ఏర్పడింది. పట్టుదల గట్టి పడింది. ఆ తరువాత తెల్లవారు ఝామున ఆదమరచి నిద్ర పోయింది. జీవితం ఒకోసారి అర్థరహితమైంది గానూ, ధ్యేయ శూన్యమైంది గానూ, అవుపించి నప్పటికీ కూడా అర్థ పూరితం కాకపోదు కాబోలు!

దేవీచరణ్‌కు అందరికన్న ముందుగా తెల్లవారింది ఉదయాన్నే అతనికి షాలు త్రాగడం అలవాటు. విజయకు మెలకువ వచ్చి అతన్ని సముదాయించుతూ కూర్చుని వుంది.

మరింత సేపటికి శ్యామసుందరి మేలుకుంది. తానంత ప్రొద్దు ఎక్కేవరకూ స్పృహలేకుండా నిద్రపోయినందుకు లజ్జపడింది.

"అప్పుడే నిద్ర లేచేవా చెల్లీ?" అంది మందహాసంగా.

"కలవరంతో మనశ్శాంతి లేకుండా రాత్రంతా జాగ

రణ చేసేవా ఏం ?" అంది తనే మళ్ళీ.

"లేదక్కా. దేవికి ఉదయానే పాలు త్రాగడం అలవాటు. వాడే అందరికన్నా ముందరగా మేలుకున్నాడు. ఈ దగ్గరలో ఎక్కడయినా ఒక చుక్క పాలు దొరుకుతాయా ?" అంది.

శ్యామసుందరి తన అజ్ఞానానికి సిగ్గుపడింది. "అరెరె. చెప్పేవు కాదేం చెల్లీ ! గొల్లను ఇంకాస్త ముందర పాలు తెమ్మని చెప్పివుందును కదా ?" అంది.

"ఫరవాలేదులే అక్కా ! అంత తొందరేం లేదు" అంది దేవిని సముదాయించుతూ.

శ్యామసుందరి హృదయం చివుక్కుమంది. ఎంతో దర్పం వెలిగించిన విశ్వనాథంగారు చివరికి సర్వమూ తుడిచిపెట్టి కుమార్తెను నిరాశ్రయను చేసేరు. నేడు విజయ సర్వస్వాన్నీ త్యాగంచేసి, గృహవిహీనయై, స్వాభిమానాన్నీ, ఆత్మ గౌరవాన్నీ నిలుపుకునేందుకు పోరాడుతున్నది. ఆమె ముఖంలోని ఆ వింత తేజస్సే ఆమె ఆత్మ ధైర్యానికి నిదర్శనమేమో !

ఒకింత సేపు గడిచింది. పాల మనిషి పాలు తెచ్చేడు. దేవీచరణ్ ఆత్రంగా పాల గిన్నె వైపు రాసాగాడు.

"కొంచెం సేపు తాళు బాబూ ! పచ్చిపాలు జబ్బు చేస్తాయి" అంటూ శ్యామసుందరి స్టౌ వెలిగించింది. ఇంతలోనే విమలానంద్ బాబు నిద్రలేచి బయటకు వచ్చేడు "సుందరీ" అంటూ.

సుందరి అతన్ని వారించింది. "త్వరగా స్నానంచేసి రండి ఆనంద్‌బాబు కాఫీ పెడతాను" అంది వంట పాత్రల వైపు చూస్తూ.

విమలానంద్ ఆమె కంఠస్వరానికి ఆశ్చర్యపడి చూచేడు. తెల్లవారేప్పటికి సుందరిలో వచ్చిన మార్పేమిటో అతనికి అర్థంకాలేదు.

ఒక ప్రక్కగా విజయ సుందరికి సహాయం చేస్తున్నది. ఆమె ఒడిలో దేవీచరణ్. స్టౌ మీద పాలు కాగుతున్నాయి.

సుందరి బంతిపువ్వులా నవ్వుముఖం పెట్టి "ఇంకా అక్కడే వున్నారు. స్వప్న జగత్తా ఏమిటి?" అంది.

విమలానంద్ స్నానంచేసి వచ్చేప్పటికి శ్యామసుందరి దేవీచరణ్‌కు పాలుపడుతున్నది. "ఆనంద్‌బాబూ! ఇవ్వాళ మీతో కొద్దిగా పనివుంది. చేసిపెట్టగలరా?" అంది విజయ.

"తప్పకుండా కలువా! ఏమిటది?"

"ఏం లేదు. ఒక వస్తువు కొని తెచ్చి ఇవ్వాలి. బయటికి వెళ్ళేప్పుడు చెప్పండి" అంది తిరిగి పనిలో నిమగ్నమవుతూ.

విమలానంద్ కాఫీ తీసుకుని డ్రెస్ కావడానికి సిద్ధమయ్యాడు. శ్యామసుందరి పొయిదగ్గర కూర్చుని వుంది. విజయను ఆ ఇంటికి తీసుకుని వచ్చేందుకుగాను శ్యామసుందరి వాసాన్ని కూడ విమలానంద్ అక్కడికే మార్పించిన నాటి నుండి శ్యామసుందరే వంట పని చూస్తున్నది. పది గంటలకు వంట పూర్తిచేసి తను తిని విమలానంద్‌కు అన్నీ అమర్చి

ఆమె ఆఫీసుకు వెడుతుంది. భోజనం కాఫీ వగైరా విమలా నంద్ గడియారం అలారం ప్రకారం వాటిని పూర్తిచేస్తాడు.

విమలానంద్ బజారుకు వెళ్ళడానికి సన్నద్ధనుయే సమయానికి వీధిలో తలుపు దబదబా మ్రోగింది. ఆ క్షణాన శ్యామసుందరి వంట పని చూస్తున్నది.

"తలుపు నేను తెరుస్తాలే అక్కా !" అంటూ విజయ వెళ్ళి తలుపు తెరిచింది.

వయసు విరిగి పోయిన వృద్ధుడు. లోనికి వచ్చేడు. కదలికలో వణుకు, చూపులలో ఆవేదనాపూరిత అన్వేషణ. మాటలలో అస్పష్టత.

"విజయ ... విజ .... య .... మ్మా" అంటూ లోనికి వచ్చేడు.

విజయ ముఖంలో గుప్పున ఆనందం. అంతలో వివర్ణత. ఆశ్చర్యం. మౌనం.

"మా విజయమ్మ వుందా తల్లీ".

విజయ తొణికి పోయింది. ఆ విషణ్ణతలో కూడా అభిమానం !

"నేనే తాతా" కంఠంలో గాద్గద్యం.

వృద్ధుని నేత్రాలు చెమర్చేయి. చేతితోనే తడిమి ఆమె భుజంమీద చేయి వేసేడు. విజయ అతని చేతి కర్రను పట్టుకొని కూలిపోకుండా ఆగింది.

"నీవేనా విజయమ్మా! చివరికి నీ పరిస్థితిలా పరిణమిం

చిందా? చివరికి నిలువ నీడ లేకుండా పోయింది. నిన్ను చూడాలని వచ్చేను. కానీ అందుకు కండ్లు లేవు. నేను వచ్చినందుకు నీకు కష్టంగా వుందామ్మా?"

"లేదు తాతా! నాకు సహాయం చేయబోయి అవమాన పడ్డావు. అయినా నన్ను పరామర్శించడానికి వచ్చేవు. ఎవరి అభిమానాలు చివరకు ఎవరెవరికి దక్కుతాయో" అంది దుఃఖం ఆపుకుంటూ.

శ్యామసుందరి, విమలానంద్ బాబు ఆశ్చర్యంగా చూస్తున్నారు.

"ఆయన్నిలా లోనికి రమ్మను కలువా!" అన్నాడు విమలానంద్. లోనికి వచ్చి కూర్చున్నారు. విజయ పరిచయం చేసింది.

"ఈమె శ్యామసుందరి తాతా! తోబుట్టువు లేకపోయినా సహోదరి లాంటిది.

ఈయన విమలానంద్ బాబు. ఆశ్రయ విహీనకు ఆశ్రయం కల్పించుతున్నారు.

"నువ్వు వీడిని చూడనేలేదు. దేవీచరణ్. నీ మనుమడు" అంది కండ్లు వత్తుకుంటూ.

"మా రామయ్య తాత! అంది" "ఆ వృద్ధుడ్ని గురించి వారి కేం చెప్పాలో తెలియక.

వృద్ధుడు ధైర్యం చెప్పేడు. "గుండెల్ను దిటవు పర్చుకో

తల్లీ. దటవు పర్చుకో !" అన్నాడు దేవిని గుండెలకు అదుము కుంటూ.

"ప్రపంచంలో ఎవరో ఒకరు జాలిగుండెలు కలిగిన వాళ్ళు లేకుండానే వుంటారా భారతమ్మా ! ఈ దంపతులు అలాంటివారే కాబోలు !" అన్నాడు శ్యామసుందరి, విమలా నంద్ బాబుల నుద్దేశించి.

శ్యామసుందరి ఇలాంటి అర్థం వచ్చే మాటలను వ్యంగ్య పూర్వకంగానూ, దెప్పిపొడుపుగానూ, ఎత్తిపొడుపుగానూ అనేక మంది నుండి విన్నది. కానీ ఇవ్వాళ ఆ మాట విని ఆమె ప్రాన్పడి పోయింది ఆ వృద్ధుని వంక, విజయ వంక చూస్తూ.

"ఆయనకు తెలియదులే సుందరీ నీవు చిన్నబుచ్చు కోకు" అన్నాడు విమలానంద్.

"ఇంక వస్తానమ్మా ! వస్తాను విజయమ్మా ! వచ్చి నందుకు నా కోరిక నెరవేరింది."

'తాతా !'

"ఏం విజయమ్మా ?"

"నీవు నన్ను ఎత్తుకొని పెంచేవు."

"అవును !" ఎప్పటివో అనురాగపు పొరలు వెలికి వచ్చేయి.

"నీ ఒద్ద నీకేదైనా బహుమానంగా ఇస్తే పుచ్చుకో గలవా తాతా ?"

"వద్దమ్మా వద్దు. నిన్ను చూడగానే నా గుండెలు నిండిపోయాయి."

"తాతా!"

"..................."

"ఇదిగో ఇది నీదగ్గర వుంచు."

ఇదేమిటి! నోట్ల కట్టా!! పెద్దయ్యగారి పొరపాటుకు నీవు శిక్ష చెల్లించుతావా? బహుమానం పేరుతో త్యాగం చేస్తావా విజయమ్మా?"

విజయ జంకలేదు. "నీ వీ ఋణం నుండి ఎప్పుడూ విముక్తం కానీయవా తాతా?"

"అయితే నీవు నా అభిమానాన్నే తృణీకరిస్తున్నావా విజయమ్మా?" అదొక విచ్చు కత్తి లాంటి ప్రశ్న.

"లేదు తాతా! నా విధ్యుక్త ధర్మం నెరవేర్చుతున్నాను. ఇది నిరాకరించకు."

ఒకరి ధ్యేయం తరతరాలనుండి పేరుకున్న ఋణాన్ని నిశ్శేషంచేసి పాపప్రక్షాళనం చేయడం.

అభిమానానికి బదులుగా, పాపిష్టి డబ్బు పుచ్చుకోవలసి రావడం మరొకరి బాధ.

"అయితే ఇలా తే తల్లీ! కడుపు నిండుగా అభిమానం వున్నా నా దేవికి కించిత్తు బంగారాన్ని కూడా తేలేకపోయాను. ఈ నోట్ల కట్ట నా కప్పగించడం నీ విధ్యుక్త ధర్మం అయితే దీనిని దేవికి బహుమానంగా ఇవ్వడం నా అదృష్టం!"

నోట్ల కట్ట చటుక్కున దేవీ చేతులో పెట్టేడు.

అది విజయకు ప్రథమ పరాజయం. నోట్లు తిరిగి ఆమె చేతిలోకే వచ్చేయి. కానీ వాటిమీద ఆమెకు విపరీతమైన ఏహ్యాం.

"తాతా! ఎప్పుడైనా కనిపించుతుంటావుగా?"

"ఎందుకు కనిపించనమ్మా?"

రామయ్య తాత వెళ్ళిపోయాడు.

అతనికి ఎదురుగా వచ్చి హేమకుంతల పరిశీలనగా చూసింది.

"ఇతను మన రామన్న తాత కాదక్కా?"

"అవును హేమా! నిజమైన అనుబంధాలు ఎంతో పటిష్ఠమైనవి. వాటిని భరించడం ఎంతో భారమైన పని" అంది.

హేమకండ్లు చెమ్మగిల్లేయి. అందరిలో మౌనం.

ఆనందే ముందు మాట్లాడేడు. "కలువా! నేను మార్కెట్టుకు వెడుతున్నాను. నీకు కావలసిన వస్తువు ఏమిటో చెబుతావా? తెస్తాను."

విజయ నిట్టూర్పు విడిచింది. "రాత్రంతా దేవీచరణ్ సంరక్షుత్వం వహించక తప్పదని మొండికేసి కూర్చున్నారుగా! ఆనంద్‌బాబు. ఇది దేవీచరణ్‌కు బహుమానంగా వచ్చిన ఆస్తి. ఏ అపవిత్రతకు మూలం కాని ధనం వాడికిదే. వుంచండి అంది. రామన్నతాత దేవీ కిచ్చిన నోట్లకట్ట విమలానంద్ కిస్తూ."

విమలానంద్‌కు విజయభారతి ఎప్పుడూ అర్థంకాని సమస్యే!

శ్యామసుందరి సంతృప్తిగా ఊపిరి పీల్చుకుంది.

"అయితే ఇంతకూ నీకు కావలసిన వస్తువు?"

"లేదు ఆనంద్‌బాబు నా దగ్గర ఇప్పుడింకేం పైకం లేదుగదా? ఇక ఒక్క నయాపైసా కూడా నాకు చెంది వుండే అర్హత లేదు. రాత్రి నే నెంతగా వద్దని వారించినా హేమ ఒట్టుపెట్టుకుని ఈ డబ్బు నా చెంగున ముడివేసింది. దానితో రామన్న తాత ఋణం నిశ్శేషమైంది. ఇంకెంత మిగిలివుందో?" అంది విజయ.

"అయితే నామీద నెపం వేస్తున్నావా? అక్కా!" అంది హేమకుంతల.

నెపంకాదు చెల్లీ! రామన్న తాతకు అప్పటిలో చివరి నెల జీతం ముట్టకుండానే బర్తరఫ్ అయిన విషయం నీకు తెలుసుగా.

విమలానంద్‌కు చిఱుకోపం కలిగింది. "ప్రపంచంలో అన్నింటినీ ఋణభారంగానే చూస్తావేం కలువా? స్నేహ ధర్మంగా సహాయం చేయడం కూడా అధర్మమా!"

విజయ అతన్ని మధ్యలోనే ఆపివేసింది. "మీకు నా కృతజ్ఞత ఆనంద్‌బాబు. అలాంటి సమయాలు ముందు ముందు ఇంకా చాలా వున్నాయేమో! అంది.

తరువాత రెండు రోజులకు అలా నిరాభరణగానే

విజయ మార్కెట్టుకు బయలుదేరింది.

విమలానంద్ ఆదుర్దా వ్యక్తపరిచాడు. "నీకు అవసరం పడిన వస్తువేదో నాకు తెలియకూడదా కలువా? ఆ వలసిన వస్తువేదో నేను స్వయంగా తేకూడదా? అది నీకంత అయిష్టమా?" అన్నాడు విమలానంద్.

"అలా ఎన్నడూ భావించకండి ఆనంద్ బాబు. అయాచితంగానే నా కాశ్రయం కల్పించిన మిమ్మల్ని నిర్లక్ష్యం చేయగలనా? ఉపేక్షించడం నాచేతనవునా? కానీ ఈ నాడు నేను ఆచరించబోతున్న దొక అత్యాచారం లాంటిది. అది మీకు తెలిస్తే ఎంతగా అవమానం చెందుతారో!"

"కలువా! ఆచరణనే శంకించగల నా అంతర్యంలోని ఆ దౌర్బల్యం ఏమిటో నేను తెలుసుకొన వచ్చునా?"

విజయ తొట్రుపడింది. "క్షమించండి ఆనంద్ బాబు మీరు అనవసరంగా ఆత్మనింద గావించుకుంటున్నారు. నేనీ విషయాన్ని ఎప్పటికోప్పటికి మీకు తెలియజేయక తప్పదు గదా? అంతవరకు నా మీద దయవుంచి శాంతం వహించండి" అంది బజారుకు చకచకా వెళ్ళిపోతూ.

విమలానంద్ స్తంభీభూతుడై అలాగే నిలిచిపోయాడు.

"ఏమిటి ఆనంద్?" శ్యామసుందరి సానుభూతిగా ప్రశ్నించింది.

"కలువ నాకు ఎన్నటికీ అర్థం కావటం లేదు సుందరీ! నాలోని ఈ బలహీనత ఏమిటో మరి?"

ఆమె నిజమైన స్త్రీ ఆనంద్. అందువల్లనే నీకు ఎప్పటికీ అగమ్యంగానే మిగిలి పోతుంది.

"స్త్రీ ఎప్పుడూ జవాబులేని సమస్యగానే మిగిలి పోవాలా సుందరి ?"

నిజమైన స్త్రీ ఎప్పుడూ అంతే ఆనంద్. మామూలు స్త్రీ లంతా వట్టి వ్యక్తులుగానే మిగిలి పోతారు. అయినా విజయకు మీరు శాస్త్ర స్వేచ్ఛ నివ్వడం మంచిదేమో ?"

"ఇప్పుడామె కిది బందిఖానానా ?'' అన్నాడు తెల్లబోతూ.

"కాదు. కానీ మీ అభిమానాతిశయంలో ఆమె ఆదర్శాలకు కొంత అడ్డుపడుతున్నారేమో ?"

"స్త్రీ హృదయం స్త్రీకి అర్థమవుతుం దంటారుగా సుందరీ. అయితే కలువ నీకేమైనా అర్థమయిందా ?" అన్నాడు విమలానంద్ దీనంగా.

''అర్థమైంది ఆనంద్ బాబు. ఆమె వల్ల మనకు రవ్వంత ఇబ్బంది కలగడానికి కూడా ఆమె ఇష్టపడడం లేదు.''

ఆనంద్ కు ఉసూరు మనిపించింది.

ఆ తరువాత నాలుగు రోజులకు ఒక చెక్క పెట్టె పార్సెల్ విజయ పేరుతో విమలానంద్ ఇంటికి దిగుమతయింది.

విమలానంద్, శ్యామసుందరిలకు అదేమిటో అని కుతూహలం కలిగింది కానీ ప్రయత్న పూర్వకంగా మౌనం వహించారు.

ఆ తరువాత రెండు రోజులకు రామన్న తాత కొన్ని కొత్త గుడ్డలు తెచ్చి విజయ చేతికిచ్చి కండ్లను అశ్రువులు నింపుకున్నాడు.

"ఇలాంటి అకార్యం స్వహస్తాలతోనే ఆచరించ వలసి వస్తుందని ఎప్పుడూ అనుకోలేదమ్మా! కానీ చేస్తున్నాను — నా గుండెలు తరుగుకొని పోతున్నవి" అన్నాడు.

విజయ రామన్న సహాయంతో చెక్క పెట్టె విప్పి కుట్టు మిషను ఒకటి బయటికి తీసింది. దానిని చూసిన వెంటనే రామన్న తాత దుఃఖం మరింత హెచ్చింది.

విమలానంద్, శ్యామసుందరి తమ మౌనాన్ని పాటించ లేక పోయారు.

"విజయా! నీవు కుట్టు మిషను మీద పని చేస్తావా?" అన్నాడు ఆనంద్.

శ్యామసుందరి ఆశ్చర్యం గొంతులోనే అణగి పోయింది. దుఃఖం పొర్లుకుని వచ్చింది.

"కలువా! ఈ కుట్టు మిషను ఎలా తెచ్చావు? ఈమాత్రం నాకు చెప్పకూడదా?"

విజయ తల దించుకుంది. "క్షమించు ఆనంద్ బాబు. నేనొక అకార్యం ఆచరించ బోతున్నానని తెలియ జేసాను గా! అది కాస్తా చేసి వేశాను. నేనెంతో పవిత్రంగా కాపాడుకుంటున్నది, మీ రిచ్చిన ఉంగరం కుదువ బెట్టేను ఆనంద్ బాబు. క్షమించ గలరా? దానిని ఎప్పటికైనా తిరిగి

తెచ్చుకో గలనో? లేదో? ఇలాంటి అకార్యాన్ని మీ హస్తాలతో ఎలా చేయించను?" విజయ రెండు అర చేతులా ముఖం కప్పుకొని కుమిలి పోయింది.

విమలానంద్ నోరు పెగలలేదు. కానీ ఆ కుట్టుమిషను హోరు శబ్దం ఎన్నడు వినిపించినా అతని హృదయం తూట్లు పొడిచినట్లయ్యేది.

విజయ ఎప్పుడూ స్వయం కృషిపై ఆధారపడాలనే కృత నిశ్చయంతో వుండేది. ఉండ గలిగింది.

విమలానంద్ ఎప్పుడూ ఆమెకు ఏదో విధంగా సహాయం చేయాలని ఉబలాట పడేవాడు. ఆ అవకాశం అతనికి లభించేది కాదు.

# 33

ఆరణి ఒకనాడు వింతవార్త తెచ్చాడు విజయకు రెండు లక్షల క్యాష్ వచ్చిందని.

"ఏమిటీ! రెండు లక్షలా?" తన చెవులను తానే విశ్వసించలేక పోయాడు విరంజన్."

అవును. అక్షరాలా రెండు లక్షలు విరంజన్. విశ్వనాథంగారి కొాక ఫార్మాచ్యూటికల్ కంపెనీలో వాటా

లున్నాయని గానీ, ఆ వాటాలను తన కుమార్తె విజయ భారతి పేర నమోదు చేసేరని గాని ఇంతవరకు ఎవ్వరికీ తెలియదు. నేడా కంపెనీ విశ్వనాథంగారి పెట్టుబడి మీద రెండు లక్షల రూపాయల లాభాన్ని ప్రకటించటం మాత్రం నిజం.

"అయితే అసలాయన ఈ కంపెనీలో పెట్టుబడి ఎంత పెట్టాడంటావ్?"

విరంజన్ ప్రాణా లుగ్గబట్టుకొని ఆశగా ఆడిగేడు. ఊహించని ఆశాలత కాలికి తగిలినట్లయింది. "రెండు లక్షలు" అనుకున్నాడు దురాశగా.

"పెట్టుబడి ఎంత కావాలి? పది సంవత్సరాలనా డెప్పుడో ఆయన పదివేలు పెట్టుబడి పెట్టి ఆ విషయాన్ని మర్చిపోయి వుంటారు. ఆ కంపెనీ ప్రభుత్వ ఆర్థిక సహాయం తోనూ, ప్రజల ఆదరాభిమానాలతోనూ వృద్ధిచెంద నేటికి లాభాలు తీసింది. ఇదింత వృద్ధి పొందుతుందని గానీ, లాభాలు తీస్తుందనిగానీ, బహుశః విశ్వనాథంగారు కూడ వూహించి వుండరు. అలా భావించే వుంటే ఆయన దానికి సరితూగ తప్పనిసరిగ ఋణం చేసే వుండేవారు" అన్నాడు ఆరణి.

విరంజన్ ఆరణి చెప్పినవన్నీ పెదవులు బిగించి జాగ్రత్తగా విన్నాడు. అతనిలో దురాశ, దుష్టవాంఛ తిరిగి పడగ విప్పుకున్నాయి.

"అయితే విజయ భారతి పేర రెండు లక్షలు జమ పడిందంటావు!"

"ఆ విషయం నాకు తెలియదు. ఈ రోజు కాకున్నా, మరొకనాడైనా ఆ మొత్తం ఆమెకు దక్కక తప్పదు.

విరంజన్ ఒక్కదుటన బయటికి దుమికాడు. విసురుగా అడ్వకేటు దగ్గరకు వెళ్ళేడు. అడ్వకేటు కన్సల్టింగ్ రూమ్‌లో మరి ముగ్గురు, నలుగురు పార్టీల వారున్నారు.

"ఏం విరంజన్?" అన్నాడు వకీలు విరంజన్ తత్తర పాటుకు ఆశ్చర్యం చెందుతూ.

"మీతో అంతరంగికంగా మాట్లాడాలి."

వకీలు నవ్వేడు "ఫరవాలేదు విరంజన్ చెప్పు" అన్నాడు.

"దేవీచరణ్‌ను మన అధీనం చేయాలని మరలా దావా చేయాలి."

"కానీ ఆ ఉత్తరువు న్యాయస్థానం వారు ఎన్నడో ఇచ్చారు. నీవే అతన్ని స్వాధీనం చేసుకోవడానికి నిరాకరించేవు. నేడు సమయం మించిపోయింది."

"ఎలా అయినా వాడిని మన అధీనం చేసుకోక తప్పదు."

"అయితే అది న్యాయస్థానం ద్వారా మాత్రం సాధ్యపడదు. మరెవరితో నయినా రాయబారం పంపించు."

"లాయర్!" విరంజన్ పిడికిలి బిగించేడు. ఉద్విగ్న

డయ్యాడు. కండ్లు మిటకరించాడు.

"విరంజన్ నీవు ప్లీడరువు కావు. ఇది కోర్టు కూడ కాదు. దేవీచరణ్‌ను అప్పగించుకొనవలసిందని కోర్టువా రెప్పుడో ఉత్తరువు జారీ చేసేరు. తిరస్కృతయై చివరికి తన నుండి తన పసికూనను కూడా విడదీయటానికి జరిగిన అమానుష ప్రయత్నానికి విలపించుతూనే, అయినా విజయ భారతి ఒప్పుకుంది. విశ్వనాథంగారి భాగ్యం చెల్లాచెదురు అయి అదృశ్యమయింది గదా అని, భాగ్యంలేని బాధ్యత గదా అని నీవు తప్పించుకుని తిరిగావు. సంపన్న హీను డయ్యేడని దేవీని నిర్లక్ష్యం చేసేవు. మళ్ళీ ఈ ప్రయత్న మేమిటి విరంజన్?"

విరంజన్ ఇంతమంచి సలహాను పట్టించుకునేంత మనిషి అయితే ఈ సంఘటన సంభవించకనే పోను.

"లాయర్ మీ ఫీజు సంగతి యోచించకండి"

వకీలుముఖం నల్లబడింది. కుపితుడయ్యాడు.

విరంజన్ ఫో ముందు. ఇక్కడ నుండి ఫో! లాయర్లంటే నీ దృష్టిలో డబ్బు పారేస్తే న్యాయాన్ని ఖూనీ చేయడానికి సిద్ధపడే హంతకులు! డబ్బు పారేసి అంతరాత్మల్ని తాకట్టు పుచ్చుకోవడం కొన్ని సమయాల్లో సాధ్యం కావచ్చు విరంజన్! ఎల్లప్పుడూ సాధ్యపడదు.

"వీల్లేదు విరంజన్ ఈ ప్రయత్నం జరగడానికి వీలు లేదు. చేసిన పాపం చాలక మాతా శిశువులను మరలా విడ

దీస్తావా? ఈ ప్రయత్నంలో నే నింకెంత మాత్రమూ ఉప కరణం కాజాలను" లాయర్ నిప్పులు కక్కాడు.

విరంజన్ అక్కసుగా వెళ్ళిపోయాడు.

లాయర్ రమాకాంత్ ఆగ్రహం చూచి, వచ్చినపార్టీలు విస్మితులై నెమ్మదిగా జారుకున్నారు.

"పొండి, పొండి ... వట్టి మూర్ఖులు, నికృష్ట ప్రపంచం యిది. మనిషికి లంచం పెట్టి విషాన్ని త్రాగించగల ధర్మాన్ని పెంపొందించు తున్నది" అని గొణుగుకున్నాడు.

రమాకాంతరావుకి తన మీద తనకే అసహ్యం పెల్లుబికింది. నిత్యమూ తనేదో హత్య చేస్తున్నాననిపించింది.

ఒక స్త్రీ జీవితాన్ని నిలువునా భూస్థాపితం చేస్తే ఇరువది ఐదు వేలు ఫీజు!

ఒక పసికూనను అనాథగా చేస్తే మరో పదిహేను వేలు!!

*

ఇది వర్తమాన న్యాయం! చట్ట సమ్మతమైన ధర్మం!!

# 34

రమాకాంత్ పశ్చాత్తాప హృదయంతో దిగాలుపడి కూర్చున్నాడు. వీధిలో గాజుల చప్పుడు వినవచ్చింది. ఉదాసీనంగా బయటికి చూశాడు.

నీలికలువవలే విజయభారతి నెమ్మదిగా నడచివస్తున్నది. ప్రక్కనే ఆమె కాళ్ళనంటి నడచివస్తున్న రెండు, మూడు సంవత్సరాల వయసుగల పసిబిడ్డ దేవీచరణ్.

ఆమె ఒకప్పుడు సర్వసంపన్న. సర్వాలంకార శోభిత స్త్రీ! ఇప్పుడు నిరాభరణ, అలంకారహీన, కాలికి చెప్పులైనా లేకుండా ముంజేతికి మట్టిగాజులతో నడచివస్తున్న భారతిని చూచి రమాకాంత్ హృదయం తల్లడిల్లిపోయింది.

"నమస్కారం రమాకాంత్ అన్నయ్యా"

రమాకాంత్ మౌనంగా లజ్జపడుతూ కుర్చీచూపెట్టేడు

భారతి పొందికగా కుర్చీలో కూర్చుని చీర భుజాల మీద కప్పుకుంది.

దేవీచరణ్ దోసపండులాగా ఆమె చీరను పెనవేసుకుంటూ రమాకాంతరావువంక కుతూహలంగా చూస్తున్నాడు.

ఆ పసికూనను చూడగానే రమాకాంత్ హృదయం తరుగుకొనిపోయింది.

"మీ మావయ్య రమాకాంతరావుగారు నాన్నా నమస్తే పెట్టు".

దేవీచరణ్ తమలపాకుల్లాంటి తన చిన్ని చేతులను ఎత్తి నమస్కారం పెట్టేడు.

రమాకాంత్ హృదయం రెండుగా చీల్చినట్లయింది.

"వీడు దేవీచరణ్ ప్లీడర్! వీడు అప్పుడే రెండుసార్లు కోర్టు ముఖం చూడవలసివచ్చింది."

రమాకాంత్ నిర్విణ్ణుడయ్యాడు.

"వీడిని గురించే మీకు, విరంజన్‌కు అనవసర శ్రమ కలిగించాను కోర్టులో!"

రమాకాంతరావు కన్నీటిని ఆపుకోలేకపోయాడు. అశ్రువులు జలజలా రాలాయి.

"లేదమ్మా లేదు. నేనే నీ మనఃక్లేశానికి కారకుడ్నయ్యాను. ఈ పాపిష్ఠి వృత్తి అలాంటిది! నిరపరాధుల హస్తాలకు బేడీలు వేయించడానికి తప్ప మరొక ప్రయోజనం లేనిది" రమాకాంత్ గొంతు జీరపోయింది.

"మీరు బాధపడతారెందుకు ప్లీడర్! మీరు కాకున్నా మరొక ప్లీడరయినా కేసు నడచివుండేదే గదా! ఇంతకూ నా అదృష్టం అలాంటిది. జీవితాన్ని పొందుపరచుకోవడం నాకు చేతకాకపోయింది. ఈ పసికూనే లేకుండావుంటే

నిరంజన్‌కు ఇంత శ్రమ కలిగేదే కాదేమో !"

భారతి చీర చెంగుతో కండ్లు వత్తుకుంది.

"నీకెంత బాధకలిగిందో కదా భారతీ ! ఇంత జరిగినా ఆ వ్యక్తికి ఏ కోశానా జాలి అనేదే లేదు. దేవీచరణ్ కోసం దావా చేయమని మరలా ఇప్పుడే వచ్చేడు."

భారతి నిర్విణ్ణురాలయింది. ఆమె వదనం కాంతివిహీన మయింది. "నిరంజన్ మరలా వచ్చేరా ?!" అంది హీన స్వరంతో.

"అవును భారతీ వచ్చేడు. ప్రాణం నిలపడానికి డాక్టర్లకు, దావా గెలిపించడానికి వకీళ్ళకు కావలసింది ఒక్క డబ్బేనని ప్రపంచం ఉద్దేశ్యం. ప్రతి జీవికీ ప్రాణదానం చేయాలని ప్రతి డాక్టరుకు వుంటుందని, ప్రతి దావాలోనూ న్యాయం నెగ్గేట్లు చేయాలని ప్రతి వకీలుకు వుండవచ్చునని ఎందరికి తెలుసు? ఈ పసివాడి పేరుమీదుగా అన్యాయం ఎలా చేయను భారతీ !" అన్నాడు గాద్గదికంగా.

భారతిలో దైన్యం మూర్తీభవించి మౌనం ధరించింది. తనకు సంబంధించిన ప్రతి విషయమూ ఇంత శరవేగంగా తెలుస్తుందని ఆమె ఎన్నడూ భావించలేదు. భారంగా నిట్టూర్చింది.

"ఇందులో అన్యాయం ఏముంది రమాకాంత్ బాబు ! స్త్రీని అర్ధాంగిగా స్వీకరించినందువల్ల ఏర్పడిన అధికారం ఇది. నిరంజన్ అదే చెలాయించుకుంటున్నారు.

కానీ వ్యక్తికి ఒక స్థాయి, గౌరవం, ప్రతిష్ఠ వుండ వలసిన అవసరం లేకపోతే ప్రపంచంలో ఎవరికి వలసిన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు వారికి లభించేవేమో ప్లీడర్ ! విశ్వనాథం గారు చేసిన అప్పులు ప్రతి నయాపైసా చెల్లించడమే నా, పొరపాటు అయివుండాలి. లేక ఈ పాపంలో భాగస్వామ్యం లేకపోయినా పాపభారం వహించవలసివచ్చిన ఈ పసివాడి నొసటివ్రాత అయినా అయివుండాలి." భారతి కండ్లనుండి రెండు అశ్రుబిందువులు రాలిపడ్డాయి.

రమాకాంతరావు హృదయం దేవినట్లయింది.

"మొన్న రెండురోజులనాడు..." అని ఏదో చెప్ప బోయింది భారతి.

"రమాకాంత్ ! రమాకాంత్ !" వీధిలోనుండే పిల్చు కుంటూ చరచరా వచ్చింది మదిర. అనుకోనని స్థలంలో భారతి ఎదురుపడటంతోనే తొట్రుపడింది మదిర. తటపటాయించింది.

"మరలా ఎప్పుడయినా కలుసుకుంటాలే ప్లీడర్ !" అని దేవీచరణ్‌ను నడిపించుకుంటూ మదిర దగ్గరగా వెళ్ళింది విజయ.

"మదిరా నీవు నా అక్కవు. ఈప్రపంచంలో నాదయిన ప్రతి వస్తువునూ నీవు మనసుపడితే త్యాగంచేసేను. కానీ ఇటు చూడక్కా ! దేవీ నా రక్తాన్ని పంచుకొని పుట్టాడు. వాడు లేని క్షణం నాకు గాఢాంధకారం. ఈ మినుకు, మినుకు మనే నక్షత్రాన్ని కూడా రాల్చుకోవాలా అని దుఃఖంతో వేగంగా

కదలిపోయింది. మదిర నిశ్చేష్టితురాలై అప్రయత్నంగా దారి తొలిగింది.

# 35

"ఆనంద్ ! ఆనంద్ !" శ్యామసుందరి ఆందోళనగా పిలుచుకుంటూ వచ్చింది.

"ఏం సుందరీ ?"

"విజీ ఎక్కడుంది ?" శ్యామసుందరి భయంతో కంపించి పోతున్నది.

"ఎక్కడికో బయటకు వెళ్ళినట్లున్నది."

"ఎక్కడికి ? దేవీచరణ్ ఎక్కడా కనిపించడేం ?"

"ఇంతకూ నీవు వెళ్ళిన పని ఏమైంది సుందరీ ?" నెమ్మదిగా ప్రశ్నించేడు.

"మన ఊహలన్నీ చెల్లాచెదరయ్యాయి ఆనంద్. అసలు విషయం ఇప్పుడు తెలిసిందంటే విజీ తన జీవితాన్ని సరిచేసుకోకపోవడం మాత్రమే కాదు. సర్వనాశనం చేసుకుంటుంది." శ్యామసుందరి గట్టిగా నిట్టూర్చింది. ఆమె ముఖంలో విచార రేఖలను చూచిన ఆనంద్ ఆందోళనపడ్డాడు.

"ఆనంద్ ! మనం అనుకున్నట్లు మదిర విజయకు

పరాయి వ్యక్తేమీ కాదు. స్వయానా అక్కయ్య".

ఆనంద్ ఉలిక్కిపడ్డాడు. అంతలోనే బిగ్గరగా నవ్వేడు. "ఇంతాచేసి నీవు సేకరించితెచ్చిన సమాచారం ఇదా సుందరీ? విజీ అందరికీ మదిర తన అక్క అనే చెప్పింది. అక్కకన్న ఎక్కువగా కూడ..."

"అవును. విజీ మదిర తన అక్క అనే చెప్పింది. అక్క కన్న ఎక్కువగా కూడ ఆదరించింది. కానీ మదిర తనకు నిజంగానే అక్క అనే విషయం మాత్రం విజీకి తెలియదు ఆనంద్!" శ్యామసుందరి కంఠం రుద్ధమయిపోయింది.

"అంటే!"

"నిత్యమూ విశ్వనాథంగారిని 'అన్నా! అన్నా!' అని పిలిచిన మధురమ్మ వుంది చూచేవు?"

"అవును" అన్నాడు విమలానంద్ ప్రాణా లుగ్గబట్టు కుంటూ.

"ఆమెకు విశ్వనాథంగారి వల్ల కలిగిన బిడ్డే మదిర".

"శ్యామసుందరీ!" ఆనంద్ మెదడులో ఆకస్మికంగా ఓ పెద్ద డైనమైట్ పేల్చినట్లయింది. తల విదిల్చాడు.

"నీవు చెబుతున్నది వాస్తవమేనా సుందరీ?"

"అదేం ప్రశ్న ఆనంద్. ఏ ఆధారమూ లేకుండానే ఇంత పెద్ద ఆరోపణ చేస్తున్నానని నీ భావమా?"

"అయితే ఇదెలా సంభవం శ్యామూ? విశ్వనాథం గారూ...మధురా...?"

శ్యామసుందరి గాఢంగా నిట్టూర్చింది. "ఇది కులీన జీవితం ఆనంద్ — పరువు, ప్రతిష్ఠ, అంతస్థు, ఐశ్వర్యం అన్న వే జీవితానికి పునాదులు. ఈ పునాదులు గట్టిపడ టానికి ఎందరి మానమర్యాదలు, నీతి గౌరవాలు మంట గలిసినా విచిత్రం కాదు. ఇందుకు ఆత్మవంచన, గుప్తజీవనం ప్రధాన మార్గాలు! కాకపోతే చూడు. 'విజీ' జీవితంలో సంభవించిన సంఘటనలన్నీ సంభవాలయ్యే సంభవించేయా ?"

ఆనంద్ రాయిలా కూలబడ్డాడు. ఈ బాహ్య జీవనా లకు, రహస్య బంధుత్వాలకు, అంతర్గత రాగపాశాలకు, ఆత్మవంచన జీవన పథాలకు పరిమితులు, హద్దులు ఎక్కడో అతనికి అర్థం కాలేదు.

విశ్వనాథంగారిని అన్నా!అని పిలిచిన మధుర ఆయనకు రహస్యప్రియురాలు.

విరంజన్‌ను అన్నా అని పిలిచిన, విజయతో అక్కా అని పిలిపించుకున్న మదిర విరంజన్ ఉంపుడుగత్తె. అభిసారిక. ప్రపంచానికి వెరవని కృతఘ్ని.

శ్యామసుందరే ఘనీభవిస్తున్న నిశ్శబ్దాన్ని చెదర గొట్టింది.

"మధురమ్మకు, విశ్వనాథం గారికి ఇలాంటి రాగ పాశాలున్నాయని చాలామందికి తెలియని మాట వాస్తవం! బహుశ ఈ విషయం మదిరకు కూడా తెలియదు.

"మధురమ్మ విధవ అయిన రెండు మాసాలకు ఆమె

నాలుగు మాసాల చూలాలని చెప్పబడింది. కానీ ఆమె విధవ అయిన పది మాసాలకు 'మదిర' జన్మించింది. ఈ విషయం చాలమంది గమనిక చేసేరు."

శ్యామసుందరి కొంచెంసేపు మౌనం వహించింది. "ఈ విషయం విజీకి తెలియకుండానే ఇక్కడ నుండి పంపివేస్తే ఎలా వుంటుంది ఆనంద్ బాబు?"

"బాగానే వుంటుంది. కానీ మరొక వ్యక్తి సలహాను సారం జీవితం నడిపించగలిగతే విజయ కీ స్థితి రాకనే పోను. దానికి తోడు విజయకు నిన్న అర్ధంతరంగా రెండు లక్షల రూపాయలు మొత్తం వచ్చి పడింది. దానికి విజయ హాస్త గతం చేసి కూర్చోవడానికి విరంజన్ ఎప్పుడూ ఒప్పుకోడు."

"రెండు లక్షలా?" శ్యామసుందరి తుళ్ళిపడింది. ఆమెలో ఈషణ్మాత్రం మిగిలివున్న ఆశకూడా నేలమట్ట మయింది.

"ఎలా?" అంది ఆశ్చర్యంగానూ, సందేహంగాను.

విశ్వనాథంగా రొకప్పు డేదో కంపెనీలో వాటా కలిశారు. అది నేడు బయటికి వచ్చింది. శ్యామసుందరి భగ్గున మండి పోయింది. "ఈ పాపిష్ఠి సంపద, సౌభాగ్యం విజయ జీవితాన్ని కాలబట్టి నేలరాసినతరువాత కూడా ఇంకా హాత మార్చుతున్నది. ఈ సంపదా సౌభాగ్యాలే విజయ జీవితానికి సుఖ శాంతులు లేకుండా అడ్డుగా పెద్ద గోడ్డలిపెట్టు పెడుతున్నాయి. అసలిదెలా సంభవించింది?"

"విశ్వనాథంగా రేదో ఫార్మాచ్యూటికల్ కంపె నీలో ఒకప్పుడు పదివేలు పెట్టుబడి పెట్టారు. ఆ సంగతి నేటికి తెలిసింది. ఆ కంపెనీ లాభాలు తీస్తున్నది."

"లాభాలు కాదు ఆనంద్ బాబూ! విజయ ప్రాణాలు తీస్తున్నది. ఆనాడు విశ్వనాథంగారు డబ్బు సంపాదించి గాలి గోపురాలు కట్టి విజీ జీవన సౌధపు పునా దులు త్రవ్వి వేశారు. ఈనాడు ఈ అర్ధంతరపు ఆస్తి వచ్చిపడి విజీ జీవితాన్ని దగ్ధం చేస్తున్నది."

"అవును సుందరీ! కొందరి హృదయాలకు ఎప్పుడూ శరాఘాతాలు తగులుతూనే వుంటాయి. దానికి ఎన్ని తూట్లు పడ్డాయన్న విషయం వేటగాడికి అవసరం లేదు" అన్నాడు దిగాలుగా.

ఇంతలో విజీ తల వంచుకొని నేరుగా లోనికి వచ్చే సింది. ఆనంద్ బాబు, శ్యామసుందరి ప్రాణా లుగ్గబట్టుకొని బిక్కు బిక్కు మని చూస్తూ మౌనంగా వుండి పోయారు. విజయ లోనికి వెళ్ళిపోయింది. ఆమె వదనంలో నిశ్చలత! దృష్టిలో కృత నిశ్చయం!!

"నీవు ఎక్కడికి వెళ్ళేవు బాబూ?" శ్యామసుందరి దేవీచరణ్‌ను లాలనగా ప్రశ్నించింది అతన్ని గుండెలకు హత్తుకుంటూ.

"ప్లీడరు మామయ్యగా రింటికి" నత్తుతూనే చెప్పేడు చరణ్.

విమలానంద్, శ్యామసుందరి అదిరి పడ్డారు. ఎంతో ప్రమాదం జరిగి పోయినట్టు వారి ముఖాలు కళవళ పడ్డాయి.

ఇద్దరూ భయం భయంగా లోనికి వెళ్ళేరు. వారు వచ్చిన విషయం అయినా గమనించ కుండా విజయ వంట ప్రారంభించింది. కత్తిపీట ముందర వేసుకుని దోసకాయలు చెక్కు తీస్తున్నది.

"ప్లీడరు దగ్గరకు వెళ్ళేవా విజీ?" అంది శ్యామ సుందరి పీట వాల్చుకుని కూర్చుంటూ. చరణ్ ఆమె ఒడిలోకి చేరేడు.

"అవునక్కా చరణ్‌ను తన కప్పగించ వలసిందని విరంజన్ తిరిగి దావా తెస్తున్నారు" అంది శిరస్సు వంచుకునే.

"ఎప్పుడు?" ఆనంద్ క్రుద్ధుడయ్యాడు.

"దావా చేయవలసిందని ఇవ్వాళ రమాకాంత రావుతో చెప్పారుట. తానీ దావా నడపజాలనని రమా కాంతరావు గారు జవాబిచ్చేరు." విజయలో తొట్రుబాటు కూడ అవుపించ లేదు.

"ఇలాంటి పరిస్థితులలో నీవు ఒంటరిగా తిరగడం మంచిదికాదేమో విజీ! అందులో దేవీచరణ్‌ను బయటికి తీసుకు వెళ్ళడం ప్రమాదకరం?" అంది శ్యామసుందరి.

విజీ విషాదంగా నవ్వింది. "నీకా భయం ఏమీ అవసరం

లేదక్కా. విరంజన్‌కు నామీద భ్రమతవున్నా, చరణ్ మీద అనురాగం వున్నా ఇంతవరకు వచ్చేదేకాదు. విరంజన్‌కు కావలసింది చరణ్ ఒక్కడే కాదు. చరణ్‌తో కూడా వచ్చే ఆస్తి కూడా కావాలి.

విమలానంద్ మౌనంగా వూరుకున్నాడు. అతనిలో అసహ్యం వెల్లువికి వచ్చింది. శ్యామసుందరి సాహసించింది.

"విజీ ఎవరికీ హాని చేయని నీవు తలవంచుకొని సంఘంలో పడి వుండవలసిన అవసరం ఏమిటి? ఎక్కడికయినా దూరంగా వెళ్ళిపో! ఆనంద్ నీకు ఆసరాగా వస్తాడు."

"అక్కా!" విజయ కంపించిపోయింది.

"సుందరీ" ఆనంద్ వారించినట్లు పలికేడు.

విజయ కొంచెం సేపు మౌనం వహించింది. ఆమె శరీరం నిలువెల్లా కంపనం.

"అదృష్టాన్ని అందరూ అందుకోలేరులే అక్కా. దానిని అందజేయాలనుకొనేవారికి నిష్ఫల శ్రమ తప్ప మరేమీదక్కదు."

శ్యామసుందరి ధైర్యాన్ని పుంజుకుంది.

"విజీ! నీ మంచితనాన్ని, విశాల హృదయాన్ని ఈ ప్రపంచం తిరస్కరించింది. కాలదన్నింది. ఇంత నిర్దయను, అమానుషత్వాన్ని ప్రదర్శించిన వారిపట్ల కూడా ఉదాసీనతా?"

విజీ మౌనంగా వూరుకుంది.

"విజీ మనం ఆదర్శ మహిళలం కాకపోవచ్చు కానీ ప్రపంచం మనను ఏ విషయానికి నిందించుతున్నదో ఆ నిందా భారాన్ని అపారంగా భరించుతూనే అచేతనంగా వుండ వలసిన అవసరం లేదు మన ఉపేక్షా భావాన్నే ఈ ప్రపంచం బలహీన స్వభావం క్రింద పరిగణించుతున్నది. మనందరి జీవి తాలు ఇలా అడివిగాచిన వెన్నెల కావలసిన అవసరం ఏమి టమ్మా చెల్లీ?" శ్యామసుందరి గొంతు జీరపోయింది. కండ్లు నిండుగా నీరు క్రమ్మినట్లయింది.

చేతితో విజీ చుబుకాన్ని పట్టుకొని లాలనగా ముఖం పైకెత్తింది.

విజయ కండ్లనుండి విషాద వేదనా బాష్పాలు జలజల రాలేయి. శ్యామసుందరి హృదయంలో ఇమిడిపోయి గావురు మంది. శ్యామసుందరి కండ్లు ఆర్ద్రమయి, హృదయం భార మవుతూ వుండగానే విజయను ఓదార్చింది. బాధపడింది.

"నేనెంత మూర్ఖురాలని చెల్లీ? నోటికి వచ్చినట్లు ఏదో వాగేను. క్షమించు" అంది తన భుజాలమీద గడ్డం పెట్టుకుని వెక్కిళ్ళు పడుతున్న విజయ వీపు నిమురుతూ పొంగి వచ్చిన దుఃఖాన్ని తనలోనే అణచుకుంది.

"నా జీవితంలో శాంతి సౌఖ్యాలకు స్థానంలేదక్కా" అంది కుములుతూ.

శ్యామసుందరి కంట తడిపెడుతూనే విజయను ఓదా ర్చింది. "ధైర్యం వహించు. సాహసం తెచ్చుకో" అంది.

విమలానంద్ కొయ్యబారిపోయి చూస్తున్నాడు. దేవ తలై వెలసిన స్త్రీలు, దైన్యంగా తలదాచుకొని హీనంగా బ్రదకడానికి కూడా ప్రపంచం ఎందుకు చోటివ్వడం లేదో అతనికి అర్థంకాలేదు.

పళ్ళు, పిడికిలి బిగించి ఎక్కడికో వెళ్ళడానికి ఉద్యుక్తు డయ్యాడు.

శ్యామసుందరి అశ్రుపూరిత నయనాలతోనే అతన్ని వెనక్కు పిలిచింది.

తూర్పు దిక్కుగా ప్రారంభమై ప్రపంచం అంతటా అంధకారం అలుముకుంది పశ్చిమ దిక్కుగా శుక్రగ్రహం దేదీప్యమానంగా ప్రకాశించింది.

శ్యామసుందరి కర్తవ్యాన్ని సూచించింది. "లే చెల్లీ! లే! జీవితం నిత్యకళ్యాణమూ, పచ్చతోరణం లాంటిది. దానిని నిరసించడం కసి తీర్చుకోవడం అవుతుందేమో గాని పరిష్కారం మాత్రం కాదు. బ్రదుకు, కనీసం పసిగందుకోసం అయినా బ్రదుకు." శ్యామసుందరి విజయను మృదువుగా హెచ్చరించింది.

# 36

నవల ఇంతవరకు నడుపుకొని వచ్చే సరికి కొన్ని పాత్రలకు తలలు పెంచి వాటిని త్రుంచి వేస్తున్నానని, మరి కొన్నింటి ప్రసక్తే ఎత్తుకోవడం లేదని పాఠకులకు అనిపించు తుంది. కానీ నేనేం చేయను ?

మనుషులంతా నిష్కల్మష మానవత్వంతో జీవితాలను నింపుకొని తమజీవితాన్ని బాహాటంగానే ఆచరించితే ఈనవలా ప్రక్రియే శుద్ధ దండుగ. అలా కాక పరద్రోహం, ఆత్మద్రోహం చేసుకుంటున్న కొన్ని కుక్కల జీవితాలను గురించి విడ మరచి వ్రాయాలంటే రచయిత కయినా కష్టంగానే వుంటుంది.

కాకుంటే మరి ? జీవితంలో కొందరు ప్రపంచాన్ని బాగు చేద్దామనే సద్బుద్ధితో తాము త్యాగం చేసి చెడిపో తారు. మరికొందరు తామేదో పొడిచివేసి ప్రపంచాన్ని బాగుచేస్తామని గప్పాలు కొట్టి గోతులు తవ్వుతూ వుంటారు. వీరిలో ఎవ్వరు మంచివారో, ఎవ్వరు దుష్టులో నేను చెప్ప వలసినంత అవసరం లేదు.

ఉపేక్ష, విజయ భారతి జీవితంలోంచి నిష్క్రమించి

చీకట్లను త్రవ్వి పోయడానికి ఎంత హేయమైన కారణం సరి పోలేదు? విశ్వాసరావు గారు, విశ్వనాథం గారితో సంబంధం కలుపుకోవడానికి వినాయకరావు మాటలు ఎంతగా తోడు పడలేదు.

అలాగే విరంజన్ విజయ మీద పగబట్టా డంటేనూ, మదిర తన ప్రాణ స్నేహితురాలి జీవితాన్ని పునాదులతో సహా కదలించిందంటేనూ వారి తత్త్వం ఏమిటో తెలియదూ?

విరంజన్ మదిరల కథను మరింత పొడిగించి హేయ మైన వారి జీవితాలలోని కల్మషాన్ని మరింత ప్రోగుచేసి పోయవలసిన అవసరం నాకేమిటి? ఎక్కడో బ్రదుకుతారు. ప్రపంచంలో ఎన్ని కుక్కలు బ్రదకడం లేదు. వారు మరింత ఎంతగా నీచులో తెలియ జేస్తేగాని విజయ మీద మీకు సానుభూతి కలగని పక్షంలో విజయ జీవితమే నిరర్థక మవు తుంది. ఆమెలోని ఉదారత, లొంగుబాటు, ధైర్యసాహ సాలకు ఔన్నత్యమే లేకుండా పోతుంది.

కనుకనే సంఘానికి పనికిరాకుండా, చీడపట్టి పుచ్చి పోయిన కొన్ని కొమ్మలను ఇక్కడే ఛేదించి దూరంగా పార వేస్తున్నాను. మిగతా వైనా విజయ జీవన వృక్షాన్ని నిలిపే ప్రయత్నంలో జయప్రద మౌతాయేమో చూస్తాను.

విజయ భారతి కృత నిశ్చయంతో చెప్పిన విషయం విని వకీలు రమాకాంతరావు ఆశ్చర్య పోయాడు. తను దేన్ని రక్షించ గలిగానని భావించుకుంటున్నాడో దాన్ని విజయ

అత్యల్పంగా పరిగణించి దూరంగా త్రోసివేస్తున్నది.

"విజయ భారతీ నీవు చేస్తున్న పని దేవీచరణ్‌కు అన్యాయం చేయడం లాంటిదమ్మా" అన్నాడు చివరి సలహాగా.

విజయ భారతి చలించలేదు.

"అంతేనేమో అన్నాయ్! కావాలని కల్పించుకున్న మమతలూ, ఇతరులకు ద్రోహం చేసి గడించిన సంపదా, పుస్తకాలలో ఇరికించిన న్యాయ సూత్రాలూ, చట్ట ధర్మాలూ కూడా మా జీవితాలను బాగుపరచలేక పోయాయి. దేవీ చరణ్ భవిష్యత్తుకు కావలసింది శాంతి ఒక్కటేనని, సంపద కాలసర్పంలాంటదని ఒక అభిప్రాయం నాలో పాతుకుని పోయింది. ఆ శాంతిని వాడి కేర్పరచడానికి స్త్రీగా నేను చేయగలిగిం దింకేముంది? వస్తానన్నాయ్! మీ మేలు జీవితంలో ఎన్నడూ మరచిపోలేను. ఈ బ్యాంకు చెక్కు, ఫార్మాస్యూటికల్ కంపెనీ వాటాల హక్కు పత్రాలు వారి కందచేయండి. ఇంక నా దగ్గర చిల్లి గవ్వ కూడా లేదని చెప్పండి." విజయ రమాకాంతరావుకు నమస్కారం చేసి వెళ్ళి పోయింది.

రమాకాంత్ క్రుంగిపోయాడు. ఈ నిర్మల మాణిక్యాన్ని ఛిన్నాభిన్నం చేసి విరంజన్ ఎంత విషాన్ని ప్రోవు

చేసుకున్నాడో ? ఎంత పాప పర్వతాన్ని రూపొందించాడో అతనికి అవగతం కాలేదు. అతని మనసు వికలమై పోయింది.

"ప్లీడర్ ?"

"ఎవరు ?" రమాకాంతరావు ఆ లో చ న ల్లో ం చి తేరుకున్నాడు.

ఎదురుగా విరంజన్ అగ్గి బరాటాలాగా నిప్పులు కక్కుతున్నాడు.

రమాకాంత్ హృదయంలో క్రోధం ప్రజ్వరిల్లింది. అయినా ఆవేశాన్ని అణచుకున్నాడు.

"ఏం ! విరంజన్ ?"

"మీరు వకాలునామా పుచ్చుకో నన్నారు ?"

"అవును"

"అయితే దానికి సంబంధించిన రికార్డిలా పారేయండి.

"అందుకు పాతికవేలు ఫీజుగా చె ల్లి ం చ వ ల సి వుంటుంది !"

"ప్లీడర్ ! ?"

"ఏం విరంజన్ ? ఆ పత్రాల విలువ ప్లీడరు నయిన నాకు తెలియకుండా వుంటుందా ? అవి నీకంత అవసరమని భావించితే వెంటనే ఆ మొత్తం ముందు చెల్లించు."

"రమాకాంత్ ? !" విరంజన్ క్రుద్ధుడయి పోయాడు.

వకీలు గట్టిగా నవ్వేడు. "ఆగ్రహం కలుగుతున్నదా విరంజన్ ? జీవితాలనే బ్లాక్ మెయిల్ చేసి భూస్థాపితం చేయ సమకట్టిన ధీరుడివి ! ఈ మాత్రం ప్రత్యర్థిని ఎదుర్కొన లేవా ? మూరుడా ? ..."

విరంజన్ తారాజువ్వలా లేచేడు. "రమాకాంత్ ! మీ రొక్కరే ప్లీడరు కారు. ఈ దావాను మరొకరిచేత క్షణాల మీద నడిపించగలను." అతని గొంతులో ప్రతీకార భావం స్పష్టంగా ప్రకటిత మైంది.

"అంత అవసరం నీకు రాదులే విరంజన్. ప్రపంచంలో మానవత్వం మిగిలి వున్నంత వరకు అమానుషత్వం ఇలా పిచ్చి వేషాలు వేస్తూనే ఉంటుంది. అంతేకాదు. ఆ అమాను షత్వంచేతిలో ఆర్థిక సంపద వున్నంతవరకు ఎవ్వడో ఒకడు ఆత్మగత మానవత్వాన్ని ఆత్మహత్య చేసుకుని న్యాయహంత కుడుగా తయారవుతూనే వుంటాడు. అందువల్లనే మీలాంటి దుష్టశక్తులు విజయ గర్వంతో రొమ్ము విరచుకుని న్యాయ ధర్మశాస్త్రాల ఉనికినే సవాలు చేస్తూ వుంటాయి. ఛీ—

ఇదిగో ! ఇదేగా నీకు కావలసింది ? విజయ భారతి చేతికి వచ్చిన రెండు లక్షల రూపాయలేగా ? తీసుకో. ఫార్మా చ్యూటికల్ కంపెనీ వాటాల హక్కు పత్రాలు అతని ముందు పారేసేడు.

"సుఖపడు విరంజన్ ! విజయ భారతిని, దేవీచరణ్‌ను శాంతిగా వుండనివ్వడానికి భర్తగాను, తండ్రిగానూ నీవు

కోరిన లంచం యిది. ఈ కుళ్ళిపోయిన మాంసం ముక్క కోసరం మళ్ళీ నీవు ఎత్తుగడలు వేస్తున్నావని తెలియక ముందరే విజయ దాన్ని నీ ముఖాన గొట్టమని ఇచ్చింది."

రమాకాంత్ విజయ భారతి ఇచ్చి వెళ్ళిన రెండు లక్షల రూపాయల చెక్కునూ విరంజన్ ముఖాన పార వేశాడు.

విరంజన్ ముఖం నల్లగా కమిలిపోయింది. ఇంత పెద్ద చెంపపెట్టు పడుతుందని అతను భావించలేదు.

"చరణ్ భవిష్యత్తు తప్ప ఈ డబ్బే నా ప్రధాన ఉద్దేశ్యం కాదు. "రెండు లక్షల చెక్కును, కంపెనీ వాటా హక్కుల పత్రాలను జేబులో ఉంచుకుంటూనే అన్నాడు.

రమాకాంత్ ఇంక ఆవేశాన్ని ఆపుకోలేక పోయాడు. "విరంజన్! నీద్వేషానికి దేన్నయినా అడ్డు పెట్టుకో! పసినాడి జీవితాన్ని ముట్టుకు కాదు." రమాకాంత్ దావా కాగితా లను తెచ్చి విరంజన్ మీద కుప్పగా పారవేశాడు.

విరంజన్ తన అవమానాన్ని అక్కడే దులిపి పారవేసి దావా కాగితాలను పొందికగా పట్టుకుని, కంపెనీ షేర్లను జాగ్రత్త పరచుకుని, బ్యాంకు చెక్కు జేబులో వుంచుకుని నడచి వెళ్ళిపోయాడు.

అంతిమ క్షణంలో నయినా అతనిలోని మానవత్వం వెల్లగిలి వస్తుందేమోనని ఎదురు చూచిన రమాకాంతరావు నిర్విణ్ణు డయ్యాడు.

# 37

నిర్మలంగా వున్న విజయ వదనం చూచి శ్యామసుందరి సంతోషపడింది. విజయ తన గత జీవితాన్ని ఒక్కక్షణం మరచి పోగలిగినా ఆనందపడేవారిలో శ్యామసుందరి ఒకతె.

"ఈ రోజు దేవీ ఆలయానికి వెడదామా అక్కా?" అని విజయ ప్రశ్నించగానే శ్యామసుందరి తల ఊపింది. తనకు దైవం ఉనికిమీద నమ్మకం లేకున్నా, విజయకు దైవం పట్ల ఎనలేని భక్తివిశ్వాసా లున్నాయి. బహుశ ఆభక్తి విశ్వాసాలవల్లనే ఇంత హాలాహలాన్నీ దిగమ్రింగుకొన గలుగుతున్న దేమో అనుకుంది శ్యామసుందరి.

"అలాగే విజీ తప్పకుండా వెడదాం" అంది శ్యామసుందరి.

విమలానంద్ నవ్వేడు.

"మీరు నవ్వుతున్నారు. విజయ దైవాన్ని ఎల్లప్పుడూ ఆరాధించుతుంది, మీ కివాళ తెలిసింది కాని" అంది శ్యామసుందరి.

"అయితే నే కూడా వస్తా" అన్నాడు విమలానంద్.

"విజయకు పూజ తెమిలేప్పటికి రాత్రి పదవుతుంది. అయినా నాస్తికులకు ఆలయా లేమిటి? మీరు ఇంటివద్దనే వుండండి" అంది శ్యామసుందరి.

విజయ ఆందోళన పడింది. "అదేమిటి అక్కా? ఆయన లేకుండా ఆరాధన ఏముంది? ఆయన రావలసిందే" అంది విజయ.

"అయితే అలానే రండి. కానీ కొంటి ప్రశ్నలు మాత్రం వేయకూడదు" అంది శ్యామసుందరి నవ్వుతూ.

విజీ ఆ రోజు తలారా స్నానం చేసింది. తెల్లని చీర ధరించింది. దేవీచరణ్‌కు కూడ శుభ్రమైన బట్టలు తొడిగింది. చెట్లనున్న గులాబీ పువ్వులు, బటానీ గుత్తులు అన్నీ కోసి తెచ్చింది.

శ్యామసుందరి ఆశ్చర్యపడింది గాని విజయలో వస్తున్న మార్పుకు సంతోషపడింది. ఆమె హృదయంలో మరింతగా పరివర్తన రావాలని ఆశించింది.

"కారు మీద వెడదాం" అన్నాడు విమలానంద్.

"కాదు నడిచే వెళదాం" అంది విజయభారతి. శ్యామసుందరి విజయ అభిప్రాయాన్నే బలపరిచింది.

విజయభారతి, ఆమెకు ప్రక్కగా విమలానంద్ నెమ్మదిగా నడుస్తున్నారు. శ్యామసుందరి దేవీచరణ్‌ను ఎత్తుకున్నది.

దారిన నడుస్తున్న ప్రజలంతా వింతగా చూచేరు. వెక్కిరించేరు. ముక్కు విరిచేరు. వారి దృష్టిలో విమలానంద్ వెర్రివాడు. శ్యామసుందరి భ్రష్ట స్త్రీ. విజయ భారతి ఆస్తి నంతా విరజిమ్ముకున్న అవివేకి.

విజయ తలవంచుకునే నడచింది. శ్యామసుందరి దేనినీ పట్టించుకోలేదు. విమలానంద్ చిఱునవ్వులు వెద జల్లుతూనే వున్నాడు.

అంధకారం అలుముకుంది. విజయభారతి పూలసెజ్జ లోని గులాబీలు సన్నగా సువాసనలు వెదజల్లుతున్నాయి. అర్ధగంట గడిచేప్పటికి కనకదుర్గ దేవాలయం మెట్లు చేరు కున్నారు.

అక్కడక్కడా విద్యుద్దీపాలను అలంకరించుకొని వరు సలు, వరుసలుగా అరమైలు ఎత్తున పేర్చివున్న ఆ మెట్లవంక విజయ తదేకంగా చూచింది. నిట్టూర్పు విడిచింది.

"విజీ ఏదో సందేహిస్తున్నావ్?" అంది శ్యామ సుందరి.

"ఈ మెట్లన్నీ నేను ఎక్కగలనా అక్కా?" భయంగా అంది విజయ భారతి.

"ప్రతిసారీ, కృషి చేసేప్పుడు నీవు సందేహంగానే ప్రారంభించుతావ్ అంత భీతి ఎందుకు విజీ. నీకు ఆసరాగా ఆనంద్ వున్నారు. నీవు ఎంతో అదృష్టవంతురాలివి. విజయకు తోడు నడువు ఆనంద్!" అంది సుందరి, నవ్వుతూ ఆనంద్‌ను విజయవైపుకు నెట్టుతూ.

"వద్దులే అక్కా! ఆయన్ను ఎడంగానే వుండనీ. ముందు ఆయన సరసనే నడవగల ధైర్యం తెచ్చుకోనీ నన్ను" అంది విజయ భారతి మొదటి మెట్టు మీద పాదం మోపుతూ.

శ్యామసుందరి, విమలానంద్ అనుసరించ సాగారు. దేవీచరణ్ శ్యామసుందరి భుజాలమీద ఇమిడి ఆమె పైట చెంగుతో దాగుడుమూత లాడుకుంటున్నాడు.

"బాబూ! బాబూ! ఎవరో వెనుకనుండి హెచ్చరికగా పిలిచేరు. ముగ్గురూ ఆశ్చర్యంగా వెనుకకు తిరిగారు. ఎవరో వ్యక్తి దగ్గరకు వచ్చి "మీరు వెడుతున్నది అమ్మవారి వద్దకు. కాలజోళ్ళు ఉండకూడదు" అన్నాడు హితబోధగా.

విజయ భారతి విమలానంద్ పాదాలవైపు అప్పుడు చూచింది.

"మీరు పాదరక్షలు వేసుకుని వచ్చారా విమలానంద్ బాబు? దుర్గదర్శనం చేసుకునేప్పుడు అవి వుండకూడదు. తీసివేయండి" అంది.

ఆనంద్ నవ్వుకుంటూ పాదరక్షలు ప్రక్కనున్న అంగడివద్ద వదలి వచ్చాడు.

"ఇదంతా వట్టి పిచ్చి విజీ! తిన్నడు కాలి చెప్పు తోనే కాళహస్తి దేవుడ్ని సేవించేడు. ఆ శివలింగం దానిని అవమానం కింద పరిగణించిన దాఖలా ఎక్కడా లేదు"

విజయ ఆందోళన పడింది. "ఇవ్వాళ్టికేమీ అడ్డు చెప్పకండి ఆనంద్. ఇది నా జీవితంలో మంచికో, చెడుకో ప్రాముఖ్యత వహించిన దినం. ఇవ్వాళ్ళైనా దైవాశీర్వచనం వుండవద్దా?" అంది ఆనంద్‌కే సమాధానం చెబుతున్నట్లుగా.

కానీ కావలసింది ఆత్మధైర్యంకాని, ఆశీర్వచనం, అనుగ్రహం కానేకాదు విజయా!"

శ్యామసుందరి మందలించింది. "ఆ ఆత్మ ధైర్యం, స్థైర్యం, ఆరాధనవల్ల, ఆత్మార్పణవల్ల ఎందుకు సాధించ కూడదు ఆనంద్ బాబు? నీ కెందుకు నీవు నడువు విజయా! ఆసరాగా నడువు ఆనంద్!" అంది దేవీచరణ్‌ను బుజ్జగించుతూ తను కూడా నెమ్మదిగా వారిననుసరించ సాగి.

పైన ఆలయంలో భక్తులు మ్రోయించుతున్న గంట విరామం లేకుండా దిగంతాల వరకూ శబ్దాన్ని వ్యాపింప జేస్తున్నది.

విజయ ఎంతో ఆశగా ఆనంద్ వైపు చూస్తూ ఆత్మ స్థైర్యంతోనే ఒక్కొక్క మెట్టే ముందుకు ఎక్క సాగింది. కానీ హృదయంలో అజ్ఞాతభీతి! అనిర్వచనీయమైన సందేహం.

ఒకటి! రెండు!! అలా ఇరవయి, ముప్పయి మెట్లు గడిచాయి. ఎదురుగా ఎత్తుగా భక్తుల సౌకర్యార్థం మూడు నాలుగడుగుల వెడల్పున చప్టా చేయబడిన పెద్ద రాతి ప్రదేశం.

చేతులలో విచ్చలవిడిగా డబ్బు చలా మణీ అవుతున్న రోజులలో తాను కూడా దైవారాధనలో పాలుపంచుకోవడానికి, భక్తుల ప్రయాణం సుకరం చేయ డానికి, విశ్వనాథంగారు నిర్మింపజేసిన చప్టా అది!

ఆనంద్ వైపు ఆశగానూ, భయంగానూ చూస్తూనే విజయ బరువుగా ఆ చప్టా మొన మీద పాదం మోపింది. ఏ భక్తుడో తిని అక్కడే పారవేసిన అరటి తొక్క పాదం కింద పడి జర్రున జారింది. ప్రమాదం జరిగిపోయింది.

విజయ ధన్ మని ముందుకు పడి ప్రక్కకు దొర్లి, తపతపా మెట్ల క్రిందికి జారింది.

ప్రక్కన కృష్ణానది హోరుమని శబ్దంచేస్తూ గావురు మంది. ఆలయంలోని గంట వికృతంగా మ్రోగసాగింది.

శ్యామసుందరి ఆనంద్‌ల ప్రాణాలు ఎగిరి పోయాయి. రివ్వున దిగి వచ్చారు. దేవీచరణ్‌ను దించి విజయ శిరస్సును ఒడిలోనికి తీసుకుంది. హృదయం వేయి శకలాలయింది.

విజయ నుదుట గాయంపడి రక్తం వెల్లువలుగా పారుతున్నది. కండ్లు మూతలు పడ్డాయి. అపస్మారకంగా పడివుంది. చుట్టూరా గుమిగూడిన జనం.

ఆనంద్ చరణ్‌ను భుజాన వేసుకుని దగ్గరలోవున్న వ్యాను దగ్గరకు పరుగెత్తేడు. అర్ధగంటలో వైద్యుని దగ్గరకు చేర్చేరు.

ఆనంద్ శ్యామసుందరి ఇద్దరూ వుండి కూడా విజయను ఒక్క క్షణంపాటు రక్షించలేక పోయారు! ప్రమాదం మెరుపులా మెరిసి ఆమెను కబళింప జూసింది.

డాక్టరు గాయానికి కట్టుకట్టి బయటికి వచ్చేడు. "ఎలావుంది డాక్టర్?" అంటూ శ్యామసుందరి, ఆనంద్ ఒకేసారి ఆదుర్దాగా ప్రశ్నించేరు.

"నుదురు చాలా పెద్దగా గాయమైంది. రక్తం చాలా ఎక్కువగా పోయింది. ఆ పైన ఆమె కిదివరకే గుండె జబ్బున్నట్లున్నది."

శ్యామసుందరి, ఆనంద్ ఇద్దరూ కొయ్యబారి పోయారు.

విజయ ఇదివరలోనే గుండె జబ్బుతో బాధపడుతు న్నదా? తమతో ఇంతవరకు మాట మాత్రం అయినా అనలేదే! ఇద్దరూ దుఃఖంతో కుమిలి పోయారు.

విజయవున్న గదిలోనికి పరుగెత్త బోయారు. డాక్టరు వారిని ఆపు చేసేడు.

"ఆమె ఇంకా అపస్మారకంగానే వుంది. కొంచెం సేపటిలో మెలకువ వస్తుంది. కానీ మనశ్శాంతి అవసరం. మనస్తాపం కలిగించే విషయాలేవీ ప్రస్తావించ వద్దు" అని హెచ్చరించేడు డాక్టరు.

శ్యామసుందరి, విమలానంద్ భయం భయంగా లోనికి అడుగు పెట్టేరు.

విజయ కండ్లు తెరిచింది. ఎదురుగా శ్యామసుందరి, విమలానంద్ తన జీవన దైవాలు. దైన్యాన్ని మూర్తీభ వించుకుని శోకమానసులై నిలచి వున్నారు. కండ్లు ఇంకె వరికోసమో వెదికాయి. శ్యామసుందరి ఆమె భావం గ్రహించుకుంది. దిగ్గున వెళ్ళి ఇంతవరకు బయట నర్సు వద్ద వుంచిన దేవీచరణ్‌ను తీసుకుని వచ్చింది.

విజయలో దుఃఖం పెల్లుబికి వచ్చింది. నుదుట ఎత్తుగా కట్టిన బ్యాండేజిని ధిక్కరించి రక్తం చిప్పిలింది. కండ్లవెంట వేదనాశ్రువులు రాలాయి.

"విజయా ఎందుకు గుండె పెగుల్చుకుంటావ్ ? నీకు క్షణాల మీద నెమ్మదిస్తుంది" అన్నాడు ఆనంద్ దుఃఖ స్వరంతోనే.

విజయ విషాదంగా పెదవి విరిచింది.

"విజీ! దిగులు పడుతున్నావా ?" అంది శ్యామ సుందరి కంపిత స్వరంతో విజయ కన్నీరు తుడుస్తూ.

దేవీ అమాయకంగా చూస్తున్నాడు. విజయ అతన్ని దగ్గరకు తీసుకుని చేతితో హత్తుకుంది.

"చూచావా అక్కా! నా జీవితపు వక్రరేఖలు సరి చేయాలని మీరిద్దరూ ఎంతగానో ప్రయత్నించారు," విజయ కంఠం గద్గద మయింది.

"ఆఘ్రాణించి నలిపి దూరంగా పారవేసిన సుమాన్ని ఆప్యాయంగా అంతర్యంలో ఇముడ్చు కోవడానికి సిద్ధపడ్డారు ఆనంద్ బాబు. నీ అదృష్టాన్నే నాకు త్యాగంచేయ సమకట్టిన అక్కవు నీవు — కానీ అదృష్టం అందరికీ అందుతుందా అక్కా! నీవు త్యాగం చేసి ఆనంద్ బాబునే అర్పించడానికి సిద్ధపడ్డావు గాని, దురదృష్టాన్ని దూరం చేయగలవా"

శ్యామసుందరి తల బాదుకుంది. "విజీ! విజీ! ఏమిటి చెల్లీ ఇది ? చరణ్‌ను చూసి అయినా బ్రదుకు అంది.

ఆనంద్ నిర్వాక్కుడై కండ్ల నీరు తుడుచుకుంటు న్నాడు.

"ఈ అదృష్టహీన కోసం మీ కండ్లనుండి కూడా కన్నీరా ఆనంద్ బాబు ? నే నెంత ధన్యురాలినో ?

చూచావా ఆనంద్ బాబు ! నాలో ధైర్యం ఆత్మ విశ్వాసం లేవని పరిహాసం చేసారు. ఈ రోజున నేను ఏర్ప రచుకొన బోయిన ధైర్యాన్ని, ఆత్మ విశ్వాసాన్ని కూడా దైవం అపహాస్యం చేసింది. ఇది దైవేచ్ఛ కాదని చెప్ప గలరా?" అంది విజయభారతి.

ఆనంద్ దుఃఖాన్ని ఆపుకోలేక పోయాడు. ఇప్పుడ వన్నీ ఎందుకు గుర్తుకు తెచ్చుకుంటావు కలువా ? అనిముఖం చేతులతో కప్పుకున్నాడు.

పిలవండి ఆనంద్ బాబు ! అలాగే నోరారా కలువా అని పిలవండి. ఇలా ఒకటికి పదిసార్లు పిలిపించుకోవాలనే అంత ర్యం అనేకసార్లు ఉరకలు వేసింది. కానీ నేనే శృంఖలాలు వేసేను. ఇవ్వాళ మీ రలా పిలుచుకోడం కన్న చేయగలిగిందీ లేదు. అలా పిలిపించుకుని సంతృప్తి పడడం కన్నమరో అను భూతీ నాకు దక్కదు." విజయ కుళ్ళి పోయింది.

విజయ నుదుటి నుండి ఇంకాస్త రక్తం చిప్పిలింది. ఆమె అంతర్యం మరింత ఆందోళన పడింది. హృదయంలో బాధ మరింత అధిక మయింది. గుండె పట్టుకొని శ్వాస నిలిపి బాధపడింది.

ఆనంద్, శ్యామసుందరి తెల్లగా పాలిపోయారు. వారి పెదవులు వణక సాగాయి.

విజయ నరాలు త్రెంచుకొని శక్తి తెచ్చుకుంది.

"నీవు బాధ పడతా వెందుకక్కా? మీరిద్దరూ నాకు చేసిన లోటేముంది? ఆలికాని స్త్రీ కోసం ప్రపంచ నింద మోయడానికి ఆనంద్ బాబు, రక్తం పంచుకొని పుట్టని సోదరి కోసం త్యాగం చేయడానికి నీవు సిద్ధపడ్డారు." విజయ గుండె పట్టుకుని మూలిగింది గుండెపోటు మరో తెర వచ్చింది.

నర్సు పరుగెత్తుకొనివచ్చి, ఆగ్రహ పరవశురాలయింది. "మీరింక ఒక్కక్షణం కూడా వుండడానికి వీల్లేదు. పేషెంటుకు మనస్తాపం కలిగించవద్దని డాక్టర్ ఎంతగానో చెప్పేరు" అంది విజయ తలగడా సర్దుతూ.

విజయ ఆమె ముంజేయి పట్టుకుని నిలిపింది. "నర్సు! మీరు చేసేది పరోపకారమే! కానీ పోతున్న ప్రాణాన్ని ఎలాగూ నిలుపలేరు. ప్రాణం నిలిచి వున్న క్షణాలలో కూడా నోటికి తాళం వేస్తా రెందుకు?"

నర్సు కొయ్యబారి పోయింది. "మీ కిప్పుడు విశ్రాంతి అవసరం. మానసికాందోళన అపాయ మౌతుంద" అంది సౌమ్యంగానే.

"నేనున్నది వట్టి అపాయకరస్థితే కాదు నర్స్! అంత్య సమయంలో వున్నాను. ...... అవునా! కాదా! చెప్పు?"

నర్స్ కండ్లవెంట నీరు గిర్రున తిరిగింది. ముఖం తిప్పుకుని చరచరా వెళ్ళి పోయింది.

విజయ విషాదంగా నిట్టూర్చింది. జీవించి సుఖ శాంతులకు కారణం కాలేకపోగా, మరణించి మీకు మరిన్ని బాధ్యతలు అప్పగిస్తున్నాను ఆనంద్ బాబు! ఇందుకు క్షమించ గలరా?

శ్యామసుందరి వారించింది. ఆనంద్ కండ్లను నీరు క్రమ్మింది.

"మీరు నిరాకరించరు. నాకు తెలుసు ఆనంద్‌బాబు! ఇలా రా చరణ్!"

శ్యామసుందరి చరణ్‌ను విజయ మంచం ప్రక్కగా కుడివైపున కూర్చొన బెట్టింది. అతనిలో అమాయకత, ఆశ్చర్యం తప్ప మరొక భావం లేదు.

"నీవు సుందరక్కా, ఆనంద్‌బాబుల దగ్గ రుండగలవా దేవీ?" అంది దుఃఖాన్ని ఆపుకుంటూనే.

దేవీ మౌనంగా తల వూపాడు.

విజీ గుండె పట్టుకుని మరొక సారి బాధగా మూలి గింది. శ్యామసుందరి దేవీచరణ్‌ను తన హస్తాలలోకి తీసుకుంది.

"వస్తానక్కా, మరొక జన్మలో నైనా నీ లాంటి అక్క కావాలనే కోరుకుంటాను."

"అలా అనకు చెల్లీ" సుందరి కుమిలి పోయింది.

విజయ విషణ్ణంగా నిట్టూర్చింది. "నేను కాదంటే ఆగుతుందా అక్కా! ఏదీ ఒకసారి చివరగా నీ చెక్కిలి ముద్దు పెట్టుకోనీ!

శ్యామసుందరి అలాగే ముందుకు వంగింది. విజయ శ్యామసుందరి చెక్కిలి సంతృప్తిగా ముద్దు పెట్టుకుంది.

ఆమె నుదుటి కట్టులోంచి చిప్పిలిన రక్తం శ్యామసుందరి ముఖాన రక్తతిలకమై మెరిసింది. దేవీచరణ్ సుందరి చేతులలో ఇమిడి విజయ నుదుటి నుండి చిప్పిలిన రుధిర స్రవంతికి భీతిచెంది శ్యామసుందరిని కరుచుకున్నాడు.

విజయ బాధగా మూలిగి కడసారిగా సంతృప్తిగా నిశ్వసించింది. నల్ల కలువగా మారిన నీలికలువను చూచి విమలానంద్‌కు దుఃఖం పొర్లి వచ్చింది.

---

దేశానికి జబ్బు చేసింది. గతి తప్పింది. నీతి మాలింది.

అయితే అందుకు కారణం-?

సాంఘిక, ఆర్థిక రాజకీయ, నైతిక జీవన వంకర గీతలు కావా?

వాటిని విస్పష్టంగా చిత్రించిన సమగ్ర నవలే

"దేశానికి జబ్బు చేసింది"